# పుట్టిల్లు

(ఇతర కథలు)

కె. వి. యస్. అచ్యుతవల్లి

గాయత్రీ పబ్లికేషన్సు

విజయవాడ-2.

# స మ ర్ప ణ

ఈ నవల రూపొందించుటలో తమ అమూల్యమైన సలహాల నిచ్చి, సహాయ పడిన, శ్రీవారు, శ్రీ రాఘవాచార్యు గారికి, భక్త్యాంజలితో

— అచ్యుతవల్లి

# ఇందులో

# పుట్టిల్లు

"తొలి ఉగాదిని నేనే! తొలి ఉషస్సుని నేనే!"
అన్న పాట ఎక్కడో రేడియోలో సన్నగా వినవస్తోంది. వాకిట్లో వేపచెట్టు పూతబరువుతో, నెమ్మదిగా, ఆ పాటకు తలవూపుతోంది. మామిడిచెట్లు, ముదురుతోపు ఆకులు, లేతఆకుపచ్చ ఆకుల్ని చూసి "మా మృదుత్వం మీ కెక్కడిదేం?" అని గదమాయిస్తున్నట్లుగా, గర్వంగా తమ చిగుళ్ళని కదిలిస్తున్నాయి. పదిన్నర దాటింది. చైత్రమాసపు తొలి సూర్యుడు చుర్రుమనిపిస్తూ, సర్రుమని ఆకాశం మధ్యకు ఎగబ్రాకుతున్నాడు. అందరి యిళ్ళల్లోనూ, తీపి తీపి వాసనలు వస్తోంటే పిల్లలు నాలుకలు తడుపుకుంటూ మురుస్తున్నారు. సదానందంగారింట్లోనూ, ఉగాది వుషారు తక్కువేంలేదు. సదానందంగారి తల్లి కనకమ్మగారు కూడా ఏదో మూకుట్లో వేసి, ఇల్లంతా కమ్మని వాసనలని వెదజల్లిస్తున్నారు. హాల్లో ఈజీచైర్‌లో జారబడి, పేపరు చదువుకుంటున్న సదానందంగారు, 'భోజనాలకి లేవొచ్చునా అమ్మా!' అని కేకేశారు.

"ఒక్క నిమిషం వుండండి! వంట అయిపోవచ్చింది" అన్నది కనకమ్మ.

"ఈలోగా నీ స్నానం కానీయవోయ్!" బద్ధకంగా పుస్తకం పుచ్చుకుని మంచంమీద దొర్లుతున్న కుటుంబ రావు నుద్దేశించి, అన్నారు సదానందం.

"ఊఁ." బద్ధకంగా లేచాడు కుటుంబం. ఆ రోజు ఉగాది పండుగ! ముక్కోటి ఆంధ్రులకూ, ముచ్చటయిన పండుగ! నూతన వత్సరంలో, రాబోయే రోజులను, తన ఆనందపూరిత ఆశలతో ఆహ్వానిస్తూ, సమస్త జీవకోటీ కల కలలాడుతూ, నూతన చైతన్యంతో పులకించుతోంది. సదా నందంగారు పేపరు మడిచి టేబుల్ మీద పెట్టి, లోపలికి వెళ్ళి తెల్లని పట్టుపంచె ధరించి, రాగిచెంబుతో, పెరట్లోని కుళాయి దగ్గర నీళ్ళుపట్టుకుని వచ్చారు.

కనకమ్మగారు, వెండిపువ్వులున్న పీట కుటుంబా నికి వేసి, మామూలుపీట సదానందంగారికి వేసింది. రెండు వెండి కంచాలూ, కుటుంబానికి, వెండి మరచెంబుతో నీళ్ళూ పెట్టింది. సదానందంగారు, తనకు నిర్దేశించిన పీట మీద కూర్చుని, కుటుంబంకోసం చూస్తున్నారు.

"నీ శార్ధం—నా పిండాకూడూ, కళ్ళల్లోపోసి చచ్చావ్ కుంభుడు నురుగు! చాతకాని పీనుగువి చాత కానట్లు ఛావకూడదూ! నీ చెల్లికీ, తమ్ముడికీ ఇల్లానేపోశావా? నేనంటే ఈసడింపు వెధవ పీనుగుకి!"

నీళ్ళగదిలోంచి కుటుంబరావు గొంతు విన్పించింది సదానందంగారికి. సదానందంగారి మనస్సు, బాధగా మూలిగింది. తల్లి లేనిపిల్ల! దగ్గరసంబంధంకదాఅని ఇచ్చారు. ఇచ్చినందుకు ఒక ముద్దు ముచ్చట లేదుసరికదా; ఇక్కడకు వచ్చినప్పుడుకూడా, ఏదో వంకని తిట్టోనేవుంటాడు కుటుంబం. 'దాని తల్లివుంటే' అన్న భావం తటిల్లుమని హృదయంలోనికి రాగా, సదానందంగారి కళ్లు నిండుకున్నాయి! బాధగా పీటమీంచిలేచి హాల్లోనికివెళ్ళి కుర్చీలోజారబడ్డారు. ఇంతలో అన్నపూర్ణ వచ్చింది.

"లే అప్పా భోజనానికి! వారి స్నానం అయ్యింది" అన్నది. సదానందంగారు, అన్నపూర్ణ మొహంలోకి చూశారు. ఆమె నుదుటిమీద, మామిడిచిగురు రంగు కుంకుమ గర్వంగా మెరుస్తోంది. కొత్తచీర కట్టుకున్న సంబరం, ఆమె పచ్చని శరీరమంతా ప్రదీపిస్తోంది. భర్తచేత పండుగపూటా తిట్లుపొందిన అవమానం, ఆమె ముఖంలో మచ్చుకైనా లేదు. ఆమె ఆత్మాభిమానానికి నివ్వెరబోయారు సదానందంగారు. మెల్లిగా భోజనాలహాలువెంపు వెళ్ళిపోయారు.

"అమ్మా ఉగాదిపండుగనాడు ఏమిజరుగుతే అది సంవత్సరం పొడుగునా జరుగుతుందట! నాన్న నిన్ను ఈ రోజు తిట్టాడు - యింక సంవత్సరం పొడుగునా తిట్టుతాడు గాబోలు అమ్మా!" బాధగాఅన్నది అనూరాధ, పదేళ్ళపిల్లది.

"అమ్మా! నాన్న బలేగా తిట్టాడులే! ఇందాక బూరె పెట్టమంటే నాకు పెట్టావా మరి! అందుకే తిట్టాడు

నాన్న! నిన్ను అల్లా తిట్టాల్సిందే!" అన్నాడు ఎద్దేవాగా తోమ్మిదేళ్ళ రమణ. ఇద్దరిపిల్లల స్వభావ ప్రకటనలని, విని ఆశ్చర్యపోయింది అన్నపూర్ణ. పూవుపుట్టగానే పరిమళించుతుందన్నట్లుగా, ఆడపిల్లకి ఎప్పుడూ, తల్లన్నా తల్లి వేపు వారన్నా అభిమానం ఎక్కువగా వుంటుంది. స్త్రీకి పుట్టింటి మమకారం జన్మ సహజంగా వస్తోంది.

"బయటికిపోయి ఆడుకోండి ఇద్దరూనూ! ఆనక మిమ్మల్ని పిలిచి, అప్పచ్చిలు పెడ్తాను" అని అన్నపూర్ణ, లోపలికి వెళ్ళిపోయింది. రమణ బొంగరాలు తీసుకుని బయటకు ఆడుకుందుకు పోయాడు. అనూరాధకి తండ్రి మీాద బాగా కోపమువచ్చింది. ఆ పిల్లలో పండుగ సరదా అంతా చచ్చిపోయింది. కట్టుకున్న కొత్తగౌను విప్పేసి, గది కిటికీ తలుపులన్నీ వేసేసుకుని, చీకటిగదిలో తల్లికి తగిలిన తిట్లుగురించి ఏడ్చిఏడ్చి నిద్రపోయింది–మధ్యాహ్నం, తల్లి మల్లెపూలు జడకుడదామని లేపేదాకా!"

## 2

"ఇదుగో! నే వెళ్తున్నా తలుపేసుకో!" అని అరుగు మీాదనించి, లోపలికి ఒక కేకవేసి, చూరులోంచి కిర్రు చెప్పులుతీసి తొడుక్కుని, వేపపుల్ల నములుతూ, పొలంకేసి వెళ్ళిపోయారు రాజారామంగారు.

తూరుపు తెల్ల తెల్లవారుతోంది. జీవనభారం మోయ లేని గుమాస్తాలా, సూర్యుడు నెమ్మదిగా, నీరసంగా, తన విధి కుపక్రమించుతున్నాడు. చెరువులో, యింకా బ్రాహ్మణులు రావటంలేదుకదా అని, మాలవాళ్ళు తొందర తొందరగా నీళ్ళు ముంచుకుని పోతున్నారు. సిద్ధేశ్వరి లేచి, తాటాకులదడి వద్దకు వెళ్ళినుంచుంది. దడికవతల వెంపు నుంచున్న పెద్దతమ్ముడు, నానీ."

"అక్కాయ్! పదికుంచాలు చాలవంది చిన్నక్క. మేము స్కూల్‌కి జీతాలు కట్టాలి. వెచ్చాలుకూడా ఇందు లోనే తెచ్చుకుంటే, నెలపొడుగునా, తిండికి గింజలుండవు. అంచేత నీవున్నప్పుడు, ఇంకో యిరవయికుంచాలు ధాన్యం యిమ్మనమని చెప్పమంది'' అన్నాడు

''ఇష్! నెమ్మది. మరిది వూళ్లోనే వున్నాడు. మున్సబు పంపువెంపుచూడు! ఆ పంపులో కుప్పలు నూర్చు కుంటున్నారు. ఆ ట్రాక్టర్ లైటు ఎప్పుడు కనపడితే, అప్పుడు రా! అందాకా కొద్దిగా యిస్తాను'' అని సిద్ధేశ్వరి లోపలికివెళ్లి, పెద్దకూతురు సీతని లేపి తీసుకొచ్చింది. ఇద్దరూ కలిసి పురికి చుట్టివున్న గడ్డివెంటులను తప్పించి, ఒక చిన్న గోనెసంచి నిండుకూ ధాన్యం తీసి, మళ్ళీ పురికి చుట్టివున్న వెంటులని యథాప్రకారం సర్దేశారు. ఆ సంచీ మూటని, మేనమామకి అందిచ్చింది సీత. నానీ వెళ్ళిపో యాడు. స్త్రీలకి పుట్టింటి మమకారం, సహజమే! కాని, తన పిల్లల భవిష్యత్తు గురించి, కించిత్తు అయినా, యోచన చేయక, అత్తవారింటి సొమ్ము, పుట్టింటికి చేరవేయటమే

పనిగా పెట్టుకున్న, సిద్ధేశ్వరిలాంటి స్త్రీలు, మాతృత్వపు పవిత్ర బాధ్యతకే కళంకం తెస్తున్నారు. ప్రతి స్త్రీకి, ఒక బిడ్డ కలగగానే, ఆ బిడ్డ భవిష్యత్తు ఉజ్వలంగా వుండాలనీ, దానికి, తన సర్వశక్తులూ, ధారపోయాలనీ, ఒక దృఢ సంకల్పం కలిగి తీరుతుంది. కానీ పైసా చొప్పున, తమ వాంఛలన్నీ అరికట్టుకొని, కూడబెట్టి, పిల్లల చదువు సంధ్యలకీ పెళ్ళిపేరంటాలకీ; వినియోగిస్తారు, తల్లిదండ్రులు. సిద్ధేశ్వరి సంతానహీన కాదు. ఇద్దరు కొడుకుల్నీ, ముగ్గురు కూతుళ్ళనీ తీర్చి దిద్దవలసిన మాతృమూర్తి! అయినా ఆమె నిర్లక్ష్యంగా అత్తవారిది, ఇంకా సమిష్టి కుటుంబమే కదా, అన్న అసూయతో,తమ సంసారం గుల్లచేసి పుట్టింటి వారి సదుపాయము చూస్తోంది. సిద్ధేశ్వరి పుట్టింటివారు బాగా బ్రతికిచెడిన వాళ్ళు. సిద్ధేశ్వరికి, అరుంధతి అనే చెల్లెలూ, నానీ, వెంకులూ, అనే తమ్ముళ్ళూ వున్నారు. అరుంధతి భర్త బాగా ధనికుడే. కానీ, మూడో పెళ్లివాడు! ముసలివాడు! అంచేత ఆయనకు జ్వరం వచ్చినప్పుడు, అరుంధతి తనకు విషమిచ్చి వుంటుందనే, నమ్మకంతో ఆయన 'ఆస్తి' అంతా పసిపిల్లల హాస్పటల్‌కి వ్రాసేసి చనిపోయాడు. పెళ్ళయిన ఆర్నెల్లకే, అందమయిన అరుంధతి, తెల్లచీరతో, పుట్టెడు చీకటిని నెత్తిన పెట్టుకుని పుట్టింటికి వచ్చింది. తల్లిదండ్రులు, ఏ ధనానికైతే ఆశించి, అరుంధతి నూరేళ్ళ జీవిత భాగ్యాన్నీ, కాలవ్రాశారో ఆ ధనమూ దక్కకుండగానే పోయింది! మిగిలింది, అందమైన వయసులో వున్న అరుంధతీ, తల్లిదండ్రులు, తమ భవిష్యత్తు నెల్లా ఈ

నిర్ధనత్వంతో, తీర్చి దిద్దుతాడో, అని ·ఎదురుచూసే, ఎదిగే ఇద్దరూ మగపిల్లలూ ! చాతకాని తనంతో, అరుంధతి తల్లి తండ్రులు, బెంగటిల్లిపోయి చనిపోయారు!

అరుంధతి తప్పనిసరిగా, నానీ, వెంకుల బాధ్యతని, తలధరించాల్సి వచ్చింది. అక్క-చెల్లెళ్ళ ఆసరాతో, ప్రక్క-వూరి హైస్కూళ్ళల్లో చదువుకొంటున్న, నానీ, వెంకులూ, ఒక విధమైన, స్వేచ్ఛాభావం వల్ల, నిర్లజ్జగా, ప్రవర్తించటం నేర్చుకున్నారు. ఎదిగే మగపిల్లల, విశృంఖలత్వాన్ని ఎవరు ఆపుచేయగలరు? పధ్నాలుగు, ఇరవయినాలుగూ, సంవత్సరాల మధ్యవున్న మగపిల్లలు చెడిపోవటానికున్న అవకాశాలన్నిటికీ, ప్రభావితులౌతారు అది, వారి తప్పు కాదు ! ఆ వయో ప్రభావం అల్లాంటిది! ఆ వయసులో అల వాటు అయిన దురలవాట్లు, తర్వాతి జీవితం అంతా నీడలా, వెన్నంటి పయనిస్తూనే వుంటాయి ! ఆ వయస్సులో వాళ్ళకి, సరయిన ధర్మదీక్ష కలిగేలా, తల్లిదండ్రులు, లేక, బాధ్యత వహించాల్సినవారు, చూడాలి. కుటుంబం కూడా, నానీ, వెంకులు, సహ విద్యార్థి అవటం, వాళ్ళ విచ్చలవిడి ఖర్చులకు, కొంత దోహదకారి అయ్యింది. కుటుంబానికి, పెద్ద ఆస్తి వున్నది. అన్న రాజారామం, ఎంత అడిగితే అంతా తమ్ముడికి, లేదనకుండా ఇచ్చేవాడు. రాజారామం గార్కి, నానీ, వెంకులు, తమ ఇంటికి, యథేచ్ఛగా రావటం అట్టే సహానం కలిగించేది కాదు. కాని కుటుంబానికి, వాళ్ళు, స్నేహితులవటంవించి, తప్పనిసరిగా వూరుకునేవారు. కుటుం

శానికి, ఇంట్లో సర్వస్వతంత్రింగా వుండేది. అతనేమిచేసినా, రాజారామంగారు కల్పించుకునేవారు కాదు. ఏమన్నా అంటే, ఆ స్త్రిని పంచమంటాడని భయం. రాజారామం గారు, వుమ్మడిగా, సంసార నిర్వహణ గురించి, బోలెడన్ని అప్పులు చేశారు. స్వతహా, ఖర్చుమనిషి ! పైగా, సిద్దేశ్వరి, అండర్ గ్రవుండ్ వ్యాపారం ! ఇంట్లో ఏం వందుతే, అవి సగం, పుట్టింటికి రవాణా చేసేద సిద్దేశ్వరి. కుప్పలు నూర్చి, ఎనభయ్యేసి బస్తాలు పురులుగా కడితే, ఒక నెల తిరిగి, మళ్లీ మిల్లులకి బేరం ఇచ్చి, పురి తీసి, కాటాతో తూకంవేస్తే, పది పదిహేను బస్తాలు తేడా వచ్చేది. ధాన్యం ఆరేయి కనుక తరుగుతాయి అనేవాళ్ళు పాలేళ్ళు. "ఎలకలు కన్నాలు పెట్టాయి. వాటిల్లోకి తోడుకున్నాయేమో," అని కుటుంబం ఆ కన్నాలన్నీ తవ్వించేవాడు. కుంచెడు, అడ్డెడు, గింజలు దొరికేవి ! బస్తాలకి బస్తాలు నెల్లాళ్ళల్లో తింటాయా ఎలకలు? రాజారామంగారు మౌనం దాల్చేవారు. ఆయన అనుమానం, తమ్ముడి మీద వుండేది. గట్టిగా అంటే కుటుంబం విడిపోతాడేమో, అప్పులన్నీ తను వొంటిగా కుటుంబంతో విడిపోయి తీర్చలేడని భయం. ఎల్లానో అప్పులన్నీ తీర్చాలి అనుకొంటూ వుండటం, ఈలోగా పిల్ల పెళ్ళో, పిల్లాడి చదువో అవసరంగా రావటం, దానితో ఇవ్వాల్సిన వాళ్ళకి, ఇయ్యలేకుండగా పోవటం, దానితో వడ్డీలకి వడ్డీలు పెరిగిపోయి, తడిసి మోపెడు అయిపోయాయి అప్పులు !

# 3

సిద్ధేశ్వరి చిత్రమైనస్త్రీ! కొంతమంది స్త్రీలకి, అస్తమానూ, సానుభూతి పొందటం ఇష్టముగా వుంటుంది. అందుకని, లేనిపోని కష్టాలు కొని తెచ్చుకుంటారు- ఈ స్వయంభాధితులు! సిద్ధేశ్వరికి, ముగ్గురు కూతుళ్లూ, ఇద్దరు కొడుకులూ వున్నారు. పెద్దమ్మాయ్ సీతకి పెళ్ళి అయ్యింది. ఆ పెళ్ళికి బోలెడంత అప్పు చేశారు రాజారామంగారు. ఆ పెళ్లిముందర, సిద్ధేశ్వరి, తన నగలన్నీ తీసి అమ్మేసింది. రాజారామంగారు, భార్య త్యాగనిరతికి, ముగ్ధులైపోయారు. ఇంట్లో శుభకార్య సమయంలో, ఏ స్త్రీ నిరాలంకరణ ఒప్పకలదు? లేనివాళ్ళు ఎరువు సొమ్ములు తెచ్చుకొని, అలంకరించుకునే ఆనందసమయంకదా అది? సీత పెళ్ళికి వచ్చిన బంధువులంతా, సిద్ధేశ్వరిని, పరామర్శించసాగేరు.

"అయ్యో తల్లీ! మెడ అంతా బోసిపోయిందే? ఇంటికి పెద్దకోడలివి! పువ్వంటి పుణ్యస్త్రీవి! వంటినిండా నగలతో గలగల్లాడుతూ మహాలక్ష్మిలా వుండేదానివి. ఏం చేశాడే మారాజు!" అని అత్తవారి వెంపు ఒక వృద్ధురాలు ఆతృతగా అడిగింది. సిద్ధేశ్వరి, బిక్కగా నవ్వింది.

"ఏం చేస్తాము చెప్పండి! పిల్లలుగలదాన్ని! సమిష్టి కుటుంబమాయె! నాకు, నగలూ నాణ్యాలూ కావాలి అంటూ పట్టుక కూర్చుంటే ఎల్లా కుదురుతుంది? చేసేది

మా అమ్మాయి పెళ్ళయితే, వుమ్మడి ఆస్తిమీద అప్పులు చేయకూడదుకదా!" అన్నది. నిజానికి, ఆమెనగలు అమ్మిన డబ్బు, పైసకూడా, సీత పెళ్ళికి ఖర్చుచేయలా! ఆ డబ్బు పెట్టి, అరుంధతి తనపేర, ఒక యకరం పొలంకొనుక్కుంది. సీతపెళ్ళికి, వుమ్మడిగా, ఇరవయివేలు అప్పుతెచ్చి, ఘరానా సంబంధంతో పెళ్లి జరిపించి దర్జాగా ఖర్చుచేశారు రాజారామం, కుటుంబం.

తల్లి, చాటుగా పుట్టింటిని అమర్చటం, మగపిల్లలు బాబ్జీకి, అబ్బులికి ఏ మాత్రం ఇష్టం వుండేదికాదు. ఆడపిల్లలు మాత్రం, మేనమామలంటే ఇష్టంగావుంటూ, ఇంట్లోని సామాన్లు, పినతల్లికి జేరవేయటంలో తల్లికి సాయపడుతూ వుండేవారు. అసలు కుటుంబం, మొదట అన్నపూర్ణని పెళ్ళచేసుకోనన్నాడు.

"నాకు ఆ అమ్మాయి నచ్చలేదు. నేను చేసుకోను. బలవంతంగా చేస్తే, దేశాలుపట్టి పోతాను." అన్నాడు.

రాజారామంగారు మెత్తబడ్డారు. "ఇష్టంలేందే చేయట మెందుకు? అనవసరంగా, ఒక అమాయకురాలి నూరేళ్ళ జీవితం వ్యర్థలపాలు చేసినట్లు అవుతుంది." అన్నారు సిద్ధేశ్వరితో? సిద్ధేశ్వరి మెదడులో విద్యుత్తు ప్రవహించింది. నచ్చని పిల్లని బలవంతంగాచేస్తే, దేశాలు పట్టిపోతానన్నాడు కుటుంబం, కనుక నిజంగా అన్నపూర్ణనే చేయాలి. చేస్తే, చేయగలిగితే కుటుంబం దేశాలు పట్టిపోతాడు, అప్పుడు, తమ ఆస్తి, రెండు ముక్కలవ్వాల్సిన పరిస్థితిరాదు. అందుకని బాగా ఆలోచించి,

"ఏవో, కుర్రతనం, మాటలు. మీరు లెఖ్ఖ చేయకండి. అవతల పిల్లకలవాళ్ళు, పెద్దమనుష్యులు. మాట న్నాక కాదనటం బాగుంటుందా? వూరంతా ఏవంటారు? 'తమ కూతురుకయితే ఇట్టే పెళ్ళి చేసుకున్నారు. ఆ సిపం చాలొస్తుందని, చెట్టులా ఎదిగున్న తమ్ముడికి పెళ్ళిచేయటంలేదు. రేపొద్దుట తమకొడుకుల్ని వాళ్ళు వూళ్ళు సవరిస్తోంటే ఇల్లానే చూస్తో వూరుకుంటారా?' అంటారు. ఆతను వయసులో వున్నాడు. ముందు పెళ్ళి చేస్తానంటే ఒద్దొద్దని గునిసి, తీరా ఏ జాతిలేనిదాన్నో అభాసు చేస్తే, వాళ్ళొచ్చి నెత్తిన కూర్చుంటారు. అన్నగారు ఎన్నిరోజులకీ పెళ్ళి చేయకపోతే ఏంచేస్తాడుపాపం! అనిమన్నే అంటారు." అన్నది.

రాజారామంగారి భార్య సలహానచ్చింది. "నిజమే! తను అప్పుడే సీత పెళ్ళిచేశాడు. సుబ్బులూ, బాబ్జి. పెళ్లి కదిగారు. తన సంసారం గింజాటన తనదేకాని లోకం సంగతి అంతగా తను పట్టించుకోలేదు. లోకం ఇప్పటికే తన్ని గురించి ఎన్నో అనుకోవచ్చును. అన్నిమాటలు, 'సిద్ది' చెవిన పడివుంటాయికనుకనే కుటుంబం పెళ్ళి చెయ్యమని పోరుతోంది. పిచ్చి సిద్ది! తోటికోడలు, రావాలన్న సంబరమేకాని, వచ్చిన మర్నాటి నించీ వంటింటి పెత్తనందారు అయి, తన జాగా ఖాళీ చేయిస్తుందని దానికి తెలీటం లేదు!" సిద్ధేశ్వరి మీద చెప్పలేని జాలివేసుక వచ్చింది రాజారామంగారికి కుటుంబాన్ని అన్నపూర్ణని పెళ్ళిచేసుకొమ్మని బ్రతిమాలార్గు రాజారామంగారు,

"నాకు నచ్చలేదు, ఆ పిల్ల! ముభావంగా అన్నాడు కుటుంబం.

"నచ్చటం నచ్చకపోవటం ఏమిటిచెప్పు ! మంచి వంశంలో పిల్ల! సెమ్మదస్తురాలు! అంతకంటె కావాల్సిం దేముంది? అయినా ఇప్పటి పరిస్థితిలో మనకు పిల్లనిచ్చే దెవరు?" ఆ ప్రశ్నకి వళ్ళు మండుకవచ్చింది కుటుంబానికి.

"ఇచ్చేదే వాళ్ళే అయితే నేనసలు పెళ్ళే చేసుకోను." అన్నాడు. తమ్ముడి తిరుగుబాటుకి, నిగ్రహశక్తి కోల్పో యారు రాజారామంగారు.

"చేసుకోవూ? ఎందుకని చేసుకోవు? పెళ్ళి చేసుకోక వూరిమీదపడి తిరుగువాతా రాధాయిగాడిలాగా ? అల్లా అయితే నా ఇంట్లో ఒక్క-క్షణం వుండకు. వెంటనే వెళ్ళు!" ఆవేశంగా అన్నారు రాజారామంగారు. రాధాయి, వాళ్ళ దూరపు చుట్టం. నిక్షేపంలా లక్ష్మీదేవివంటి భార్యవుండగా, ఆమెని, వదిలి ఒక తూర్పు మనిషిని రిజిష్టర్ మారేజ్ చేసుకున్నాడు. ఆమెకోసం, ఆస్తిఅంతా హారతి కర్పూ రంలా వెలిగించాడు.

"అయితే నా వాటా నాకు పంచియ్యి ! నేను బొంబాయివెళ్ళి చదువుకుంటాను'' అన్నాడు కుటుంబం. నిజానికి బొంబాయి వెళ్ళి కుటుంబం చదవాల్సిన దేమీ లేదు. రాధాయితో కలిసి, గుర్రప్పందేలు కట్టాలని కుటుంబం వుబలాట !

రాజారామంగారి గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్టయింది. అప్పటికే, వున్నదిగా ఇరవయివేలరూపాయిల

అప్పువుంది. ఇంట్లో చూడబోతే, ఎన్ని వెచ్చాలు తెచ్చినా అయిపోతూంటాయి. పోనీ, దండిగా పిండివంటలతో భోజనాలు చేస్తున్నారా; అంటే ఎప్పుడూ కూరలు లేవు అంటూ, కొత్తిమిర పచ్చడీ, మెంతిమజ్జిగాతో, భోజనం పెడుతుంది సిద్ధేశ్వరి. ఏదయితే, కుటుంబం నోటివెంట, తాను వినాల్సి వస్తుందని భయపడ్డాడో, ఆమాట కుటుంబాం అననే అన్నాడు. తల మునిగిన అప్పులు! ఆ ఏడు పండిన పంట, భూమిపన్నులకే కటాకటిగా సరిపోయ్యేటట్టువుంది. ధాన్యం ధర, బాగా పడిపోయి వుంది. మంచి డిప్రెషన్ రోజులు. కానీ; అంటే రూపాయిలా కళ్ళకద్దుకునేవారు! తననేదో; అదృశ్య హస్తం పట్టి పీడిస్తోందని, అనుకొన్నారు రాజారామంగారు. నిస్సహాయంగా, సిద్ధేశ్వరి వెంపు చూశారు.

"నీ కెందుకు వచ్చి శేదోయ్ నాయినా! నాకు చెప్పు. నువ్వు నాకు పెద్దకొడుకుతో సమానం! నా దగ్గర నీకు దాపరికం ఎందుకు? చదువుకోవాలంటే పెళ్ళి అడ్డమా ఏమిటి! మన కుటుంబ పరిస్థితులు నీకు తెలుసుగదా? ఇలా పంతం పట్టుకు కూర్చుంటే మేమే మయిపోవాలి చెప్పు! మీ అన్నయ్యకి, రాత్రీపగలూ, ఒకటే ఆలోచనగావుంది. నిన్ను బలవంతం చేయలేరు! అటు పెద్దమనుష్యులకి నీమీద తనకున్న భరోసాతో మాట ఇచ్చేశారు. అసలే బ్లడ్ ప్రెషర్ వున్నమనిషాయే. ఈ వ్యాకులతవల్ల ఏ పక్షవాతమో వస్తే ఎవరు చేయగలరు? ఈ ఋణాలన్నీ తీర్చి ఆస్తి నిలబెట్టి నా పిల్లలకి ఒక దారి చూపించే దేముడువి నువ్వే

అనుకున్నాం. నీకు ఈ ఇంటిబాధ్యత, ఒప్పగించాలను కుంటున్నాం. నా ముఖం, పిల్లల ముఖంచూసయినా, కాదనకు నాయినా!" దీనంగా అన్నది సిద్ధేశ్వరి.

ఆమె అంతదయగా మాట్లాడుతోంటే, కరిగి పోయేడు కుటుంబం.

యువకహృదయం ఎప్పుడూ త్యాగబుద్ధితో ఆలోచిస్తోంటుంది. ఏవేవో మహాత్కార్యములు చేసి, కీర్తిపతాకను చేబట్టాలని, వేడిరక్తం పురకలు వేస్తో వుంటుంది. కుటుంబం తననొక మహత్తర త్యాగం చేయబోయే వ్యక్తిగా వూహించుకున్నాడు. అన్నగారి కుటుంబరక్షణకోసం, తన నూరేళ్ళ. ఆనందయుత దాంపత్య జీవితాన్ని, త్యాగం చేసి కేవలం నిస్సారమైన, పెళ్ళికి వప్పుకున్నాడంటే, అది అతనిలోని త్యాగబుద్ధిని, నాగస్వరం పాడి మేల్కొల్పిన సిద్ధేశ్వరిదే ప్రజ్ఞ అవుతుంది. అవదా మరి!

## 4

పెళ్ళి అయ్యేదాకా, అవ్వాలని, వేయిదేముళ్ళకి మొక్కుకున్న సిద్ధేశ్వరి. పెళ్ళి అయిన మరుక్షణాంనించీ, ఇది ఎల్లా బెడిసి పోతుందా అని ఆలోచించసాగింది. పెళ్ళిలో కుటుంబం ఆడపిల్లవాళ్ళతో కలిసి మెలిసి తిరగటం చూసి

నాన్సీ, వెంకులూ తమకి ఇంక దిక్కూ మొక్కూ ఎవరూ లేరని, విలపించారు. చేతులారా పెళ్ళిచేశానే అని సిద్ధేశ్వరి మథన పడసాగింది. ఇంక సీత, సుబ్బులూ, ఇరవయి నాలుగం టలూ, కుటుంబం చేసే ప్రతీ చిన్నపనీ పర్యవేక్షిస్తూ తల్లికి చెప్పటమే పనిగా పెట్టుకున్నారు.

"అమ్మా! పిన్నికి లేతగులాబీరంగు జాకెట్ బాగుం టుందని అన్నాడేవ్! పెళ్ళి వొద్దొద్దని తెగగునిశాడు. ఇప్పు ఆవిడ కొంగు పట్టుకి తిరుగుతున్నాడు.'' అన్నది సీత.

"అవునే పల్లకీలో మన సుశీలని కూర్చోవద్దని కసి రేశాడు. పిన్ని పింతల్లికూతురుని, కూర్చోబెట్టితే నోరు మూసుకు కూర్చున్నాడు." ఒక సమిధ యథాశక్తి తథా భక్తి అన్నట్లు వేసింది సుబ్బులు.

ఈలోగా, సుబ్బులువచ్చేడు అక్కడికి. వాడుకూడా ఏమన్నా వార్తతెచ్చేడేమో అని ఆతృతగా చూసింది సిద్ధేశ్వరి వాడివెంపు.

"అమ్మా! కొత్తపిన్ని ఎంత మంచిది అనుకున్నావ్! నేను సున్నుండలు అడిగితేనే, అవి అస్తమానూ తింటే అజీర్తిచేసి కడుపులో పోట్లువస్తాయని చెప్పి, వాళ్ళగదిలోకి తీసుకవెళ్ళి, మేజామీదున్న పళ్ళెంలోని పంచదార జిలేబీ పెట్టిందే! ఎల్లాగయినా ఈ పిన్ని చాలా మంచిది. అదూ పిన్ని మంచిదికాదు. తాటిపండు తింటేనే చూడలేక చచ్చేది

వెధవముండ!” అన్నాడు సీతకు తమ పిన్నిని అబ్బులు తిట్టి నందుకు చర్రుమంది.

“దరిద్రపు వెధవకానా! ఆ జిలేబీ అంతా నల్లచీమలు పట్టింది. అందుకని నీకు ఇచ్చింది. అంతేకాని నీ మీదప్రేమ పొంగిపొర్లుతుందనుకున్నావా! మేనమామ పెళ్ళాం, మేనత్త వుతుందా, పినతండ్రి పెళ్ళాం పినతల్లి అవుతుందా ! అని ! ఆవునేతితో చేసిన మినపసున్ని అజీర్తి ఏమిటిరా, వెర్రి పీనుగా!'' అంది సీత.

“ఏమోబాబూ! మీతో ఏది చెప్పినా ఇల్లాగే తిట్టారు. మీతో చెప్పటం కంటె రఘుబావతో ఆడుకోవడం మంచిది. ఏమే సుశీ! వస్తావా ఆడుకొంటానికి? రఘుబావ ఇంచక్కా పేకముక్కలతో మేడకట్టాడు. బువ్వాలాట ఆడు కుందాము. దా!” సుశీ చేయిపట్టుకుని అన్నాడు అబ్బులు.

“వాడి మొహానికి పేకమేడ కాకపోతే సిమెంటుమేడ వస్తుందా? మీ రిద్దరూ ఏదో చావండి దాన్నికూడా తీసుక వెళ్ళటం ఎందుకు మేళం?' అన్నది సుబ్బులు.

సుబ్బులికీ, అబ్బులికీ, క్షణం పడదు. పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది.

“ఏమిటాదినా తర్వాత కార్యక్రమము ? అన్నయ్య నిన్నడగమన్నాడు.'' అంటూ కుటుంబం వచ్చాడు.

“అదే ఆలోచిస్తున్నాను.'' అన్నది సిద్ధేశ్వరి.

“అంటే.” ఆతృతగా అడిగాడు కుటుంబం.

“ఏంలేదు. పూర్ణ ఇంకా చిన్నపిల్ల. మన కిల్లానూ గృహప్రవేశం ఆనవాయితీలేదు. మన వూరు చూడబోతే

శుద్ధ పల్లెటూరు. ఇప్పట్నించీ ఆ పిల్లదాన్ని తీసుకవెళ్ళి, మన లంకలో పడేయటమెందుకు? ఇక్కడా తల్లిలేదు. బామ్మ ముసలావిడ. ఆచంటిపిల్లలిద్దరికీ కాస్త సాయి తాగా వుంటుంది. పాపం! కొన్నాళ్ళు, ఆ పిల్లలిద్దరూ, కాస్త రెట్టకట్టేదాకా, ఇక్కడ్నే అట్టేపెట్టితే, సదానందం గార్కి నిశ్చింతగా వుంట్టుంది." అన్నది సిద్ధేశ్వరి.

వదినగారి, ఉదారబుద్ధికి విస్మితుడయ్యాడు కుటుంబం. "స్త్రీ త్యాగశీలి, దయామయి, మాతృమూర్తి అన్నారిందు కనే! ఎంతమంచి సాధక బాధకాలని, ఆలోచించిందీ వదిన! అటు తన చదువూ సాగుతుంది - ఇటు, సదానందంగారు తల్లిలేని పిల్లల్ని గురించి దిగులుపెట్టుకోకుండా నిశ్చింతగా రోజులు గడపకల్గుతారు."

"అలాగేనమ్మా వదినా! నీ ఆలోచన దివ్యంగా వుంది. ఇప్పుడే ఆడపిల్లవాళ్ళతో చెప్పేయి." అన్నాడు కుటుంబం.

అవలీలగా తోటికోడలు తమ ఇంట స్థానాన్ని, ఆక్ర మించకుండా చేయగలిగిన, తల్లి ప్రజ్ఞావిశేషాలకి అద్భుత పడ్డారు సీతా, సుబ్బులు.

సిద్ధేశ్వరికి రాజకీయనాయకుల కుండతగ్గ ప్రజ్ఞావిశే షాలు వున్నాయి. కాని ఆమె సామాన్యస్త్రీగా, ఒకసమిష్టి కుటుంబానికి, ప్రాతినిధ్యం వహించవలసిరావటంతో, ఆ అద్భుత తెలివితేటలు వింతపుంతల త్రొక్కనారంభించాయి. పురవళ్ళు పగవళ్ళుగా ప్రవహించే నదీమతల్లికి, సరయిన

ఆనకట్టలుకట్టి, జలాలను కావాల్సినచోటికి మళ్ళించుకోగలిగితే పృథివి సస్యశ్యామల మవుతుంది. లేనిచో వూరులూ నాడులూ ఆ సుడిగుండాలలోపడి సర్వనాశనమగుచున్నవి.

పెళ్ళయిన సంవత్సరందాకా తన్ని అత్తవారు తీసుకవెళ్ళకపోవటం అన్నపూర్ణకి భయంగా తోచింది. తను అంత అందకత్తెకాని మాట వాస్తవమే! గృహప్రవేశం ఆనవాయితీ లేదన్నారు. ఒప్పుకోవచ్చును. ఒకొక్క ఇంటికి ఒకొక్క ఆనవాయితీ వుంటుంది. కాని సంవత్సరం గడిచినా భర్తనించి కాని, బావగారూ, తోటికోడలునించికానీ, ఏ కబురూ, కాకరకాయ లేకపోవటంతో అన్నపూర్ణకి, భర్త తన్ని వదిలేసి వుంటాడన్న అనుమానం పట్టుకుంది. 'తనంటే అయిష్టతవున్నమనిషిలా అగుపడలేదుమరి! ఆమూడురోజులూ ఉల్లాసంగానే గడిపారు. మరి ఈ పరాన్ముఖతెందుకు! తీసుకవెళ్ళకపోతేమానే, ఒకసారివచ్చి వెళ్ళగూడదూ- అని తనలో తనే మల్లా గుల్లాలుపడేది అన్నపూర్ణ. అన్నపూర్ణతో పెళ్ళయిన తోటి ఆడపిల్లలు, అత్తవార్ల ఇళ్ళకు వెళ్ళటం, మళ్ళీ పండుగలకు, పబ్బాలకు భర్తతో అత్త, ఆడబిడ్డలతో వేడుకగా రావటం, అన్నపూర్ణకి ఏదో లోటుగా అనిపించేది. వాళ్ళు అందరూవచ్చి,

"నువ్వు ఇంకా ఇక్కడే వున్నావా? అత్తవారు తీసుకెళ్ళలేదా" అని అడిగేవారు. అన్నపూర్ణ ఏం చెప్పాలో తోచక, గిజగిజలాడేది.

"ఆ చిన్నది తల్లిలేనిపిల్ల! అని వాళ్ళాయన, ఇక్కడేన్నే వుంచమన్నాడు. అక్కడ పదిమంది పిల్లా జెల్లాతో

చేయలేదని వుంచమంటే వుంచాడు. అదంటే పంచప్రాణా లూనూ, వాళ్ళాయనకి." అని చెప్పేది కనకమ్మగారు.

అన్నపూర్ణకి, క్రోధం వచ్చేది.

"అలా చెస్తావ్ దేనికి మామ్మా? వాళ్ళు నన్ను తీసుకవెళ్ళరుకదా! పదిలేశారు. అని చెప్పేయ్!" వుక్రోషంగా అనేది అన్నపూర్ణ. "పయిపయివాళ్ళు ఎన్నైనా అంటారు. అంతమాత్రాన్న మనం తేలిపోవాలా ఏమిటి? ఇవ్వాళా, రేపటితో పోయే బంధుత్వంకాదు. వాళ్ళతో నీజన్మ ముడిపడింది. ఇల్లాంటప్పుడు మనం పూహూ వాడా చాటుకోవటం నీభవిష్యత్తుకి మంచిదికాదు. నీలోనిలబెట్టుకో గలిగే సహనశక్తే, ని జీవితానికి సుఖశాంతిని ఇస్తుంది. ఏ పరిస్థితుల్లోనూ, సహనాన్ని కోల్పోకు" అని చెప్తూ కన కమ్మగారు కళ్ళనమ్మట నీళ్ళుపెట్టుకున్నారు. అన్నపూర్ణ మామ్మ మాటల్లోని సత్యాన్ని, ఆచరించ పూనుకుంది. అటు పిమ్మటనించీ ఎవరైనా, "నీవు అత్తవారింటికి వెళ్ళ లేదా?" అని అడిగితే "మావారి చదువు పూర్తి కాలేదనో మాచెల్లి తమ్ముళ్ళు, బెంగపెట్టుకుంటారని వుణ్నిచ్చారనో" చెప్పేది.

# 5

ఈమధ్య రాజారామంగారింట్లో చిన్న గాలిదుమారం రేగింది. కుటుంబం పెళ్ళయి సంవత్సరం గడిచినా, భార్యను తీసుకురావటంకాని, తాను అత్తవారింటికి పోవటం కాని, చేయకపోవటంచూసి, స్నేహితుడూ, హితుడూ అయిన రాధాయ్, కుటుంబాన్ని మళ్ళీ పెళ్ళిచేసుకొమ్మని ప్రోత్సహించాడు. కుటుంబానికి ఈ సలహా నచ్చింది. తనకి అన్నపూర్ణ అందం తగదని, కుటుంబం ఏనాడో నిశ్చయించుకున్నాడు. అన్నగారిమాట జవదాటలేక, కేవలం సంసార తృప్తికోసం అన్నపూర్ణని వివాహం చేసుకున్నాడు. "పెళ్ళిచేసుకున్నంత మాత్రాన్న ఆమెతోటే జీవితం అంతా గడపాలని రూల్సువుందా! శ్రీకృష్ణుడికి పదహారు వేలమంది గోపికలు ఎందుకు వున్నారు? అతని అందానికి, మురళీగానానికి సమ్మోహితులైకదా! ఆస్త్రీలు అతని చరణదాసులైపోయారు! ఒక్కొక్క గోపికలో ఒక్కోవిధమైన సౌందర్యం కనిపించి, శ్రీకృష్ణుణ్ని తమవాడుగా చేసుకుంది! అనుకున్నాడు కుటుంబం.

కుటుంబానికి తనొక పెద్ద అందగాడిననే అహం భావం వుండేది. సిద్దేశ్వరీ, పిల్లలూ కూడా పగలుచూస్తే రాత్రికల్లోకి వచ్చేమనుష్యులు! అడుగుపొడుగునా, జానెడు వెడల్పున వున్న సిద్ధేశ్వరి ముఖం నల్ల తెలుకపిండి అచ్చునూ, పాతబైగు చెప్పునూ జ్ఞప్తికి తీసుకవస్తుంది.

పిల్లలుకూడా తల్లిపోలికకు దగ్గర్లోనే వుంటారు. కుటుంబానికి కొంచెం రంగువున్న మాట నాసవమేకాని అంతమాత్రానికే, తనలాంటి అందకాడు మిస్ యూనివర్సుకాకపోతే మానె, కనీసం ఏ ఆంగ్లోఇండియన్ వనితనో తెచ్చుకోవాలన్నంత అహంభావం పెంపొందించుకోవటం, ఏమంత సమర్థనీయం ? పునర్వివాహం చేసుకోవాలన్న తన భావాన్ని అన్నగారికి చెప్పటంతోటే రాజారామంగారు, తోక త్రొక్కిన త్రాచల్లే లేచారు.

"ఏం నీకేం శని దాపురించింది ? వాళ్లు, గుట్టుగల మర్యాదస్థులు కనుక, నీవు ఇన్నిరోజులూ పోకపోయినా వూరుకున్నారు. అదే మరొకళ్ళయితే, అటో ఇటో తేల్చమని, కోర్టుకీడ్చేవారు. ముగ్గురాడపిల్లలతండ్రి అయివుండి కూడా, తమ్ముడు వెకిలివేషాలు వేస్తుంటే చూస్తూ వూరుకున్నాడని, లోకం నా నెత్తిమీద దుమ్ము చెరుగుతారు. నా సంసారం అంతా నడిరోడ్డుమీద నిలబడాలి. ఇంక నా ఆడపిల్లలకి, పెళ్ళిళ్ళు అవుతాయా ? భార్యని వొదిలేసిన పినతండ్రిని చూసి ఎవరు ముందుకు వస్తారూ ? వెధవ వేషాలు మాని, లక్షణంగా వెళ్ళి పూర్ణని, తీసుకొచ్చుకో ! తోటికోడళ్ళిద్దరూ చెరొకపూటా వండుకుంటారు. ఆపద్ధతిమీదే నా ఇంట్లో వుండు. లేకపోతే నీముఖం నాకు కనపడకుండా ఎటయినా పో !" విసుగ్గా అనేసి కండువా దులుపుకుని భుజంమీద వేసికొని పొలంకేసి వెళ్ళిపోయారు. కుటుంబం ఆలోచించలేదు. 'నిజానికి స్త్రీగా, అన్నపూర్ణలో ఏమీ లోపం లేదు. కూడా కూడా త్రిప్పుకుందుకు మాత్రం

తనలాంటి అందగాడిప్రక్కన ఏమాత్రమూ బాగుండదు. కాని తనలాంటి అందమైనవాడు, అన్నపూర్ణలాంటి అనాకారితో సంసారం చేస్తే లోకం అంతా, తన మంచితనాన్ని వేనోళ్ళ పొగుడుతారు. మామగారు ఆస్తిపరుడు. ఆర్జనపరుడు. తను వాళ్ళపట్ల మంచిగా వుంటే, అన్నపూర్ణ వల్ల కలిగిన సంతానాన్ని ఆయనే భరాయిస్తాడుకూడా! తనకి అనుకోకుండా ఒక అనాకారిని కన్య చెరనించి తప్పించాడనే కీర్తి లభ్యమవుతోంటే వదులుకోవట మెందుకు ? ఇంక అందాలమాటా! ధనం పారేస్తే, బోలెడంత అందం కొనుకోవచ్చు! తనలాంటి అందమైన ధనికయువకుడు కావాలనుకుంటే అందాలు దొరకవా ? అందం ఆయుధంగా అడుక్కుతినే స్త్రీలు ఎక్కడవుంటారో రాధాస్వామిని అడిగితే సరి! వాడు, సినిమా స్టార్లనే ఒక వూపు వూపాడు, అనుకొని అత్తవారింటికి ప్రయాణమయినాడు. కుటుంబం. సిద్దేశ్వరి విసుబోయింది మొదట! ఆమె తలచినది ఒక్కటీ, జరుగుతోన్నదొక్కటీ ! ఇష్టంలేని పెళ్ళిచేస్తే పారిపోతాడనుకున్నది. అలా పారిపోలేదు సరికదా, ఆమెగారినే తెచ్చి తననె తిన రుద్దటానికి ప్రయాణమవుతున్నాడు. ఇంక ఆగలేకపోయింది సిద్ధేశ్వరి.

"ఒక్కమాట కుటుంబం!" అన్నది.

"ఏమిటమ్మా!" అన్నాడు కుటుంబం. అతనికి అన్నగారి మీదకంటే వదినగారంటే ఎక్కువ భయభక్తులున్నాయి. సిద్ధేశ్వరి కాపురానికి వచ్చేసరికి, కుటుంబం

అయిదేళ్ళ చంటివాడు. ఆమెని బెజవాడ కనకదుర్గలా చూసుకునేవాడు కుటుంబం.

"మీరు పూర్ణని ఇక్కడకు రమ్మనమని జలవంత పెట్టకండి. బస్తీలో అపురూపంగా పెరిగినపిల్ల పాపం! ఇక్కడకు తీసుకవచ్చి, చెర్లోంచి నీళ్లు జేరబోసి వండిపెట్ట మంటే బాగుంటుందా? అక్కడి మాత్రం ఎవరున్నారు? తల్లి లేని చిన్నపిల్లలు, అక్కకూడా వుంటే సంబరపడతారు. వాళ్ళని బెంగటిల్లచేసి ఇక్కడకు తీసుకవచ్చి మనం బాము కునేదేముంటుంది? మీ అన్నయ్య మాటలకేం లేండి. ఇంట్లో కుండలు డింకీలు కొడ్తున్నా దర్జాలకు లోపం రాని య్యరు. ఇక్కడకు తీసుకవచ్చి ఇంటిల్లపాదికీ,వండి పెట్ట మంటే బాగుంటుందా? అక్కడ హాయిగా వాళ్ళమామ్మ వండి అరచేతిలో ముద్దలు వేస్తేకూడా తినలేనంత దర్జాగా వున్న పిల్లదికదా!" అన్నది.

... ... ...

కుటుంబం సాకూత్తూ లక్ష్మణస్వామి. అతనికి, అన్న గారిపిల్లలే సర్వస్వం! ఆమె ఆజ్ఞ తిరస్కరించటానికి అతనికి బితుకు బితుకుగా వుండేది.

అన్నపూర్ణ భర్తనిచూసి సంబరపడింది. ఇరుగు పొరుగువారందరితో, తాను అత్తవారింటికి, వెళ్ళిపోతున్నా నని చెప్పి సంబరపడింది. కనకమ్మగారు మినపసున్ని, అరి సెలు చేసి, డబ్బాల్లోదాచారు. వచ్చిన వారంరోజులదాకా ప్రయాణం మాట ఎత్తలేదు కుటుంబం. అన్నపూర్ణకి, భర్త వారంరోజులూ తనతోటి గడపటంతో కొంచెం కొత్త వది

లింది. తండ్రికొన్న రెండు కొత్త చీరలూ కుటుంబానికి చూపెట్టింది.

'బాగున్నాయి' ముక్తసరిగా అన్నాడు కుటుంబం.

"అరడజను జాకెట్లకి సరిపడగ బట్టకొన్నారు." అంది అన్నపూర్ణ.

"అలాగా!"

"ఈ రెండుచీరలూ ఒకటి చాకలిదానికి ఇంకొకటి మన పనిచేసే మనిషికీ ఇవ్వాలట. అందుకని కొన్నారు. జాకెట్టు గుడ్డలు అందరికీ ఇమ్మన్నారు. పళ్ళుకొనాలట! గూడెంలో చక్కెరకేళీ, అరటిగెలలు కొనమన్నారు. మామ్మ చలిమిడిచేస్తోంది. పళ్ళకి మా అప్ప డబ్బు ఇస్తానన్నారు; ఇప్పుడే కొనేస్తే అక్కడికి వెళ్ళేసరికి కుళ్ళిపోతాయని!" అంది.

"ఏమిటీ ప్రయాణ సన్నాహం?" అన్నాడు.

"మరి మీరు నన్ను తీసుక వెళ్ళుతారుగా!" అన్నది అన్నపూర్ణ.

"ఏదో పోనీకదా చూసిపోదామని వస్తే నాతో పంపేద్దామని వేసున్నారా? ప్లాను! అంత భరాయించలేకపోతే చెప్పు; తీసుకవెళ్ళి పడేస్తాను. పెద్దఆస్తిమంతులని పేరు. కన్నకూతురికే అన్నం పెట్టటానికి ముఖం చూసుకునే మనుష్యులని నాకు తెలీదు" అని వెంటనే తన బట్టలని సర్దుకోనారంభించాడు. అన్నపూర్ణ నిర్ఘాంతపోయింది. కనకమ్మగారు మెల్లిగా వచ్చారు.

'అయితే ఈ సారికి పూర్ణని తీసుకవెళ్ళవా నాయినా' అని అడిగారు.

'ఈ అవతారమూర్తిని వెంటపెట్టుకు పొమ్మనా మీ వుద్దేశ్యం?' అన్నాడు కోపంగా.

'పెళ్ళి అయి అన్ని ముచ్చట్లూ అయినాక, ఇద్దరూ చెరొకచోట వుండటం ఏం బాగుంటుంది బాబూ! ఏదో తీసుకవెళ్ళి నాల్రోజులుంచుకుని, పంపుతోంటే సబబుగా వుంటుంది. ఏదో కాస్త చేతికీ,కాలికీ సాయితాగా వుంటుంది' అన్నది భయపడుతూనే, కనకమ్మగారు.

"మీ మనమరాలు వండి వార్చకపోతే మేమంతా లంఖణాలు చేయాలనుకొంటున్నారల్లేవుంది. అదేంకుదరదు. నేను తీసుకవెళ్ళను. తీసుకువెళ్ళనిదానికి, నువ్వెందుకు రావటం? అంటే నేనూ రావటం మానేస్తాను" గట్టిగా అన్నాడు. అన్నపూర్ణ లోపలికిపోబు గుడ్లనీరు, గుడ్లకుక్కుకుంటూ, కూర్చుంది.

"ఛ! అంత మాటంనుకు బాబూ! నీకు తీరికవున్నప్పుడు నువ్వే వస్తుండు! నీ కెల్లా ఇష్టమైయితే అల్లానే కానీయి. మాకు మాత్రం ఎవరున్నారు?" అన్నారు కనమ్మగారు.

"అప్పా! నువ్వు తీసుకవెళ్ళదింపెయ్యి నన్ను! ఎన్నేళ్ళిలా? ఆయన ఇష్టంవచ్చినప్పుడు వస్తారు; లేనప్పుడు లేదు" అనేది అన్నపూర్ణ.

"పోనీలే అమ్మా! ఇక్కడమాత్రం నీకేం కష్టం! అతని కిష్టమయినప్పుడు అతనే తీసుకవెళ్తాడు. బొత్తుగా అతని కిష్టంలేనప్పుడు మనం తొందరపడి వెళ్ళకూడదు అతని పరిస్థితి ఏమిటో. ఎందుకని తీసుకవెళ్ళటంలేదో, మన కేంతెలుసు? ఇక్కడకు వచ్చినప్పుడు, సరదాగా మనతో కలిసిపోయి వుంటున్నాడుగదా?" అనేవారు సదానందం గారు.

కాలం ఊరుకోదుకదా మరి! కాలచక్రానికి మనుష్యుల పరిస్థితులతో, ప్రవర్తలనతో ప్రమేయముండదు.

## 6

అసురసంధ్యవేళ! రాజారామంగారు, వీధరుగుమీద కూర్చుని పాలేళ్ళకి ధాన్యం కొలిపిస్తున్నారు. పాలెంవెళ్ళిన కోమటి గురవయ్య బండి నిండుగా, అపరాలు వేసుకుని, నిండు చూలాలిలా అరుగువార నిలబడింది. చిన్న పాత:పుడ్డ మూటపట్టుకుని, చెంగున క్రిందకు దూకాడు రఘు. వెనకా తల నెమ్మదిగా, సుబ్బమ్మ కిందకు దిగుతూ—

'అంతా కులాసానా, అన్నాయ్!' అంది.

"ఆఁ కులాసాగానే వున్నాము. లోపలకు పదండి! వుత్తరం వ్రాయకపోయేవా, మన బండి పంపిద్దును" అన్నారు రాజారామంగారు.

'రావాలని అప్పటికప్పుడు అనుకున్నానన్నాయ్! అందుకని ముందస్తుగా తెలపటం జరగలేదు' అని సావిత్రి లోపలికి వెళ్ళింది. రఘు తెచ్చిన మాట సుశీలా, అబ్బులూ, విశ్వ తూంటే, సుబ్బులు చోద్యం చూస్తున్నట్లు నిలబడింది.

'పెద్దత్తా కాసిని మంచినీళ్ళియ్యవ్!' అన్నాడు రఘు.

చెర్లో కావాల్సినన్ని మంచినీళ్ళున్నాయ్ అల్లుడా! చూడలేదూ?' అంది సిద్ధేశ్వరి.

'వాడేం తెలియనివాడా ఏమిటమ్మా వొదినా! అల్లుడు గ్రామాన్ని మెచ్చుకున్నాడు. మంచినీళ్ళడిగితే, కాఫీ ఇస్తావు గదా అని వేశాడు ప్లాను' హాస్యంగా అన్నది సుబ్బమ్మ.

వెంటనే ముఖం విచారంగా పెట్టింది సిద్ధేశ్వరి

'మీ అన్నగారి ఆవు ఈసుకుపోయింది. సమృద్ధిగా పాలు ఇస్తున్న, కుటుంబం ఒంగోలు ఆవు పురుగుముట్టి చచ్చిపోయింది. ఏదన్నా, చిన్న గేదెని కొనమంటే, దాళవా కోతలు—చేతులో డబ్బులేదు అంటున్నారు, అన్నదమ్ములు. వూళ్ళో ఎక్కడా, గుక్కెడు పాలు దొరకటం లేదనుకోండి. చల్లనీళ్ళకి ముఖం వాచిపోయాము. మజ్జిగ బదులు, బెల్లపునీళ్ళు పోసుకుని తింటున్నాం. అన్నం, కాఫీ, ఎల్లావుందో చూసి, నాలుగునెల్లు అయ్యింది' అన్నది సిద్ధేశ్వరి.

సుబ్బమ్మకి, ఇదంతా కొత్తకాదు. అత్తవారి తరఫు

బంధువులు ఎవరువొచ్చివున్నా, సిద్ధేశ్వరి నాలుగురోజుల్లో ఇల్లంతా, అయ్యవార్లంగారి, నట్టిల్లుచేసి చూపెట్టుంది. ఏదన్నా అంటే,

"నాచేతిలో అక్షయపాత్ర ఏదన్నా వుందను కున్నారా! అందరూ వొచ్చి, నెల్లతరబడి, తిష్ఠలువేసుకు తింటూంటే సామాన్లు, అయిపోక,వూరిపోతాయా! చెట్టుకు కాయుటంలేదు సామాన్లు. రూపాయలుపోస్తే వస్తాయి" అంటుంది. ఆ మాట అనిపించుకోవటం ఇష్టంలేక, అయిదు గురి పిల్లలతల్లిని ఏమీచేయలేక, వూరుకుంటారు రాజారా మంగారు. అంచేతే, చిన్నతనంలో, భర్తని కోల్పోయిన సుబ్బమ్మ, మాటయాభై యకరాలకి కామందులయిన, అన్న దమ్ములుండీకూడా, చిన్న ఆడబడుచు ఇంట్లో ఆపనీ ఈపనీ చేసిపెట్టూ, వాళ్ళనే మంచిమాట ఆడుకుంటూ కాలక్షేపం చేసుస్తోంది. స్త్రీకి కష్టమునకూ, సుఖమునకూ, ఆదుకొనేది పుట్టిల్లు అంటారు. ప్రతిస్త్రీకూడా, తన పుట్టిల్లు అంటే విపరీతంగా ప్రేమిస్తుంది. తన అన్నదమ్ముల ఇల్లు సిరిసంప దల కాలవాలమై వుండాలని కాంక్షిస్తుంది. కాని అన్న తమ్ములు మట్టుకు పెరిగి పెద్దవారైనాక, అక్కచెల్లెళ్ళంటే అంత అభిమానించరు. తమ తల్లితండ్రులు, అక్కచెల్లెళ్ళకి దోచిపెట్టేశారని బాధపడతారు. వారి భార్యలయినా అంతే! ఇంటికి, తమవెంపు బంధువర్గంవచ్చివుంటే వున్న వుషారులు; అత్తఆడబిడ్డలు వచ్చివుంటే వుండవు. ఏల వచ్చెరా దేముడా, అన్నట్లు, లేనిపోని రోగాలు, కోపాలు, దెబ్బలాటలు తెచ్చుకుంటారు.

రఘు ఈలవేసుకుంటూ పెరట్లోకి పరిగెట్టుకుని వెళ్ళి కాళ్ళూ చేతులూ ముఖమూ కడుక్కుని కడుపునిండుకూ నీళ్ళు త్రాగి, చొక్కాతో ముఖం తుడుచుకుంటూ వచ్చి మామయ్యదగ్గిర నిలబడ్డాడు.

"ఏరా పరీక్షలు బాగా వ్రాశావా?" అన్నారు రాజారామంగారు.

"ఓ ! ఫస్టుగా వ్రాశాను మామయ్యా!" అన్నాడు రఘు.

"ఇక్కడ నిలబడకు. దుమ్ము! లోపలికి వెళ్ళి అబ్బులితో ఆడుకో! అత్తని మినపసున్ని పెట్టమని అడు! వాళ్ళే అబ్బులూ! రఘుబావకి, అమ్మని మినపసున్ని పెట్టమన్రా! మీారందరూ ఇంచక్క ఆడుకోండి" అన్నారు రాజారామంగారు.

అంతవరకూ అత్తతెచ్చిన మూటవిప్పి అరటిపళ్ళూ, జామపళ్ళూ, వాటాలు వేసుకుంటున్న అబ్బులూ, సుశీలా మినపసున్ని మాటవినేసరికి ఒక్కసారి లేచిపోయారు.

"అమ్మా అమ్మా! మాకు సున్నుండలు పెట్టవే! రఘుబావకి రెండియ్యవే, వాడు నిన్న లేడుగా!" అన్నాడు అబ్బులు. సిద్ధేశ్వరి, సదానంగా పిల్లవెంపుచూసి, మెల్లిగా నవ్వి రెండుచేతులూ తిరగవేసి బోర్లించింది.

"ఎక్కడున్నాయ్ వెర్రివెధవాయిల్లారా! ఇదీవారస! వొదినా మీా అన్నయ్యకి, తింటానికి నోరువుంది కాని, సామాన్లు తేవటానికి చేతులుండవు. నిన్న మధ్యాహ్నం,

నోరు బాగాలేదంటే కాస్త పిండివుంటే కలిపాను. అది ఇప్పటివరకూ వుంటుందా? అసలే రావణాపిల్లలు! ఏదన్నా చేస్తే, అన్నంకూడా మానేసి, అదే తింటూ కూర్చుంటారు. మీరు స్నానంచేసి రాండి! మధ్యాహ్నం ఎప్పుడనగా, భోజనం చేశారో ఏమో! కాసిని బియ్యం పొంగించుకుంటురు కాని! పిల్లలకి అన్నంవుంది. నాకు నోరు చేదుగా వుంది. నేను ఈ పూట భోజనం చేయను. మీకూ, మీ అన్నతమ్ములకే వంట!" అంది సిద్ధేశ్వరి.

"ఏమిటే అమ్మా! సున్నుండలు అన్నీ. అయిపోయాయా? ఇందాకనే కదూ! బుట్టనిండా పెట్టి సుబ్బిచేత మామయ్య వాళ్ళింటికి పంపించావ్! మాకు పెట్టమంటే లేవని చెప్తావేం?" అన్నాడు అబ్బులు. రఘు అబ్బులు నోటి దురుసుతనానికి విభ్రాంతపోయాడు.

"మాయచచ్చినాడా! నేను మామయ్యా వాళ్ళింటికి వెళ్ళానా? నువ్వుచూచి చచ్చావా! దొంగపీనుగా! ఈసారి ఇల్లాంటి అబద్ధాలుచెప్పు నీ తల పగలకొట్తాను" అని అరవసాగింది సుబ్బులు.

"నేను చూశాను. దడిలోంచి, సూరమ్మగారి పెరట్లోంచి వెళ్ళలేదూ! చేసినవన్నీ వాళ్ళ ముఖాల్న తగలేయటం, ఇంట్లో మాకు పెట్టమంటే లేవు పొమ్మనమంటం! ఇదేం బాగుందేం!" ఏడుపుగా అన్నాడు అబ్బులు. సుబ్బులు ఇంక ఆగలేక, వాణ్ణి బాదసాగింది. వాడు వూరుకోలా! తిరగబడి కొట్టాడు. ఒకళ్ళ నొకళ్ళు కొట్టుకుంటుంటే, రఘు ఆశ్చర్యపోయాడు.

"అబ్బబ్బ వూరుకోవే సుబ్బులూ! అసలే చీపురు పుల్లలా వున్నాడు. వాణ్ణి అలా బాదేస్తావేమికేకా స్తన్నా జాలిలేకుండా?" అన్నది సుబ్బమ్మ ఆగలేక.

"అదికాదు వొదినా! పిడస్నీ లేనిపోని మాటలు కల్పించి అంటాడు. పీడిమాటలు నిబద్ధి అనుకుని, మీ అన్నయ్య నన్ను చావమోదుతారు. అలా చితక్కొట్టినా బుద్ధివస్తుందా ఏమిటి! వెధవ ధనియాలజాతి! మీరు స్నానం చేయండి. రండి; ఆలస్యం అయింది. రాత్రయిపోతోంది" అన్నది సిద్ధేశ్వరి. సుబ్బమ్మ చేసేదేమీలేక, స్నానంచేయటంకోసం, మంచినీళ్ళబిందె తీసుకొని చెరువుకేసి వెళ్ళిపోయింది. సుబ్బులూ, అబ్బులూ, దారాసింగ్, ఆలీరజాలను మించుతున్నారు. నోటికి వచ్చినన్ని తిట్లు తిట్టూ, కొట్టుకుంటున్నారు. సుశీల మధ్య మధ్య రిఫరీగా రాబోయి వాళ్ళ విసురుకు తూలి గోడకు కొట్టుకుంటూ పెద్దగా ఏడుస్తోంది. రఘు ఇంక ఆగలేకపోయాడు. గబగబా వాకిట్లోకి వెళ్ళి,

"మామయ్యా మామయ్యా! వాళ్ళు కొట్టుకుంటున్నారు" అన్నాడు. రాజారామంగారు, మధ్యాహ్నంనుంచీ ధాన్యం తూకం వేయిస్తూ పాలేళ్ళ జీతాలు కొలిపిస్తూ ఆ లెఖ్ఖలతో సతమతమౌతున్నారు. దానితో ఆయనకు ప్రళయకాల రుద్రునిలా అరికాలుమంట తలకెక్కిపోయింది. వెంటనే బెడ్డింగు కట్టుకునే తోలుబెల్టు పుచ్చుకుని, ఏమిజరిగిందో వాళ్ళు యెందుకని కొట్టుకోవాల్సి వచ్చిందో కారణం తెలుసుకోకుండానే—

"నన్ను విసిగిస్తున్నారు వెధవల్లారా! ఇద్దరూ ఛావండి నా శని విరగడవుతుంది" అంటూ యిద్దర్నీ కలిపి బాదసాగారు. అప్పుడే పొలంనించి యింటికివచ్చిన కుటుంబం—

"ఏంటన్నయ్యా అల్లా కొట్టిచంపుతున్నావ్! పిల్ల ముండా వాళ్ళని!" అని మధ్యకు రాబోయాడు.

"నువ్వూరుకో! అడ్డురాకు! ఇవ్వాళ వీళ్ళ అంతూ పంతూ తేల్చేస్తాను" అంటూ ఇంకా బాదసాగేడు.

సాధారణంగా ఎవళ్ళయినా పిల్లల్ని కొట్టుకుంటు న్నప్పుడు, అడ్డురాకూడదు. కొట్టొద్దని మనం అంటూన్న కొద్దీ అదే, వాళ్ళ ప్రజ్ఞా పాటవాలకి, కొలబద్ద అయినట్లు ఇంకా ఎక్కువ కొట్టసాగుతారు. పిల్లలయినా అంతే! ఏడ్చే పిల్లలదగ్గరికి వెళ్ళి—

"మా బాబుగా ఏడవకమ్మా!" అని సముదా యించి చూడండి. మనం సముదాయించినకొద్దీ వాళ్ళు శృతిపెంచుతారు తప్ప, తగ్గనివ్వరు. వద్దన్నకొద్దీ అలవా టుని ఎక్కువచేసుకోవటంలో పిల్లలూ, పెద్దలూ అన్న తేడా ఏమీ లేదు.

సుశీల, చిన్నాన్నచంకనెక్కింది వెక్కివెక్కిఏడుస్తూ.

'మరేం చిన్నాన్నా! రఘుబావ, అక్కాయిమీదా అన్నాయిమీదా, నాన్నారికేమోచాడీలు చెప్పాడు. నాన్నా రేమో, వాళ్ళని కొట్టున్నారు' అన్నది. కుటుంబం అగ్ని హోత్రుడయ్యాడు.

“ఏరా రఘూ ? మింగ మెతుకు లేదు మీసాలకి సంపెంగనూనెలా వుంది నీ బ్రతుకు? వారాలు చేసుకు బ్రతుకుతున్నావు. బుద్ధిలేదురా రాస్కెల్ ! వాళ్ళింటికి వచ్చి, వాళ్ళ పిల్లలమీద చాడీలు చెప్తావురా, ఇడియట్” అని రఘుని చెండటం మొదలుపెట్టాడు కుటుంబం. రఘు తెల్లబోయాడు. తను చేసిన తప్పేమిటో ఆ చిన్న హృదయానికి తెలియటంలేదు. ఇద్దరూ కొట్టుకుని తిట్టుకుంటుంటే గాభరాపడి, మామయ్యతో చెప్పాడు. మామయ్య వాళ్ళని విడదీస్తాడేమో అనుకున్నాడు. ఆయన విడదీయ లేదు సరికదా, ఆయన కూడా వచ్చి బాదుతున్నారు. ఈ దారుణ హింసాకాండతో బాటు చిన్నమామయ్య తన్నితిట్టు న్నాడు. అంతా అగమ్యగోచరంగా కన్పించింది. మారు మాట అనకుండా, వీధరుగుమీదకు వెళ్ళి నల్లని నిశీథాకాశంలో మెరిసే చుక్కల్ని చూస్తూ కళ్ళల్లోని నీరు, కళ్ళల్లోనే ఇంక బెట్టుకుంటూ కూర్చున్నాడు. పొయ్యి భగభగా మండిపోతున్నా బియ్యం పడేయటం మర్చిపోయి నిర్ఘాంత పడి, నిలుచుండిపోయింది సుబ్బమ్మ. సిద్ధేశ్వరి మటుకు, తీరు బాటుగా లాంతరు వెలిగించి గడపమీద పెట్టి, జుట్టు చిక్కు తీసుకుంటూ వూడిపోయిన జుట్టుని కాలి బొటనవ్రేలికి చుట్టుకుంటూ కూర్చుంది.

# 7

అనూరాధ బళ్లోకి వెళ్ళటానికి జడేసుకుని గౌనుతొడు క్కుని, ముస్తాబయి, వంటింట్లో కనకమ్మగారి వెనకాతల నించుంది.

"ఏమే శైంకాలా! నించుంటావేం? వెళ్ళు!" రమణకి తలదువ్వుతోన్న అన్నపూర్ణ కూతుర్ని గదమాయించింది.

"నేనూ, బళ్లోకి వత్తానేరాదా?" అంటూ గింజుకో సాగాడు రమణ. అన్నపూర్ణ వాణ్ని గట్టిగా పట్టుకుంది. అనూరాధ దృష్టి కనకమ్మగారు వేయిస్తోన్న, సగ్గువడియాల మీాదవుంది. అంచేత తల్లి అదిలింపుకాని, రమణ గోల కాని, ఆ పిల్లది పట్టించుకో లేదు. కనకమ్మగారు వెనక్కి తిరిగి చూశారు.

"ఆసి భడవా! వెనకాతల వున్నావా? ఇంద వడియం! తమ్ముడు ఏడుస్తున్నాడు, వాణ్నికూడా తీసుకపో బళ్లోకి!" సగం వడియం రాధచేతిలో ఎత్తివేస్తూ, అన్నారు కనకమ్మగారు.

"వాడు నోక్కా తోడుక్కోడు మామ్మా! పైగా సగంలో, బెంచీ మీాద పడుక్కుని నిద్దరోతాడు. మాష్టారు మీా ఇల్లు దగ్గరేకదా తీసుకపోయి అమ్మగారికిచ్చేసిరా!- అంటారు. వాడు నడవడూ! నేను ఎత్తుకుని మొయ్యలేను." అంది అనూరాధ. తల్లి కనకమ్మగార్ని మామ్మా, అని పిలవ

టంవల్ల, పిల్లలిద్దరూ కూడా కనకమ్మగార్ని మామ్మా, అనే పిలుస్తారు.

"ఎంత చదువు చదివావే గుమ్మడికాయలా ముఖం నువ్వూనూ! పోన్లేరా! దాన్నిపోనీయి! నీకు "ఢమ ఢమా"ల బండికొనిస్తాను ఆనక!" అంది అన్నపూర్ణ రమణని దగ్గరగా పొదువుకుని. అనూరాధ రోడ్డుమీదకు వురికింది.

అన్నపూర్ణ కడుపు ఫలించింది. ఇద్దరు పిల్లలు, పుట్టి పెరుగుతున్నారు. తమనుటుకు తాము ఒక చిన్న సంసారం లాగున్నారు. అల్లాంటప్పుడు ఇంకా పుట్టింట్లో వుంటం బాగు అనిపించలేదు. ఈమధ్య కుటుంబం వచ్చినప్పుడు, మళ్లీ ఒక్కసారి అడిగింది.

"ఏమండీ, నన్నుకూడా తీసుక వెళ్ళండి! ఎంత కాలమనీ, మీరు అక్కడా, నేను ఇక్కడా వుంటం చెప్పండి! ఏం బాగుంటుందీ మీరే ఆలోచించండి!"

"ఏం? నా మీద విరహం భరించలేక పోతున్నావా? అక్కడికెందుకు?" వెటకారంగా అన్నాడు కుటుంబం.

"ఛ! అల్లా అంటారు ఎందుకు? పిల్లలు ఎదిగొస్తున్నారు. పిల్లలు ఎదిగే రోజుల్లో మధ్యస్థంగా వుంటే పాడయి పోతారు. వాళ్ళకి చదువూ సంధ్యలూ, పెళ్ళిళ్ళూ పేరంటాలూ చేయాలా, వద్దా!" అన్నది.

"ఊ! సొదపెట్టకు! నా ఖర్మాన, నన్ను బ్రతకనీయి. ఇల్లా నా రోజులు వెళ్ళిపోతే చాలు!" విసుక్కున్నాడు.

"అదేం మాటండీ! పిల్లలూ భార్యావుండగా ఎంత కాలమని, అన్నగారింట్లో వుంటారు? వాళ్ళుమట్టుకు మీకు ఎన్నాళ్ళు వేడి, వెచ్చాచేసి పెడతారు? నాకున్న బాధ్యత, స్వతంత్రతా, వాళ్ళకేంవుంటుంది ? కావాల్సివస్తే మీకొచ్చిన వాటాలో అయిదెకరాలో, పదెకరాలో ఇచ్చెయ్యండి, పిల్లలు ఎక్కువ వున్నారుకనుక. అంతేకాని వాళ్ళకి ముట్టచెప్పాలని,వాళ్ళింట్లోనే వుండాల్నా!వాళ్లేమో, పెళ్ళాం పిల్లల్ని బస్తీలో దాచుకున్నాడు; మా చేత చేయించుకుంటున్నాడు-అని చెప్పుకుంటారుట! ఏదో మన మానాన మనం పడివుంటే తీరిపోయేదానికి, ఒకళ్ళచేత మాట అనిపించుకోవటం ఎందుకు? మీరు పడేమాటలు అన్నీ వింటుంటే నాకెంత బాధగా వుందో మీ కేం తెలుస్తుంది? నేను ఆ మాత్రం వండిపెట్టలేనా చెప్పండి!" వుద్విగ్నురాలై అంది అన్నపూర్ణ.

"ఏడిశావ్ వెధవ సలహాలూ నువ్వూనూ! అంత కంటే, మా బాబు పెట్టలేక పొమ్మంటున్నాడని చెప్పెయ్యాడవకూడదూ? అసలు సంగతి చెప్పకోవటానికి ఆభిజాత్యం ఛావలేదు! పుట్టింటి మమకారం అడ్డువస్తుంది అమ్మగారికి ! పాపం!" ఈసడింపుగా అన్నాడు కుటుంబం. అన్నపూర్ణ నిర్ఘాంత పోయింది. ఎంత అజ్ఞానదశ్లోచూడండి! ఆణిముత్యాల్లాంటి పిల్లలు! అదితి వంటి భార్య! కేవలం మేము పోషించలేమని పుట్టింటివారు వెళ్ళకొడితే తప్ప, తన భార్యా పిల్లల్ని సంరక్షించుకోవాల్సిన అవసరంలేదనుకునేభర్త! భర్త అనగా భరాయించువాడు - అని అర్థం !

వివాహబంధం అతి పవిత్రమయినది. ఆ మూడు ముళ్ళల్లో వున్న మహిమ అనంతమయినది! వాళ్ళ శరీరాల ఏకత్వంతో పాటు, ఆత్మలు కూడా, ఏకమయిపోయి, అద్వైతభావమును పొందుతాయి అంటారు. జన్మాంతమూ కలిసి ప్రయాణించే, వాళ్ళ జీవితయానంలో, అతి పవిత్రమయిన గృహస్థవిధులను నిర్వర్తిస్తూ ఇరువైపుల బంధువర్గాన్ని పార్వతీ పరమేశ్వరులై ఆదరించాలి!

"అవేం మాటలండీ! వాళ్లు వీళ్లు పోషించగలిగితే మటుకు, మనకని ఒక సంసారం ఏర్పడొద్దుటండీ! పిల్లలు ఎదుగుతున్నారు. వాళ్ళని ఈ లోకంలో వ్యక్తులుగా నిలబెట్టాల్సిన బాధ్యతమనది కాదా? ఇప్పటికయినా మనదంటూ ఒక యిల్లూ వాకిలీ లేకపోతేఎలా?" పుద్విగ్నంగా అంది.

"ఎప్పుడూ వెధవసొద, వెధవసొదాని! నా కోసం కన్నట్లు మాట్లాడుతా వేమిటి? శనిలా దాపురించారు, నా ప్రాణానికి! నువ్వూ నీ పిల్లలూ, ఏ గంగలోదూకినా సరే, నా జోలికిమటుకు రాకండి! కావల్సివస్తే, కాగితం వ్రాసి ఇస్తాను." విసురుగా అన్నాడు.

"నువ్వూ నీ పిల్లలూ" అన్నముక్క అన్నపూర్ణకి కశాఘాతంలా తగిలింది. తనకేమీ కారా వాళ్ళు? వాళ్ళని కనటంలో తప్పంతా తనదేనా? తన పిల్లలట! వాళ్ళు తన పిల్లలు అయితే మరి ఆయనపిల్లలు ఎక్కడవున్నారో మరి? అన్న పిల్లలే తనపిల్లలేమో తనకేమి తెల్సు? ముందు వెనుకలాలోచించకుండా శరీరం అర్పించినందుకు ఫలితం ఇది? ఏదో పిల్లలు కలిగితే నన్నా, వాళ్ళ లేతముఖాల్లో ప్రతి

బింబించే, తన ముఖాన్నయినా చూసి, మనసు మార్చుకుని తనతో సాఫీగా సంసారం సాగిస్తారనుకున్నది. స్త్రీఎప్పుడూ అప్పటికప్పుడు జరిగేదే చూసుకుంటుంది, ముందాలోచన శూన్యం స్త్రీకి! అందుకనే, స్త్రీ పతనమౌతున్నది. పతన మయినా ఆ పరాభవం, స్త్రీనే అగ్ని జ్వాలల్లా చుట్టుముట్టు తుంది. పతనానికి కారణమయిన పురుషుడు మటుకు, మహా రాజులా, ఠీవిగా బ్రతుకుతున్నాడు. అందుకనే, స్వయంగా తాళికట్టిన భర్తతో సంసారం చేయగా పుట్టిన పిల్లల గురించి కూడా, అన్నపూర్ణ తానేదో తప్పుచేసిన దానిమల్లే బాధపడసాగింది.

# 8

సుబ్బమ్మ గురించి అందరూ, తలొక మాటా అంటూంటారు. భర్త పోయేసరికి, సుబ్బమ్మకి ఇరవయి సంవత్సరాలు మాత్రమే వుంటాయి. రఘుకి ఆరు సంవత్స రాలువయసున్నది. అన్నలూ, వదినలూ, ముచ్చటగా సంసారాలు జరుపుకుంటూంటే చూడలేక, ఆ అసూయ భరించలేక అత్తవారి పంచన చేరిందని అంటారు! నిజం దేముడెరుగు, నీరు పల్లమెరుగు– అన్నసామితలా, సుబ్బమ్మ పుట్టింటనే మర్యాదగా, గడుపుదామని ఎంత బాధపడిందో దేముడికే తెలియాలి. నిండు వయస్సులో, విధవయై, చంటి

వాడు తప్ప, మరో సంతలేని యువతి, బావమరదుల్లోనూ, అత్త- ఆడబిడ్డల్లోనూ వుంటం ఏ మంత గౌరవ ప్రదమయిన విషయం కాదు. ఆ సంగతి సుబ్బమ్మకి తెలుసును. అందు కనే భర్తపోయిన పధ్నాలుగో రోజున, అన్న అయిన రాజా రామంగారితో పుట్టింటికి వచ్చింది. తన్ని కనిపెంచిన అమ్మా, నాన్నా, లేకపోయినా, అన్నకూడా, నలుగురు పిల్లలుగల తండ్రికదుక, తన్ని కడుపులో పెట్టుకుని దాచు కుంటుకు సిద్ధమయినాడని అన్నగారన్నా, వొదినగారన్నా పుట్టెడు అభిమానం. నింపుకున్నది సుబ్బమ్మ. పిల్లలు గల వాళ్ళకే మనుష్యులయొక్క మమతలు; అర్థమాతాయి. అనుకుంది సుబ్బమ్మ! సుబ్బమ్మ ఇంటికి వొచ్చిన రెండు రోజులకే సిద్ధేశ్వరికి అంక పొంకాల మీద జ్వరం వొచ్చే సింది.

మాంగళ్యానికిదూరమైన వైవాహిక జీవిత చిహ్నంగా మిగిలిన పసికందుని లోకంలో ఎలానిలబెట్టకలనా- అని అమిత వ్యథ చెందుతూన్న సుబ్బమ్మ, వంటచార్జి తీసుకోక తప్పలేదు.

"పుట్టెడు చీకటిలో వున్నావు. నాకు ఈ మాయ దారిరోగం ఇప్పుడే దాపురించాలా! రెండు రోజులు నీకు దుఖం, తీరేదాకాఅన్నా గుప్పెడు అన్నంవండి పెట్టలేక పోయాను. పాపిష్ఠిదాన్ని!" అంటూ వగలు పోయింది సిద్ధేశ్వరి!

"ఫర్వాలేదు వొదినా! బాధపడి బెంగపెట్టుకోకు! మనలో మనంకాకపోతే పైవాళ్ళు కష్టానికీ సుఖానికీ ఆదు

కుంటారా?" అన్నది సుబ్బమ్మ. అన్నగారిమీద విపరీత మయిన కృతజ్ఞతాభావంతో వున్న సుబ్బమ్మ, తన పెట్టెతీసి నగలమూట తీసింది. తన్ని కష్టంలో ఆదుకున్నారుకదా అని రెండు జతల గాజులుతీసి సీతకిచ్చింది. మూడు వరసల గొలుసు, దండ పట్టీలు, రెండువరసల పుస్తెలతాడూ, వడ్డాణం, మొదలయిన ఇతరవస్తువులు అన్నగారి చేతికిచ్చి, "అమ్మివేసి డబ్బుచేయి అన్నాయ్!" అన్నది. ఆయన అవి అమ్మి సుబ్బమ్మ చేతికిచ్చి;

"ఇదుగో నమ్మాయ్! పంధొమ్మిది వందలు వచ్చి నాయి. తీసుకుని దాచుకుంటావో, లేక వడ్డీకిస్తావో, లేక పదికుంచాల భూమి గొనుక్కుంటావో, నీ ఇష్టంవచ్చినట్టు చేయి. రఘు కుర్రవెధవ! వాణ్ణి ఎల్లాపైకి తీసుకవచ్చి, చదివించుకుంటావో ఏమిటో, నా కంతా అగమ్య గోచ రంగావుంది." అన్నారు బెంగగా.

సుబ్బమ్మ క్షణం తటపటాయించింది. నూటయాభై యకరాలు అజమాషీ చేస్తున్న రాజారామంగారి కన్న, తనకు కావాల్సిన మొగదిక్కు ఎవరున్నారు? తన అన్న తమ్ములు, తనబాగోగులు చూడకపోతే ఇంకెవరుచూస్తారు? ఆమె కళ్ళు అశ్రుపూరితా లయ్యాయ్!

"అదేమిటన్నయ్యా! నాదగ్గరెక్కడ దాచను? ఆడ దాన్ని నాకు డబ్బువ్యవహారాలేమి తెలుస్తాయి? నీదగ్గరే వుణ్నియ్యి! ఏదయినా మంచిపొలం ఖరీదుకొచ్చినప్పుడు, నువ్వేచూసి ఏదన్నా, కొని పడేద్దువుగాని" అన్నది. విన మ్రంగా సుబ్బమ్మ.

"అలాగేనమ్మా! అన్నట్లు రఘు హైస్కూలులో జేరాలి కాబోల్ను, ఏంచేద్దామనుకుంటున్నావ్!" అన్నారు.

రఘు ధర్మధారం వ్యాసయినాడు. "వాళ్ళ మేనత్త దగ్గర వుంచుతాను'' అన్నది.

"ఆమెకే నలుగురు పిల్లలు! వాళ్ళల్లో వీణ్ని ఎల్లా కనిపెట్టుకుని చదివించుతుంది ? నాకొకటి తోస్తూంది. అరుంధతి, పాలెంలో మకాంవుంటుందట! అబ్బాయిని అక్కడ అట్టేపెట్టుదామనుకుంటున్నాను. వాడితోబాటు, రఘునికూడా అక్కడ్నే వుంచుదాము. ఇద్దరూ కలసి చదువుకుంటారు" అన్నారు.

అరుంధతి అంటే మండిపడే అన్నగారికి, అరుంధతి వద్దనే పిల్లల్నివుంచి, చదివిద్దామన్న ఉద్దేశ్యము, ఎల్లా కలిగిందా, అని ఆశ్చర్యపోయింది. సుబ్బమ్మ. "సరేతే అన్నాయ్ అల్లానే పంపిద్దాము.'' అంది. సిద్ధేశ్వరికి జ్వరం బాగా తగ్గిపోయింది. ఇంకా నీరసంమటుకు వదలలేదు. ఏదయినా సాగుబాటులో వుంటుంది. ఇంట్లో జీతం బత్తెం లేని నౌకరు వెనకాసరా లేని విధవ ఆడబిడ్డ ఇంట జేరగా, సిద్ధేశ్వరిలాంటి భాగ్యమయికి, ఎక్కడలేనిరోగాలూ నీరసాలూ, పుట్టుకు రావటంలో ఆశ్చర్యం ఏముంది?

# 9

ఇప్పుడు అరుంధతి, నానీ, వెంకులుంతో, పాలెం జేరింది. అరుంధతి కాస్తో, కూస్తో, మిగిల్చిన డబ్బు, అంతా నానీ, వెంకులూ, కరారావుడిచేసేశారు. చదువు పేరుతో డబ్బయితే ఖర్చుపెట్టారుకాని, వాళ్ళకి అక్షరం ముక్కయినా అంటలేదు సరికదా, పేక ఆడటంమజా అనుభవించటంలో మటుకు బాగా ప్రవీణులైనారు. పెళ్ళిళ్ళుచేస్తే బాగుపడతారేమో అని, అయిదేసి వందల రూపాయలు, కన్యల తల్లితండ్రుల కెదురిచ్చి, పెళ్ళిళ్ళు చేసింది. భార్యలు కాపురాని కొచ్చినా, వాళ్ళకి పావలా డబ్బులు సంపాదించాలి అన్న బాధ్యత పట్టలేదు. వేళకి ఇంటికిరావటం వున్నదేదో తింటం, వూరిమీదపడి తిరగటం తప్ప, వేరే దృష్టి అలవాటు అవలేదు. అరుంధతి గాత్రం వినసొంపుగా వుంటుంది. అమావాస్య నాడు రాత్రి, రెండో ఝామువో, ఒక హరిదాసు, కలలోకి, వచ్చాడని, దేవుణ్ని భజించి, పూజలుచేస్తూ, కైవల్యము పొందమని, తన అగచేతులో కలకండపెట్టి,గుప్పిటమూసి,అంతర్థాన మయ్యాడని,చెప్పేది. సాయంకాలం ఆరుగంటలు దాటినతర్వాత, లేతపసుపురంగు వాయిల్ చీర, అదేరంగు జాకెట్టు వేసుకొని, జుట్టువదులుగా జారుముడి వేసుకుని, వీధి అరుగుమీద "శ్రీరామ పట్టాభిషేకమూ, సీతాకళ్యాణమూ" వున్న పటములముందర కూర్చొని, అరటిపళ్ళల్లో అగరొత్తులు గుచ్చి వెలిగించి,

కొబ్బరికాయలు కొట్టి, తంబుర మీటుకుంటూ, అపర మీరాబాయిలా, వచ్చిన ఒకటో రెండో కీర్తనలను పాడు కుంటూ కూర్చొనేది. ముందర రోజుల్లో ఇది ఎవరూ పట్టించుకోక పోయినా, క్రమక్రమంగా, ఇరుగుపొరుగున వున్న పనిలేని ఆడవాళ్ళు కూడా వొచ్చి కూర్చుంటూండే వాళ్ళు. మరి కొన్నాళ్ళు గడిచాక కొంచెం అలవాటు పడి వున్న మగవాళ్ళుకూడా, వొచ్చి కూర్చుంటూండేవాళ్ళు. అల్లా వస్తూ పోతూ దేముని దగ్గరకి వుట్టిచేతులతో రాకూడదని, పళ్లో పూలో, తెస్తూ అణో బేడో దక్షిణ కూడా వేస్తూండేవారు. క్రమంగా అరుంధతి అరుగు, చిన్న భజన కేంద్రంగా తయారయ్యింది. మగవాళ్ళు, అరుంధతి సొగసుకోసం వస్తే, ఆడవాళ్ళు వాళ్ళమగవాళ్ళని, కనిపెట్ట టానికి వొచ్చేవారు. ఏదయినా, అరుంధతి వున్నంతసేపూ, ఆ అరుగుమటుకు ఖాళీగా వుండేదికాదు. సంవత్సరం తిరిగే సరికి, అరుంధతి ప్రాక్టీసు బాగా ఎక్కువయిపోయింది. దేముడు పటాలకి బదులు, వెండి విగ్రహాలు వెలిశాయి! ఇంకా పెద్దయిల్లు అద్దెకి తీసుకుంది. విశాలమయిన హాలులో విగ్రహాలు వుంచి భజన చేయటం మొదలు పెట్టింది. భగవతీ సాక్షాత్కారం పొందగోరిన నడివయస్కులైన మగవాళ్ళు, అయిదూ పది సమర్పించుకునేవారు. వొదినగారి ఆర్జనని, వెయ్యి కళ్ళతో కాపాడుకుంటూ, ఆమె శరీరం, అలిసిపోకుండా చూసుకునేవారు నానీ, వెంకుల భార్యలు. ఈ స్థితిలో రఘు అబ్బులితోపాటు చదువుకుంటుకువచ్చాడు. పిల్లలు వుంటున్నారన్న సాకుతో, సిద్ధేశ్వరి పది బస్తాల

ధాన్యమూ ఒక పాడిగేదెనీ, పంపించింది. రఘూ, అబ్బులూ, సాయంకాలం భజన ప్రారంభం అవగానే, అందరిళ్ళకీ వెళ్ళి చెప్పి వచ్చేవారు. చిన్న పట్టులాగుసుతోడు క్కుని, కొబ్బరిముక్కలు తరగటం, దేముని విగ్రహాలు తోమటంవంటి పనులు చేసి పెట్టేవారు. రఘుకి, అరుంధతి మీద కొద్దిగా భయం ఏర్పడింది. భజనలే కాకుండా, అరుంధతి ఏకాహాములు సప్తాహాములు కూడా చేయుట మొదలు పెట్టింది. భజన సాయంకాలాలు నాలుగింటికే మొదలు పెట్టినా రాత్రి పదయినా పూర్తిఅయ్యేదికాదు. అందరూ ఇంకా ఇంకా తలలూపేవారేకాని, ఇంక వెళ్తామంటూ లేచి నించునేవారు వొక్కరూ వుండేవారుకారు.

ఆరోజు శరత్పూర్ణిమ. పగలల్లా, వానముంపుగా రావటంవల్ల అరుంధతి భజనచేయలేదు. గదిలో జంపకానా కప్పుకుని పడుకున్న రఘు గదిలో ఏదో అలికిడి అయినట్లు అయి కళ్ళు విప్పిచూశాడు. ప్రక్కమంచంమీద, అబ్బులు మూలుగుతూ పడుకున్నాడు.

"వొరే బావా! కొంచెం అమృతాంజనం తెచ్చి పెట్టవురా తలనొప్పి దంచేస్తోంది." అన్నాడు. రఘులేచి, లాంతరు వత్తి పెద్దదిచేసి, అమృతాంజనం తెచ్చి, అబ్బులు కణతలకి రుద్దాడు.

"ఇంక చాలులేరా, పోయి చేతులు కడుక్కొచ్చి పడుకోరా!" అన్నాడు. రఘు పెరట్లోకి వెళ్ళాడు. మరుగు గోడనీడ, వెన్నెల్లో కొండ చిలువలా పడుకొంది. అంతా నిశ్శబ్దంగా వున్నది- జామచెట్టు మొదట్లో, తెల్లని బట్టల్లో

నించున్న అరుంధతిని చూసి, రఘుకి జడుపు పుట్టింది. నూతి లోకి చేదవేసి, జామచెట్టుదగ్గర నించున్న ఆకృతివైపే చూస్తూ నిలబడిపోయాడు. దబ్బుమని చేద నూతిలోకి జారిన చప్పుడికి, అరుంధతి వులిక్కిపడింది. నూతికేసి చూసింది. రఘు నిలువునా వొణికి పోతున్నాడు. అరుంధతి నెమ్మదిగా రఘుకేసి నడిచి వచ్చింది. వెన్నెల్లో తెల్లని బట్టల్లో, తనకేసి నడిచివస్తున్న అరుంధతిని చూస్తూనే, కెవ్వుమని వెర్రి కేక వేసి క్రిందకుపడిపోయాడు రఘు. అరుంధతి ముందు నిర్ఘాంత పోయింది. కొంచెంసేపు ఆలోచించి;

"రఘూ జడుసుకున్నావా?" అన్నది.

రఘు మెల్లిగా కళ్ళువిప్పి చూశాడు. అరుంధతి అనునయంగా చూసింది.

"లేదత్తా!" కాస్త తెప్పరిల్లి లేచాడు.

"చూడు, అబ్బులికి జ్వరం వొచ్చినట్లుంది. కాస్త ఈ చీటీ లక్ష్మీకాంతంగారి కిచ్చివొస్తావా!" అని నాలిక్కరుచుకుంది. గబగబా లోపలికి వెళ్ళి ఇన్ని జామపళ్ళూ కొబ్బరి చెక్కలూ తెచ్చి—

"చూడు రఘూ ప్రసాదం పట్టుకొని వెళ్ళు! ఇవ్వాళ వాళ్ళింట్లోవాళ్ళు రాలేదు. ఈ చీటీ లక్ష్మీకాంతంగారికి ఇయ్యి! ఆయనే తలుపు తీస్తారులే నీకు!" అన్నది. రఘు మారు మాట్లాడకుండగా, లక్ష్మీకాంతంగారింటికి వెళ్ళాడు. వీధరుగు మీద వెంకట్రామయ్య పచార్లు చేస్తున్నాడు. రఘుని చూడగానే ఆత్రంగా అరుగుదిగి వొచ్చి, ఆ చీటీ

లాగుకొని చదువుకొని చింపిపారవేశాడు. రఘుకి, ఏమి చేయాలో తోచలేదు. ఆయన పైకి ఏమీ తెలియని వాడికి మల్లే.

«ఏమేవ్ ! సాధమ్మగారింటి నించి కుర్రాడు వొచ్చాడే చూడు!» అని లోపలికి గట్టిగా కేకపెట్టాడు. లోపల గాజులు ఘల్లుమన్నాయి. చిన్నసైజు ఐరావతంలా వున్న ఒక స్త్రీమూర్తి ఇవతలికి బరువుగా నడిచి వొచ్చింది.

"ఏమబ్బాయ్! రాత్రిపూట వొచ్చావ్!" అన్నది. రఘు పళ్ళు, కొబ్బరి చెక్కలు, అరుగుమీద పోసి;

"మా అత్త ప్రసాదం ఇచ్చిమంది.మరేమో" సందేహిస్తూ ఆగిపోయేడు. అరుంధతేమో లక్ష్మీకాంతంగారికిమ్మంది, ఆ చీటీ! మరి ఆయనేమో, లాగేసుకుని చదివి చింపేశాడు. చెప్పితే, ఏమవుతుందో ! చెప్పకపోతే, అత్త తన్ని తిట్టుంది. ఆమెగారి కందుకియ్యలేదని ! అననే అన్నది కూడా, తలుపు ఆయనే తీస్తాడనీ. ధైర్యం చేశాడు పన్నెండేళ్ళ రఘు. వెంకట్రామయ్య పిల్లిలా లోపలికి జారుకున్నాడు.

"ఏమిటబ్బాయ్!" అన్నదావిడ.

"మరేమో మా అత్త మీకిమ్మని ఒక చీటీ ఇచ్చిందండీ. అది ఆయన లాగీసుకుని చించేశారు." అని, ఆ ఆజానుబాహుడు, తన్నెక్కడ పట్టుకుంటాడో అని భయంతో పరుగు తీశాడు రఘు.

"ఛీ, వెధవబుద్ధి!" అనుకున్నదావిడ! లోపలకి వెళ్ళింది. వెంకట్రామయ్య బుద్ధిగా పందిరిమంచంమీద, దోమ తెరలో ముడుచుకు పడుక్కున్నాడు.

"హుం ఈవిడతో కూడా మొదలుపెట్టారన్న మాట! మీకు సిగ్గువేయటంలేదూ! ఆమెగారేదో వైధవ్యభారం మర్చిపోవటానికి భక్తిమార్గం సుగమంగా వుంటుందని ఇందులోకి దిగితే, మీలాంటి పెద్దమనుషులు ఆమెని రక్తిమార్గంలోకి దింపారా! యాభయి ఏళ్ళువస్తున్నా మీకు బుద్ధి - నీతీ అంటూ వుండదేం ఖర్మ!" అన్నది.

"ఎంత పిచ్చిదానివే లక్ష్మి!" అన్నాడు వెంకట్రామయ్య.

"స్త్రీ వొద్దనుకుంటే మగవాణ్ని కవ్వించే ప్రయత్నం చేయునేచేయును. నిజంగా, ఆమెకి భగవత్సాక్షాత్కారం కావాల్సి వుంటే, ఏ పుణ్యస్థలానికో పోయివుండేది. అల్లా చప్పబడిపోవటం ఆమె యువ్వనం శరీరానికి ఇష్టంగా వుంటుందా? మండే కోరికలని తీర్చుకోవద్దూ! ఆమెకి పురుష సాక్షాత్కారంకావాలి. విధవయైన స్త్రీకదా! ఏ పురుషుడు ఆమెకి ఆలంబనగా దొరుకుతాడు? దానికి తగినంత పబ్లిసిటీ వుండాలావొద్దా! అందుకని ఈ భజన కేంద్రం పెట్టుకుంది. 'నూరు నోములూ, ఒక్క పాపంతో చెల్లు' అన్నట్లు ఆమె సాధమ్మగారిలా పేరూ పొందింది! ఆ కాషాయ బట్టల వెనుకదాగిన, ఆమె పొంగేయవ్వనాన్ని గుర్తించని, పురుషులు ఎవరుంటారు? ఇదేమీ, ఋశ్యశృంగుల కాలం కాదుగా!" అన్నాడు వెంకట్రామయ్యే!

"ఛీ, ఛీ, ఈ పాడుమగాళ్ళు! ఏ ఆడదాన్ని నీతిగా బతకనివ్వరుగదా!" ఈ సడింపుగా అంది లక్ష్మీకాంతం.

ఛీ,ఛీ! ఈ దిక్కుమాలిన స్త్రీలు! మగాళ్ళని వాళ్ళ ఖర్మాన్న వాళ్ళని వుండకుండా, ఆకర్షించటంమానరుగదా! ఇది అంతే, లక్ష్మీ! అందాన్ని అందుకోవటం, అనుభవించటంలోనే వుంది సృష్టి జీవరహస్యం. నువ్వేం దిగులు పడొద్దు. ఎవరి బాగు వాళ్ళు చూసుకోలేని దానికి నువ్వేం చేయగలవు?" తలక్రింద అరచేతులుంచుకుని పడుకుని నిశ్చింతగా అన్న భర్తని చూసి విస్మయపడింది లక్ష్మీకాంతం.

ఆ రాత్రి అరుంధతికి నిద్రపట్టలేదు. తెల్లవారిలేస్తూనే అందరిమీదా, రుసరుస లాడసాగింది. చెంబులూ, గిన్నెలూ బ్రద్దలు కొట్టుకుంటూ, నూతిదగ్గర దబదబా, నాలుగు చేదలనీళ్లు తోడి నెత్తిని పోసుకుని వంట ఇంట్లోకి వెళ్ళి పొయ్యిముందు కూలబడింది. నానీ భార్య- అమ్మలూ వెంకులుభార్య చిట్టీ ఆశ్చర్యపోయారు. తమ పెళ్ళిళ్ళు అయినది మొదలు ఇంట్లో వంటా, వార్పూ తామే చూస్తున్నారు! మరి ఈరోజు వచ్చిన కొత్తవింతేమిటో, ఈమెగారు రంగంలోకి దిగారు_అని హడిలిపోయారు.

"ఏమంటొదినా మీరు మడికట్టుకున్నారు? ఇవ్వేళ ఏకాదశియా! అయితే మేము స్నానంచేసి చేద్దుముకదా వంట" అన్నారు బుద్ధిమంతురాళ్ళు!

"అఖ్ఖర్లేదమ్మా! నేను పుట్టుకుంటని! ఇందుకోసమే పుట్టాను, ఇందులోనే చస్తాను." విసురుగా అన్నది. తోటి కోడళ్ళిద్దరూ ముఖా ముఖాలు చూసుకుని బయటిగదిలోకి వెళ్ళిపోయారు.

"వదినకంత కోపం ఎందుకు కలిగిందంటావ్!" అన్నది అమ్మలు. చిట్టి గమ్మత్తుగా నవ్వింది.

"నీకంతా అయోమయం అక్కా! కోపం కాదు! ఆమె చేసినపాపం బయటపడుతుందనే భయం!" అన్నది.

"పాపమా?" ఆశ్చర్య పోయింది అమ్మలు.

"కాక!" చిత్రంగా చూసింది చిట్టి.

"వివరంగా చెప్పు చెల్లీ!" ప్రార్థేయతగా అన్నది.

"వదిన బయటచేరి మూణ్నెల్లయింది. ఇంకా చెప్పాలా?" అంది చిట్టి.

"నిజం?" ఆశ్చర్యపోయింది అమ్మలు

"అబద్ధం చెప్పటానికి నాకేమవసరం?" ఎదురు ప్రశ్న వేసింది. చిట్టి.

"ఎవరంటావ్?" ఆలోచనగా అంది అమ్మలు.

"ఛంఘీజ్ ఖాన్ తామర్లేన్ ఎవరైతేనేం నరహంతకులు? - అన్నట్లు వెంకట్రామయ్యో, పశుపతో, విశ్వనాథమో, పూర్ణయ్యశాస్త్రి ఎవరో ఒకరు మహాభక్తులు! సాధు సౌందర్యోపాసకులు! వచ్చిన చిక్కేమిటంటే ఈసాధు పుంగవుల్లో ఒక్కరూ నేనూ - అని నిలబడలేరు. ఈ సమ

యంలో! ఆసమయానికి 'నేను నేను' అంటూ ముందుకు వురకలు వేసుకుంటూ భక్తబృందంలో చేరిన భక్త శిఖామణులే ఈ సమయంలో నీవుఅంటే నీవు అని ఒకళ్ళతప్పు, ఇంకొకళ్ళమీద రుద్దటానికి ప్రయత్నిస్తారు." కాచివడబోసిన దానిలా అంది చిట్టి.

"ఇదంతా నా ఖర్మ చెల్లీ! మేము కూటికి నీరసులం కాని గుణానికి నీరసులంకాము. మావాళ్ళు డబ్బుకక్కుర్తి కొద్దీ నాకుచుట్ట బెట్టారు." నీతిమంతురాలిలా అంది అమ్మలు.

"మావాళ్ళూ అంతే అక్కా! నన్ను కాలేజీలో చేర్పించి చదివించటం అమర్యాద అని మానిపించారు. సంసార పక్షమైన సంబంధం దొరికిందని మురిసిపోయి ముడి పెట్టారు. ఇప్పుడీ సంగతి తెలిస్తే మావాళ్ళు తలెత్తుకుని తిరగలేరు మావూళ్ళో!" అంది చిట్టి, మెడలోని మూడు వరసల చంద్రహారం సవరించుకుంటూను. ఆ హారం అరుంధతి, తనకి పశుపతి ఇస్తే తనకెందుకని, చిట్టికి ఇచ్చింది. అలానే అమ్మలుకీ, విశ్వనాథం ఇచ్చిన రెండు జతల గాజులూ ఇచ్చింది. తన సంపాదనఅంతా తమ్ముళ్ళూ, మరదళ్ళూ సౌఖ్యంగా వుంటానికే వెచ్చిస్తోంది. కానీ పైసకూడా తన కని దాచుకోలేదు మానాన్నికోల్పోయిన అరుంధతి!

# 10

రఘుకి అరుంధతివద్ద వుండటానికి బెరుగ్గావుంటోంది. వాళ్ళమేనత్త కామేశ్వరమ్మది కలిగిన కుటుంబం కాకపో యినా ఒక విధమైన ఆప్యాయతతో గంజో కలో పెట్టేది! స్వంత అన్నకొడుకనీ అదీకాక ఒక్కగాని ఒక్క అన్నకి వంశాకురం కదాని. కామేశ్వరమ్మకి రఘు అంటే పంచ ప్రాణాలుగా వుండేది. కామేశ్వరమ్మకి ఆరుగురూ మగపిల్లలే, ఆడపిల్లలులేరు. రఘు తెల్లగా సన్నగా ఆడపిల్లలా, నాజూగ్గా వుండేవాడు. ఎవరేంపని చెప్పినా విసుగు కనబరచకుండా చేసేవాడు. హోంవర్కు, ఎప్పటిదప్పుడు చేసుకుంటూ పాఠాలు శ్రద్ధగా చదువుతూ స్కూల్లో మాష్టర్లందరికీ, ప్రేమపాత్రుడయినాడు. అరుంధతి వాళ్ళింట్లో రఘూకి ఏదో సత్రపు భోజనం, మఠం నిద్రగా వుండేది. అబ్బులుతిన్నగా చదువుకునేవాడుకాదు. రౌడీపిల్లలతో తిరిగేవాడు. చాటుగా బీడీలుకూడా కాల్చేవాడు. రఘుఅంటే ఆపేక్షగానేవున్నా తనతోపాటు జల్సాగా తిరగడని ఏడిపించేవారు. అంచేత ఒక ఆరునెల్లు గడిచేసరికి రఘు వాళ్ళ మేనత్తదగ్గిరకి వెళ్ళి పోయాడు.

"నేను నీ దగ్గరే వుంటాను అత్తా! వాళ్ళింట్లో చదువుసాగటంలేదు," అన్నాడు.

"వుండరా నేను వద్దన్నానా? పిచ్చివాడా!" అన్నది మేనత్త.

రఘు మళ్ళీ వాళ్ళ మేనత్తగారింటికి మారిపోవటం అరుంధతికేమీ కష్టం కలిగించలేదు. కాని సిద్ధేశ్వరికి మటుకు అది తన అపజయానికి మొదటి చిహ్నంగా తోచింది. తన మేనల్లుడు వుంటం లేదుకదాని రాజారామంగారు నాలుగు బస్తాలు ధాన్యం తగ్గించేస్తారేమో అని సిద్ధేశ్వరి భయపడింది. అందుకని భర్తతో-

"చూడండి, మన రఘు? వేలెడంత వున్నాడో. లేదో అన్నీ వెధవ అలవాట్లు చేసుకుంటున్నాడట! సిగరెట్లు కాలుస్తాట్ట. మన అబ్బుల్నికూడా కాల్చమన్నాడట! నాకలవాటు లేదని మొహంతిప్పేసుకున్నాడట మనవాజమ్మ. రౌడీ పిల్లకాయలతో చేరి మన అరూ, వెంకట్రామయ్యాదీ, పేర్లు గోడమీద వ్రాస్తున్నాడట. అరూ 'ఇదేమిపనిరా, రఘూ! తప్పుకాదా!' అని మందలిస్తే పుస్తావచ్చి వాళ్ళ మేనత్తగారింటికి వెళ్ళిపోయాట్ట! ఏమిటో నిర్వాకం చేస్తాడు మనకొడుకు" అని సుబ్బమ్మ మురిసిపోతోంది పాపం! వెధవ సావాసాలు చేస్తే మగపిల్లలు చెడిపోరూ?" అంది.

రాజారామంగారు ఏమీ మాట్లాడలేదు. ఆయనకి అరుంధతి బ్రతుకు గురించి చూచాయగా తెలిసింది అందుకని రఘు వుండకపోయినంత మాత్రాన్న అరుంధతి పరపతి తగ్గిపోదుకనుక వాడికి ఎక్కడ ఇష్టంవుంటే అక్కడే వుండి చదువుకోవచ్చును-అని వూరుకున్నారు. ఈమధ్య సిద్ధేశ్వరికి, సుబ్బమ్మ తనింట్లో వుండిపోవటం అట్టే నచ్చలేదు. సీతకీ సుబ్బులికీ పెళ్ళిళ్ళు అయి అత్తవారిళ్ళకి వెళ్ళిపోయారు. వాళ్ళభర్తలు 'జామాతో దశమో గ్రహః' అన్నదానికినిమా

పణాలుగా అధికారాలు చెలాయిస్తున్నారు. వాళ్ళు పుట్టింటికి వచ్చినప్పుడల్లా దోసెడేసి రూపాయలు ఇయ్యందే వెళ్ళరు. అటు పెద్దకొడుకు బాబ్జీ, చక్కగా వుద్యోగం చేసుకుంటున్నాడని సంబరపడటానికీ తమకు ఆసరాగా వుంటాడని ఆశపడటానికీ అవకాశం లేకుండగా అతను ఒక అమ్మాయిని ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. ఆ అమ్మాయి పుట్టింటినించి చిల్లికానీ తెచ్చుకోకుండా వచ్చింది.

ఇటు తనఅల్లుళ్ళనుకున్నట్టు పిండేవాళ్ళయినా కోడలు కాస్త సిరీ సంపదాలల ఇంటిపిల్ల అవుతుందేమో అని ఎదురు చూసిన సిద్ధేశ్వరి ఆశ నిరాశ అయిపోయినది. ఇల్లుకిచాటుగా నడుస్తోన్న పరిస్థితిలో ఈ సుబ్బమ్మ ఆమెకి ఒక శనిదేవతలా కన్పడింది. కూతుళ్ళకందియాల్సిన సొమ్ము కోసరం ఆమె చాటుగా ధాన్యం అమ్ముకోవటం, వడ్డీలకి అప్పులివ్వటం, పాలూ, పెరుగూ అమ్ముకోవటం సుబ్బమ్మ కనిపెట్టోందేమో అని సిద్ధేశ్వరికి దుగ్గగా వుండేది. నిజానికి సుబ్బమ్మకి ఈ విషయాలేమీ పట్టేవి కానేకావు. తెల్లవారి లేవటం, అంట్లన్నీ చెరువువద్దకి జేరవేసి తోమి ఇంటికి తెచ్చి కాఫీకాచి అందరికీ ఇచ్చి మళ్ళీ చెరువుకిపోయి స్నానంచేసి నాలుగుబిందెల నీళ్లు జేరవేసుకుని, మడికట్టుకుని, వంటచేసి ఇవతల అందరికీ వడ్డించి, తాను తిని మడివిప్పేసి కంచాలు ఎంగిళ్ళూ, ఎత్తిపెట్టి ఇల్లుకడుక్కొని తృప్తిగా ఏచాప మీదో వారిగి ఏ భాగవతమో రామాయణమో, చదువుకుంటూ కూర్చొనేది. మళ్ళీ నాలుగుకాగానే పొయ్యి రాజేసి కాఫీచేసి సిద్ధేశ్వరి ఏమన్నా ఫలహారం పురమాయిస్తే

చేసి అందరికీ పెట్టి తాను చెరువుకుపోయి అంట్లన్నీ తోము కుని స్నానం చేసి ఇంటికివచ్చి నాలుగుబిందెలనీళ్ళు మళ్ళీ జేరవేసుకుని అందరికీ వండి పెట్టేది. ఆమెకి కాఫీ అలవా టుండేదికాదు. ఒక్కపూట భోజనం చేసేది. రాత్రిళ్ళు అందరి భోజనాలయినాక మిగిలివుంటే మజ్జిగచుక్క త్రాగేది; లేకపోతే అల్లానే పడుకునేది. అలాంటి అజాత శత్రువు అయిన సుబ్బమ్మ సిద్ధేశ్వరికి విడతీయలేని సమస్యగా కన్పడింది! ఇల్లాలు విరుద్ధభావాల పుట్ట అయినప్పుడు, ఇల్లు అగ్నిహోత్రంలా మండటం ఆశ్చర్యపడవలసిన విషయం కాదు. సిద్ధేశ్వరిలో ఈ మూర్పు రావటం సుబ్బమ్మ కని పెట్టలేదు. సుబ్బమ్మకి నాలుగు సామాన్లూ వుంటే వండి పడేయటం తప్ప వాళ్ళ ఆలోచనలు, వీళ్ళ ఆలోచనలు కనిపెట్టగల సామర్థ్యంకానీ, కనిపెట్టుదామన్న వుద్దేశ్యంకానీ వుండేదికాదు.

# 11

భర్త పోయినది మొదలు రాజారామంగారి పంచనే వుంటూ కాలం వెళ్ళదీస్తున్నది సుబ్బమ్మ. రఘూ నెమ్మ దిగా పెద్దవాడయినాడు ఆ యేటితో స్కూల్ ఫయినల్ క్లాసు అయిపోతుంది. ఇన్నిరోజులబట్టీ కుర్రాణ్ణి అడ్డంవేసు కుని భర్తకి వాళ్ళచేతా వీళ్ళచేతా, తర్పణం వదిలించేది.

ఈ వీటితో హైస్కూల్ చదువు అయిపోతుంది కనుక వాడికి వదుగుచేసేస్తే ఇంక ఎవర్నీ బ్రతిమాలాల్సిన అవసరం వుండను అనుకొంది. అంచేత ఒకరోజు తీరిగ్గా భోజనాలు అయినాక హాలులో అందరూ కులాసాగా కబుర్లు చెప్పుకుం దుకు కూర్చొన్నప్పుడు అన్నగార్ని వుద్దేశించి అన్నది సుబ్బమ్మ.

"అన్నయ్యా, వాడి మెళ్ళో ఓ జందెం పోగువేసే భారం నీదే! ఈ ఎండాకాలం సెలవల్లో కానిచ్చేద్దామని చూస్తున్నాను."

"అదేంటమ్మాయ్! అల్లా అంటావు ? ఒంటిపోగేం ఖర్మం! జంటపోగుల బాధ్యత మాత్రం నాదికాదా ఏమిటి ? ఏమంటావ్ సిద్దీ?" మురిపెంగా అన్నారు రాజారామం గారు.

"ఏమంటాను ? సంతోషిస్తాను ! అప్పటికి చూడొచ్చామా, చేయొచ్చామా ? ఎవరిపరిస్థితులు ఎలా పెట్టాడో భగవంతుడు?" నిమీలితంగా చూస్తూ అన్నది సిద్ధేశ్వరి.

సుబ్బమ్మ మనస్సు చివుక్కుమన్నది. అయినా ఆత్మీయతని చంపుకోలేని సుబ్బమ్మ-

"అదేంటొదినా ! అలాగంటావ్ ? చిన్నప్పణ్నించీ మేనమామ ఆశ్రయంలో పెరిగినవాడు, మీ మాటకాదంటాడా! ఏది ఏమయినా 'సుశీ'ని వదలనుసుమా !" అన్నది సుబ్బమ్మ.

"మెరికలాంటివాడు ! వాణ్ని పైకి పోనిస్తానేమిటే అమ్మాయ్ !" అన్నారు రాజారామంగారు.

"బాగుంది ! మహాబాగుంది ! మీరిలా ముచ్చట్లు పడుతో వుండండి ! అది విన్నదంటే మీ బస్తీమరదలు ముందే బెంగెట్టుకుంటుందిగా అక్కడా పెరుగుతున్నదిగా, ఒక రాచకన్యక !" అన్నది సిద్ధేశ్వరి.

వాతావరణంలోని మార్పు గమనించారు రాజా రామంగారు.

"సరిసర్లెండి ! మన అబ్బులికికూడా సెలవల్లో వడుగు చేద్దామనుకున్నాకదా ! ఇద్దరికీ కలిపి చేసేస్తే సరి పోతుంది. ఇద్దరకూ చేసేద్దాం !" అన్నారు రాజారామం గారు వైశాఖమాసంలో వడుగు ముహూర్తం పెట్టారు. ఇంటిపెత్తనం కుటుంబానికి ఇచ్చారు. కుటుంబం పెత్తన మంటే సామాన్యంకాదు. సహజంగా మహారాజశ్రీవి కుటుం బానివి. చేసేది శుభకార్యం. కాస్త ఘరానా కుటుంబ మాయె! పేనుకు పెత్తనం ఇస్తే, తలంతా చెడగొరిగిందన్న సామెతగా, తమచుట్టాల్ని, సుబ్బమ్మ అత్తవారి తరఫు చుట్టాల్ని అందర్నీ పిలిచారు. అందరికీ అయిదారురోజులు ఘరానాగా విందులు చేశారు. ఒకరోజు గానకచ్చేరీ, ఒక రోజు వాద్యకచ్చేరీ, ఇంకోరోజూ భరతనాట్యమూ, ఇంకో రోజు హరికథా అయిదోరోజు షెహనాయిలతో ఫెళ్లు మంటూ వూరిలోని జనం అందరికళ్ళకీ విందుగా చెవుల పసందుగా జరిపించారు. అందరూవచ్చి చాలవటువులను,

ఆశీర్వదించి, కుటుంబం చేసిన ఏర్పాట్లు చాలా బాగున్నాయి అని మెచ్చుకొని, తృప్తిగా భోజనంచేసి వెళ్ళారు. కుటుంబం భుజాలు తడుముకున్నాడు. శంఖ చక్రాలు అతని భుజాలమీద మొలవలేదు. అయినా, అన్నగారు తనమీద పెట్టిన బాధ్యత తాను నిర్వర్తించాననే తృప్తితో ఛాతీ విరుచుకునే నడిచేడు. వచ్చినబంధుజనం అంతా వెళ్ళిపోయే సరికి, రఘు వాళ్ళ పరీక్షా ఫలితాలు తెలిశాయి. రఘు ఫస్టుమార్కులతో ప్యాసయ్యాడు; అబ్బులు పరీక్ష తప్పాడు. రఘు ఇంటరు చదువుతానన్నాడు.

"డబ్బు చాలద్దా నాయనా! ఏదన్నా వుద్యోగం చూసుకో ఇంక" అన్నది సుబ్బమ్మ.

రఘుకి చిన్నతనమనిపించింది. ఎమ్మేలు ప్యాసయిన వాళ్ళకి వుద్యోగాలు లేక అఘోరిస్తోంటే తన స్కూల్ ఫయినల్ చదువుకు ఎవరు పిలిచి యిస్తారు ఉద్యోగాలు? ఒకవేళ ఏ కోమటి కొట్లోనో పద్దులు వ్రాయటానికి కుదిరి, వాళ్ళిచ్చే ఇరవయిరూపాయలతోనూ, తమ ఇద్దరి జీవితాలు గడుస్తాయా! బి. ఎ. అయినా ప్యాసయితేనేకాని, వంద రూపాయల ఉద్యోగం రాదు. రఘు ఇప్పుడిప్పుడే, లోకంలో తను నిలవాల్సిన స్థానంగురించి ఆలోచించుతున్నాడు.

"అమ్మా! నాకు మంచి మార్కులు వచ్చాయి. ముందు ఎలానో కాలేజీలో జేరితే, స్కాలర్ షిప్పు సంపాదించుకునే ధైర్యంవుంది. అదీకాక, నాన్న పోగానే నీ నగలన్నీ అమ్మి మామయ్యచేతికిచ్చి డబ్బు దాయించావు

కదా! అదిప్పటికి ఏ నాలుగువేలో అవుతుంది. అది పుచ్చుకుని, మనిద్దరం మకాం పెట్టుకుందాం? కనీసం, బి. ఎ. అయినా ప్యాసవుతేకాని, మంచి వుద్యోగం రాదు" అన్నాడు. సుబ్బమ్మ బాగా ఆలోచించింది. రఘుకి చదువు చెప్పించాలి. వాడి ఉత్సాహ తరంగాలకి ఆనకట్ట కట్ట కూడదు. ఆడపిల్లలున్న ఇద్దరు మేనమామ లున్నారు. వాళ్ళకి ద్రవ్యలోపమేమీ లేదు. ఎవరయినా ఆదుకుంటారు ఆ సమయానికి! అని ధైర్యం చేసింది సుబ్బమ్మ. చేతికి ఆసరాగా వుంటాయని వుంచుకున్న, రెండువందల రూపాయలతో పట్నం వెళ్ళి రఘుని కాలేజీలో జేర్పించింది. నెలకి పదిరూపాయిలకి ఒక చిన్నగది తీసుకుని, అక్కడ మకాం పెట్టారు తల్లీకొడుకూను. 'అమ్మయ్య! ఈ విధంగా, వాళ్ళంతటవాళ్ళే, వదిలారుకదా' అని నిట్టూర్చింది సిద్ధేశ్వరి. రఘుకి స్కాలర్ షిప్ వచ్చింది. పుస్తకాలు కూడా కొనకుండా, లైబ్రరీకి వెళ్ళి, పుస్తకాలు తెచ్చుకుని, చదువుకునే వాడు. రెండువందలు ఎంతకాలమని వస్తాయి? ఎంత పొందికగా గడుపుకున్నా నాలుగు నెల్లు గడిచేసరికి, నయాపైన లేకుండగా, ఖర్చుఅయిపోయింది. రాజారామం గారికి డబ్బు పంపమని, యెన్ని వుత్తరాలు వ్రాసినా జవాబు లీయకపోవటంతో, సుబ్బమ్మ అన్నగారింటికి బయలుదేరక తప్పలేదు. సుబ్బమ్మ రాకచూసి, ముఖం చిట్లించుకుంది సిద్ధేశ్వరి.

అయినా సుబ్బమ్మ చూడనట్లుగానే, గమనించ

నట్లుగానే అలవాటుగా లోపలికి వెళ్ళిపోయింది. ఇంక తప్పని తద్దినం అనుకుందేమో!

"రఘు జాగ్రత్తగా చదువుకుంటున్నాడా?" అంది.

"బాగానే చదువుకుంటున్నాడు వొదినా! మీ చలవ ఇదంతాను" అంది కృతజ్ఞతగా సుబ్బమ్మ.

"మేం చేసిందేముందమ్మా! వాడి కృషి! కృషితో నాస్తి దుర్భిక్షం అన్నారుకదా?" అంది. ఇంతలో రాజా రామంగారు పొలంనుంచి వచ్చారు. సిద్ధేశ్వరి లోపలికి జారుకుంది.

"వీదన్నా డబ్బు సర్దుబాటు చేయాలి అన్నయ్యా" దడుస్తూనే అడిగింది.

"ఇంకా కోతలన్నా పట్టలేదు. నా దగ్గర డబ్బేలా వుంటుందమ్మాయి?" అన్నారు రాజారామంగారు.

"అదికాదు అన్నయ్యా! అప్పుడు నా నగలమ్మి ఇచ్చినడబ్బు, నీకు పొలం వీదన్నా కొనిపెట్టమని ఇచ్చాను కదా! ఆ డబ్బు యిచ్చేస్తే ఎలాగో ఈ నాలుగేళ్లూ, గడిపేస్తాం. ఆపయిన, ఇచ్చినవాడు చల్లగాచూస్తే వీదన్నా ఉద్యోగంలో చేరిపోతాడు" అంది సుబ్బమ్మ.

రాజారామంగారు కస్సుమని లేచారు.

"అన్నాళ్ళు నా యింట్లోపడి తిన్నారు, మిమ్మల్ని నేను కానీ అడిగానా? ఈనాడు, వాడు నీకు మొసరు ఎక్కించాడు కనుక నువ్వు నన్ను, స్వంత అన్నయ్య అనే ప్రేమ అన్నా లేకుండగా, నీ డబ్బు లెక్క - జమా, అడగటాని కొచ్చావు. నీ ముష్టిడబ్బు కావాలనుకున్నావా?" అంటూ

పెద్ద పెద్ద గావుకేకలు పెట్టూ, పిల్లల వడుక్కి అయిన ఖర్చులు వ్రాసిన పద్దుపుస్తకం సుబ్బమ్మమీదకి గిరవాటు వేశాడు.

"చూడు అమ్మాయ్! మొత్తం అయిన ఖర్చు, నాలుగువేలల్లోనూ, నీ వంతు రెండు వేలూ, అయిపోయాయి. నేను కనుక నీ డబ్బులోది ఎర్రని ఏగాణీ, ఎరుగుంటే నాపిల్లలకి నేనుకాకుండా పోతాను. పోనీ ఏదో దిక్కుమాలినవాడు కదా అనీ, నాకగా ఆడపిల్లలు కలిగున్నారు కదాఅనీ, జేందిశాను. ఈ నాడు వాడు ఏకుమేకై కూర్చుని; ఇప్పలాడిలా, జమాఖర్చు లడుగుతాడా? గతిలేని వెధవకి కాలేజీ చదువెందుకు!" అంటూ బయటకెళ్ళిపోయాడు. సుబ్బమ్మ ముఖం వివర్ణమై పోయింది. ఆ పద్దుపుస్తకం చేత్తోపుచ్చుకుని, సిద్ధేశ్వరిదగ్గర కెళ్ళింది.

"చూడు వదినా! నేను నగలమ్మి ఇచ్చిన డబ్బు అంతా, వడుగుకి ఖర్చు అయిపోయిందంటున్నాడు అన్నయ్య! అంత ఖర్చు నేను నిభాయించుకోగలనా? రఘూ చూడబోతే ఇక్కడ పెద్దమామయ్య తన డబ్బుని, పిల్లల్ని పెట్టిస్తున్నాడుకదా, అనే ధీమాతో, కాలేజీలో చేరి కూర్చున్నాడు. కుర్రవాడివడుగు అంత డాబూ దర్పంగా నేను చేయమన్నానా? ఏదో కోవెల్లో దేముడి సమక్షంలో, జరిపించితే పోయే దానికి తల విరబోసుకుని, ఖర్చుపెట్టారు. మీ పిల్లడిదయితే, ఏదో మీకు ఇంత కలిగున్నది కనుక, దర్జాగా చేసుకున్నారు. మీ వాడితో సమంగా, మావాడికి కూడా, ఎందుకు చేయాలి చెప్పు! పోనీ, ఏదో మేనమా

మలుకదా జరిపించుతున్నారు అని కలగజేసుకోకుండా ఊరు కున్నాను. ఊరుకున్నందుకు, నా డబ్బంతా ఖర్చు చేశారు. ఇప్పుడు, ఒక వెయ్యిరూపాయిలన్నా సర్దితే, ఎలానో కష్ట పడి వాణ్ణి గట్టెక్కించుతాను. వాడయినా, పద్దులూ అవి వ్రాసి, నెలకి నలభయి, యాభయి సంపాయిస్తున్నాడుకానీ, కూర్చోవటంలేదు. వాడు చదువుకుని పరీక్షలు ప్యాసయితే మీకుమాత్రం లాభంకాదా చెప్పు!" సంగతి బోధపరుస్తున్నట్లు అంది సుబ్బమ్మ.

సిద్ధేశ్వరి తలవాంచుకుని ఆలోచించింది. క్షణంఆగి;

"ఏమో! ఆయనకి మేనరికాలు ఇష్టంలేదేమో! లేక పోతే మేనల్లుడికి, ఆ మాత్రం సాయంచెయ్యలేరా?"అన్నది. సుబ్బమ్మ సంగతి సందర్భాలేమిటో గ్రహించకల్గింది. ఎంతచెడ్డా, అన్నా చెల్లెళ్ళకి, మేనరికాలు ఇష్టంలేకుండగా పోతుందా? మేనరికాలు కలవలేదంటే, అటు భావమరిదికీ ఇటు వదినగారికీ, ఇష్టంలేకపోతేనే మేనరికాలు కలవకుండా వుంటాయి. సుబ్బమ్మ ఏమీ మాట్లాడలేదు. మౌనంగా వసుగు ఖర్చులు వ్రాసిన పద్దుపుస్తకం పట్టుకుని, రఘు దగ్గ రకు వెళ్ళిపోయింది.

## 12

ఆ సమయ సూర్య కిరణాలు మొక్కల చిగుళ్ళని రాగరంజితం చేస్తుండగా, ఆ అరుణిమ చెంపల్లో ప్రతిఫలి స్తోండగా, పరికిణీ వెనక్కి మడిచి కట్టుకుని సరిగ్గా అనురవి,

వాయిల్ వోణీని బిగుతుగా, మొలలో చెక్కుకుని, కాశీ రత్నం తీగెలని, సీతాఫలం చెట్టుకొమ్మలకి చుట్టుతూ, కూనిరాగాలు తీస్తూంది అనూరాధ. సుబ్బమ్మ రిక్షా దిగుతూనే, ఒక్కక్షణం అనూరాధని చూసి ముగ్ధురాలైంది. రెండు చెంపలనిండా, చారెడేసి మొద్దుపొక్కులతోనూ, ఎత్తుగా నల్లగావున్న పెదిమలతోనూ చెంపకు చారెడేసి కళ్ళువున్నా కరుగ్గా చూసే చూపులతోనూ వుండే, సుశీల అప్రయత్నంగా సుబ్బమ్మ కళ్ళముందు నుంచుంది. అనూరాధ గేటుచప్పుడవటంతో వెనుతిరిగి చూసింది.

'అత్తా!' సంభ్రమాశ్చర్యాలతో ఒక్క గెంతువేసి సుబ్బమ్మని కౌగలించుకుంది.

మెత్తని, కాశ్మీరపు సిల్కుచీర మడతలా, వున్న అనూరాధ శరీరాన్ని తనగుండెల్లోకి పొదువుకొంటూ —

"నాతల్లే, నాతల్లీ! కులాసాగా వున్నారా, నువ్వూ తమ్ముడూనూ?" అంటూ అనూరాధ రెండు చెంపలూ గాఢంగా, ముద్దుపెట్టుకుంది.

"బాగుంది! అత్తా కోడళ్ళముచ్చట! రాధీ, అత్తయ్యని, కాళ్ళు కడుక్కోను నీళ్ళన్నా ఇయ్యకుండా, గేట్లోనే నిలవేశావేమే? లోపలికి రానియ్యవేమిటి? ఇప్పట్నించీ నీ ఆజ్ఞేనా ఆవిడకి? రండొదినా లోపలికి!" సాదరంగా అంది అన్నపూర్ణ. సుబ్బమ్మ లోపలికి వెళ్ళింది. కుటుంబం అప్పుడే బజారునుంచి వచ్చాడు.

"ఏమక్కా కులాసగా వున్నావా?" అన్నాడు.

"ఆ కులాసే" అంది.

"రఘూ బాగా చదువుకుంటున్నాడా?" అన్నాడు.

"బాగానే చదువుకుంటున్నాడు తమ్ముడూ! పరీక్ష ఫీజు కట్టాలి. సొమ్ములేక..." సుబ్బమ్మ నాన్చేసింది.

కుటుంబం విస్తుబోయేడు.

"అదేమక్కా! వాడికి డబ్బులేకపోవటమా? కరణాల పొలం, సిస్తు అంతా ఏంచేస్తున్నావ్?" అన్నాడు.

"నాకు పొలమా? సిస్తా? ఏమిట్రా నువ్వంటున్నది? నా కర్థంకావటంలేదు" ఆశ్చర్యంగా అంది సుబ్బమ్మ.

"ఎంత అమాయకురాలివే అక్కా! నీ నగలమ్మగా వచ్చిన డబ్బుపెట్టి, అన్నయ్య ఆయేడే యెకరం పొలం కొన్నాడుగా? ఆ సిస్తుదాచి, మళ్ళీ నిరుడు యింకో యకరం కొన్నాడు. కొంటం తనపేరే కొన్నాడులే! ఆడదానిపేరవుంటే సిస్తులు సరిగ్గా ఇవ్వరనిఅలాకొన్నాడు. నీకు సాలుకి ఇరవయి బస్తాలు మక్తా యిచ్చేట్టు ఏర్పాటుచేసేడు కూడా అన్నయ్య!" చెప్పాడు కుటుంబం.

"అదేంరా! నాతో మాటకయినా చెప్పలేదు?" అంది సుబ్బమ్మ.

"చెప్తానునుకొనే మర్చిపోయాడేమో అన్నయ్య. నేను కనుక్కుంటాలే! ఇంతకీ, రఘూ పరీక్షఫీజు కట్టడానికి సొమ్ములేదంటావా? నేను ఇస్తాలే పట్టుకెళ్ళు!" వందరూపాయలు ఇచ్చాడు కుటుంబం. సుబ్బమ్మని వారంరోజులదాకా వెళ్ళనీయ లేదు అన్నపూర్ణ. ఈ మధ్య అన్నపూర్ణ పుట్టింట్లో వంటా వార్పూ చేస్తోంది. అన్నపూర్ణ మామ్మ కనకమ్మగారు కాలం చేసింది. అన్నపూర్ణకి, తను పుట్టింట్లో

వుండవలసిరావటం ఎంతో కష్టంగా వుంటోంది. అవతల తమ్ముడు, పెళ్ళికెదుగుతున్నాడు. తన కొడుకు చదువు కెదుగుతున్నాడు. అనూరాధ పెద్దమనిషి అయ్యింది. దానికి పెళ్ళిచెయ్యాలి. కొడుక్కి చదువు చెప్పించి వాణ్ణి నలుగురిలో ఒక మనిషిగా నిలబెట్టాలి! సదానందంగారు ఇంటి విషయాలేమీ పట్టించుకునేవారుకాదు. వేళకింత వండిపెడితే పాఠాలు చేయటం, తన ఆఫీసుపనేదో చేసుకుపోవటం తప్పితే, లౌకికమైన సంగతులు ఆయన పట్టించుకునేవారు కాదు. అన్నపూర్ణ తమ్ముడు శంకరానికి సంబంధాలు వస్తున్నాయి. ఒక్కటీ నచ్చటంలేదు. కుటుంబానికి మటుకు, సీతతూతురు, సుభాషిణిని శంకరానికి చేస్తే బాగుంటుందని, ముచ్చటగా వుండేది. శంకరానికి సంబంధాలు వచ్చినప్పుడల్లా అస్తమానం అన్నపూర్ణని సతాయించేవాడు.

"నువ్వే పెంచి పెద్దచేశావ్! నీకామాత్రం స్వతంత్రం లేదా? నా అన్న మనుమరాలయితేనే నువ్వు నాతో సంసారం చేయగల్గుతావ్?" అనేవాడు.

అన్నపూర్ణకి లోపల్లోపల భయమేసేది. శంకరం పెరిగి పెద్దవాడయినాడు. అడ్డాల్లో పిల్లవాడుకాడు! గడ్డాలు వచ్చిన మగవాడు. తనమాట వింటాడని నమ్మక మేమిటి? పోని, తండ్రితో గట్టిగా చెపుదామన్నా, తన అత్తవారు అంటే తండ్రికి, అట్టే సదభిప్రాయం లేదు. మంచిచెడ్డలు కాలాన్నిబట్టి, వ్యక్తుల్నిబట్టి మారుతూ వుంటాయని చాలా మంది మనుష్యులు గ్రహించుకోరు. అలాంటి అవ్యక్తపు మనుష్యులే, సదానందంగారూనూ! అన్నపూర్ణ కేవలం

వంటమనిషిగా, తన పుట్టింట్లో పెరిగింది కాని, తమ్ముడూ, తండ్రీ అన్న ప్రేమార్ద్రితతో ఆమె మెలగలేదు, ప్రతీపూటా ఏ కూరచేస్తే విసుక్కుంటారో. ఏ మాట చెప్తే కేకలు వేస్తారో, అన్న భయంతో, తన దిక్కుమాలిన జీవితాన్ని, అవ్యక్త సంసార సాగరంలో గట్టు తెలియని దారిన ఈదులాడుతూ వుండేది. వాళ్ళమీద ఆమె కేమి హక్కు వుందని ఆమె, తన తోటికోడలు మనుమరాల్ని చేసుకొమ్మని చెప్ప కలుగుతుంది? శంకరం ఇల్లు పట్టకుండా తిరిగేవాడు. సదానందంగారు, తన ఆధ్యాత్మిక అన్వేషణలో మునిగిపోయేవారు. ఇంట్లో వున్నవీ లేనివీ చూసుకుని వచ్చేపోయే బంధువు లందరికీ, ఆదరసత్కారాలు నెరవేర్చుతూ వుండేది అన్నపూర్ణ. కుటుంబం ఈ మధ్య కొద్దిగా మారేడు. పిల్లలు ఎదుగుతున్నారు. అన్నపూర్ణ చెప్పినట్లు విని, తనవూరు వెళ్ళి వేరే మకాం పెట్టే, అన్నగారు ఏమన్నా అనుకుంటాడని భయంగా వుండేది. అంచేత తన పొలం సిస్తు అంతా తెచ్చి, సదానందంగారి చేతికిచ్చి దాచమనేవాడు. సదానందంగారు ఆ డబ్బుతో ఇళ్ళూ పొలాలూ కొంటూ, అమ్ముతూ వుండేవారు. ఆ అమ్మకసమ్మకాలన్నీ సదానందంగారు తన పేరనే జరిపించేవారు. కుటుంబం ఎప్పుడూ, తన డబ్బుగురించి మామగార్ని అడిగేవాడుకాదు. ఆయన డబ్బుగలమనిషి. తన భార్యని కన్న తండ్రి! తన పిల్లలు ఇద్దరూ ఆ ఇంటనే పుట్టిపెరిగారు. శంకరం తర్వాత ఇంట్లో చిన్నపిల్లలు తమ రమణా,

రాధాయేకదా! ఆ పిల్లల భవిష్యత్తు తాతగారైన సదానందంగారు, గుర్తుంచుకోరనుకోవటానికి కుటుంబంయొక్క శాంతియుత సమిష్టి హృదయం ఆలోచించనీయలేదు. తను అన్న మమమరాలు ఆ ఇంటి కోడలవుతుంది. అవుతుం దేమిటి? అయ్యి తీరాలి! అయినప్పుడు, తనుకింకే. కావాలి! వేళకింత ప్రసాదం తప్ప తన కేమీ అక్కర్లేదు. తను పిల్లల సంగతీ అక్కా, తమ్ముడూ, చూసుకుంటారు. అచుకుని రోజులన్నీ నిష్పూచీగా గడిపేశాడు కుటుంబం. పొలం పనులు వున్నప్పుడు, అన్నగారి ఇంటిలో వుండటం, ఆ పనులు అయిపోయినప్పుడు మామగారి ఇంటికి రావటం, అయిదూ పదీ, వుంటే భార్య చేతికియ్యటం చేసేవాడు. అన్నపూర్ణకి మటుకు, రోజుకొక యుగంలా వుండేది. ఇంటిసంగతులేమీ ఇటు భర్త, అటు తండ్రీ కూడా పట్టించుకొనే వారుకాదు. అనూరాధ పెళ్ళి, ఒకసమస్య అయిపోయింది అన్నపూర్ణకి. అంచేత సుబ్బమ్మని రాగానే, ఆమె వచ్చినపని అయి పోగానే వెళ్ళనియలేదు. రఘూ చదువుకుంటున్నాడు. ఎక్కడో పావలాడబ్బులు ఇచ్చే వుద్యోగం సంపాదించుకోక పోడు. తన వెనకా ముందూ పినతండ్రులుకాని, మేనత్తలు కాని లేరు. వున్నవాళ్ళు సర్వసంగ పరిత్యాగం చేసిన తండ్రీ, తలతిక్కగా పెరిగిన తమ్ముడూ! వాళ్ళనించి, తను ఏమి సహాయం కోరుతుంది? రఘుకి, రాధనిచ్చి పెళ్ళిచేస్తే ఇద్దరూ, ఒకరి కొకరు ఆసరాగా వుంటారు. తనకా వొంట్లో జవసత్వాలు లేవు. చిన్నప్పటినుంచీ, తల్లిలేని తనంవల్లా, కుటుంబంయొక్క అపసవ్యపు ప్రవర్తనవల్లా, అన్నపూర

మానసికంగా చాలా కృంగిపోయింది. ఆమెకి సుబ్బమ్మ చల్లని నీడలాగా, కన్నతల్లిగా కన్పించింది. అంచేత అన్నపూర్ణ, సుబ్బమ్మతో రాధ పెళ్ళివిషయం చెప్పింది.

“తప్పకుండా రఘూకి, రాధని చేసుకుంటాను పూర్ణా! బెంగపెట్టుకోకు! వాడిచదువు కానీయి!” అంది సుబ్బమ్మ.

“ఏమో వదినా! మీ భరోసా మీదే బ్రతుకుతున్నాను.” అని కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుంది అన్నపూర్ణ.

“ఛ! పిచ్చిదానా! నాకుమటుకు, నా అన్నతమ్ములు కాక ఇంకెవరున్నారు! ఇవ్వేళ పిలిచి ఇంతపెట్టినా అన్నతమ్ములే, వాళ్ళకి, మనమీద కష్టంతోచి, ఈ తద్దినాలు, ఇంకా ఏమిటిరా భగవంతుడా! మన సంసారం మనం చేసుకుంటుంటే, వచ్చిపడ్తోంటారు— ఈ దిక్కుమాలిన అక్క—చెల్లెళ్ళు—అని, తిట్టుకున్నా, అన్నతమ్ములే! సహోదర సంబంధం పెట్టుపోతల పరిధిలో కుంచింప చేయుటం ఎంత అవివేకం! తప్పకుండా, నా కోడలు మేనకోడలే అవ్వాలి. నేను నా రక్త సంబంధం వదులుకుంటానా?” అంది సుబ్బమ్మ. అనూరాధ తలుపు వెనకాతల నించుని, తల్లీ, మేనత్తా, మాట్లాడే మాటలన్నీ వింది. రాధ మనస్సులో చిన్న లేతకోరిక తలెత్తింది. ఆమె రఘూని పెద్దయినాక చూడలేదు. అతనితో మాట్లాడలేదు. అయినా పద్నాలుగేళ్ళ అనూ, రాధమనస్సునిండా, రఘూ యొక్క ప్రతిరూపమే గాఢంగా ముద్రవేసుకుంది. అది శరీరాకర్షణ కాదు. అవ్యాయకపు ఆత్మీయత! రఘూ మనస్సేమిటో

రాధకి తెలీకుండానే, తనంటే, రఘూకి, అమితఇష్టమనే, నిర్ణయానికి వొచ్చింది. ఎందుకలా నిర్ణయించుకుందో, రాధ మనస్సుకే తెలీదు! భగవంతునికే తెలియాలి? అనూరాధకి, మేనత్త సుబ్బమ్మంటే, చెప్పలేనంత ఆపేక్ష! వున్న నాలుగు రోజులూ, మేనత్తని చుట్టుకుని తిరిగేది. సుబ్బమ్మ ప్రక్కలోనే పడుకున్నేది. అ స్తమానూ అన్నపూర్ణ రఘూ ప్రసక్తి తెచ్చి మాట్లాడుతోంటే, రాధ మనస్సులోనే మురిసిపోయేది. రఘు శాకకి, కాకరకాయ పచ్చడి ఇష్టమని నీటి వంకాయలు కూడా, కరకరలాడేట్లు వేపాలని, హిందీ పాటలంటేకూడా చాలా ఇష్టమనీ, ఇలా రఘూ ఇష్టానిష్టాలన్నీ, గుప్తధనంలా, తన లేత మమకారపు పసిహృదయంలో భద్రపరుచుకుంది అనూరాధ!

# 13

ఒక్కొక్క రోజుగా, కాలం కరిగిపోతోంది. కాలం ఎవ్వరి ప్రయోజనాలకోసం ఆగదు! మనం తిన్నా తినకున్నా, ఆనందించినా, రోదించినా రోజులు ఒక్కలానే తెల్లవారుతాయి. కుటుంబాల్లో ఎన్నో మార్పులు వస్తాయి. ఒక చెట్టునీడననిద్రించి ఒక పసరిక బయల్లో మేసి, ఒకదాని పొట్టలో ఒకటి తలపెట్టుకుని ముడుచుకుని నిద్రపోతూ పెరిగిన మేకపిల్లలు సహితం పెద్దయినాక పోతులుగా మారి

పోయి కుమ్ముకుని కుమ్ముకుని, రక్తాలు ధారలు కట్టించు కుంటాయి. అన్నపూర్ణకి జీవితం భవిష్యత్తులో ఇంకాచీకటి మయింగా తోచసాగింది. అటు అ త్తవారింట్లో రాజారామంగారు, ఇటు పుట్టింట్లో కన్న తండ్రి సదానందంగారూ ఒక్కసారే, ఇహలోక బంధనాలసించి, విముక్తులైనారు. రాజారామంగారు సుశీల పెళ్ళి చేయకుండగానే చనిపోయారు. సిద్ధేశ్వరిచేతుల్లోంచి ఇంటి పెత్తనం చల్లగా జారి, చేతుల్లోకి తీసుకున్నాడు. అయినా సిద్ధేశ్వరి తన రాజకీయపు ఎత్తులు మానలేదు. రఘూ ఇప్పుడు ఒక డిగ్రీ సంపాదించుకున్నాడు. నెలకి ఒక వంద రూపాయలు సంపాదించుకుంటున్నాడు. వెనకాముందూ ఎవ్వరూ బంధుజాలంలేరు. ఏమున్నా బంధు వర్గం అంటూ వుంటే అది తమరే! అటు అన్నపూర్ణకీ తండ్రి పోయేక వెనక దిక్కంటూ ఎవరూ లేరు. అంచేత అన్నపూర్ణ తప్పకుండా సుబ్బమ్మ సంబంధం కోసం తాపత్రయ పడుతుంది. కుటుంబానికి తమ మీద ఎంతగౌరవమున్నా భార్యా పిల్లల కన్నా ఎక్కువగా తమనిచూసుకుంటాడని హామీ ఏమిటి? రాజారామంగారు పోయిన దగ్గరనించీ ఎక్కువగా అన్నపూర్ణదగ్గరే వుంటున్నాడు. తన కన్న కూతురు సౌఖ్యం కంటే, అన్నకూతురు సౌఖ్యం ఆతనికెక్కువా? ఇంక అక్కాతమ్ముళ్ళు, వియ్యమందారంటే తను ఎటూ కాకుండగా పోతుంది. పోని పుట్టింటివారు వున్నారు; ఇన్నాళ్ళూ తను పోషించి పెద్దచేసిన తమ్ముళ్ళున్నారు– అని ధీమాగా అనుకుందుకు కూడా లేదు. తన తమ్ముళ్ళు చూడబోతే

శరీరం అమ్మి ధనమూర్జించి, తమ భార్యల మెడలు నింపిన అరుంధతినే వెళ్ళగొట్టారు. తాము తప్ప, వేరే గత్యంతరం లేని, అరుంధతినే, ఇంట్లోంచి వెళ్ళగొట్టిన తన తమ్ముళ్ళు, పిల్లా జెల్లాతో వున్న, తన్ని ఆదరిస్తారా? వాళ్ళకి తనమీద అపేక్ష లేదు. ఉంటే సీతకూతురుని తన పెద్ద తమ్ముడు కొడుక్కు ఎందుకు చేసుకోడు? ఇదంతా తిరిగ్గా ఆలోచించింది, సిద్ధేశ్వరి. కుప్పనూటప్పల రోజుల్లో కుటుంబం వచ్చాడు. సిద్ధేశ్వరి బాబ్జికి ఉత్తరం వ్రాసి రప్పించింది.

"చిన్నానా! ఇంక నా కుటుంబానికి నువ్వే పెద్ద దిక్కువి! సుశీని గాలికివదిలిపోయాను నాన్న! నాకేం తోచటంలేదు! నాకేమీ అనుభవం లేదు." అన్నాడు బాబ్జి.

కుటుంబానికి సంతోషం వేసింది. రాజారామంగారు వుండగా ఇంటిలో ఖర్చు కరామత్తులువచ్చినా కుటుంబాన్నే మేనేజిమెంట్ చేయమనేవారు. ఆ నాలుగు రోజులూ, కుటుంబం శరీరం మరచిపని చేసేవాడు. ఇటీవల రాజారామం గారు పోయాక పొలం పనులు, ఊడ్పులూ కోతలూ మొదలయిన పనులున్న రోజుల్లో, బాబ్జి, తను చేస్తోన్న ఉద్యోగానికి సెలవుపెట్టి వచ్చి, కూలీలని ఏర్పాటుచేసి ఆ పనులు తను స్వయంగా దగ్గరుండి చేయించుకోవటం మొదలు పెట్టాడు. చెట్టంత మనిషి తను వుండగా బాబ్జి ఎవరూ లేని వాళ్ళలా తమ పొలంపనులు తాము వేరే కేటాయింపుగా చేసుకోవటం కుటుంబానికి కష్టం తోచింది. అతని అహంభావిక వ్యక్తిత్వం గాయపడింది కూడా!

అల్లాంటిది, అన్నగారుపోయిన నాలుగేళ్ళకి తనపెద్దతనం తన అన్నకొడుకు గుర్తించటంతో కుటుంబానికి సంతోషం వేసింది.

"ఎంతమాటన్నావురా పెద్దాడా? సుశీని గాలికి వదిలాడా అన్నయ్య! తల్లి, అన్నలు, అక్కలు, పినతండ్రి, ఇందరము వున్నాము. దాన్ని ఇంతవున్నచోట, పడేయలేక పోతామా? ఏదీ? మీరున్నారుగా మీ తిప్పలు మీరు పడుతున్నారు కదా, నన్ను సంప్రతించలేదు కదా అని వూరుకున్నాను. ఈ తప్పనూర్పులు అవసి! ఏమన్నా సంబంధాలు చూద్దాం! కాసులుపోస్తే, కాళ్ళబడని వాడెవడ్రా ఈ రోజుల్లో! మనలా కట్నాలు హార్డ్ కేష్ ఇవ్వగల మగాడెవడున్నాడు మనలో" అన్నాడు. బాబ్జి క్షణం ఆలోచించాడు. అటు తల్లేమో, రఘూకే ఇవ్వాలని, అడుగమంటోంది. ఇటు పినతండ్రేమో, రఘూ వూసెత్తకుండా సంబంధాలు వెతుకుతాను – అంటున్నాడు. బహుశా, రఘూకి, తన కూతుర్నిచ్చుకుందామన్న కోరిక వుండివుంటుంది. దానికి రిజర్వేషన్ జరిగిపోయిందేమో కూడా! అయినా మనసులో కల్లాకుల్లాలు పడటమెందుకు? అని వూహించుకుని అన్నాడు.

"అదే చిన్నాన్నా! నేనూ చెప్దామనుకుంటున్నాను. ఎక్కడో దూరపు సంబంధాలు వెతుక్కోవటం ఎందుకు? చిన్నప్పట్నించీ అనుకుంటూండేవాళ్ళము, రఘూకిద్దామని! మనకయినా ఆమె కదా కావాల్సిన బంధువు? మన పిల్లల్లో ఒకడుగా పెరిగాడు రఘూ! నాన్నగారుంటే ఈపెళ్ళి

ఏనాడో జరిపించి వుందురు. ఏమిటో నాన్న పోయిన దగ్గ ర్నించీ సుబ్బమ్మత్త రావటం మానేసింది. రాకపోకలుఆగి నంతమాత్రాన్న రక్తబంధుత్వం పోతుందా? నాకూ అమ్మకూ కూడా మనకు కలిగినదేదో ఇచ్చి సుబ్బమ్మత్త సంబంధమే కలుపుకోవాలని వుంది. నాన్న తరఫు బంధు వులు, నువ్వో అత్తేకదా మాకు మిగులున్నది?" కళ్ళ నీళ్ళతో అన్నాడు శాబ్జి!

కుటుంబం హృదయం కరిగిపోయింది. ఒక్కసారి తమ శాల్యం కళ్ళకు కట్టినట్లయింది. అన్న రాజారామం గారు తమని తల్లయి తండ్రై లాలించారు! మంచికీ, చెడ్డకీ తలవొంచారు. సుబ్బమ్మ పెళ్ళి, తన పెళ్ళి అయ్యేదాకా, కంటికి నిద్రపోలేదు. పిత్రార్జితమైన ఆస్తిని అరయకరమైనా అమ్మకుండా తనకు సగం పంచి ఇచ్చారు. కిట్టనివాళ్ళు "యాభైయకరాల పొలం, యాభై వేలరూపాయల అప్పుతో ఇచ్చాడు మీ అన్నయ్య! మళ్ళీ కొనుక్కున్నట్లే అయ్యింది. నీకు - ఆ అప్పులన్నీ తెర్చేసరికి.?" అంటారు. అంటే మటుకు యకరం, వెయ్యిరూపాయల కెవరన్నా ఇస్తారా? తన అన్న కనుక తనకి పంచిపెట్టాడు! మళ్ళీ ఆ అన్న చెల్లెళ్ళ కుటుంబం ఏకంకావటం తనకు ఆనందకరం కాదూ?

"అంతకంటే కావాల్సిందేముందిరా పెద్దాడా! తక్షణం వెళ్ళి చెప్పివద్దాం! పెద్దపండుగ అవ్వగానే మాఘంలో ముహూర్తం పెట్టిద్దాం! ఇంతకీ రఘూ అదృష్ట

వంతుకు ! వాడికి అన్నీ ఘరానాగా జరిగే ప్రాప్తివుంది ! వడుగు చూశావా ? నాలుగు వూళ్లూ మ్రోగిపోయేటట్లు చేశామా ! పెళ్ళికూడా అలానే చేయిస్తాను చూడు ! అందులో ఆఖరిపిల్ల పెళ్ళి ! ఆపిల్ల మా నాన్నేకనుకవుంటే ఇలా జరిగేదా ? అనే కించపడకుండగా చేయాలి." ఉత్సాహంగా అన్నాడు కుటుంబం.

"ముందు అత్తని వొప్పించాలికదా !" అన్నాడు నీరసంగా బాబ్జి.

"అత్త ఎందుకు వొప్పుకోదురా పిచ్చాడా ! అసలు దానంతట అదే అడుగును, ఎంతయినా మగపిల్లడి తల్లికదా అని బిగుసుకు కూర్చుందికాని !" అన్నాడు కుటుంబం.

# 14

విజ్ఞానం బాగా పురోభివృద్ధి చెందింది. నిత్యం రేడియోలో రాబోవు ఇరువయి నాలుగుగంటలకి 'వాతావరణ' సూచన అంటూ గాలి పొడిగావుండేదీ, తడిగావుండేది, సముద్రంలో తుఫాను వచ్చేదీ, పోయేదీ, ముందుగానే చెబుతున్నారు. ఇంత భూనభోంతరాళముల చలనాదులను కనిపెట్టే శాస్త్రవిజ్ఞానం విజృంభించినా ఏ విజ్ఞానశాస్త్ర కారుడూ మానవ మనో వక్రీకరణము, ఏ సిద్ధాంతాన్ననుస

రించి జరుగుతుందో స్థిరీకరించి చెప్పలేకపోయేరు ! మనుష్యులు సృష్టించుకున్న, మనుష్యులు చెప్పినట్లు వినటంలేదు. మనుష్యులు సృష్టించుకున్న యంత్రాలు మనుష్యులు చెప్పినట్లు బుద్ధిగా వింటున్నాయి. ఒక్కమనుష్యులుకి తప్ప తక్కిన యావత్ప్రపంచ స్థిర, చలన, జీవకోటీ, విశ్వాసమన్నపదాన్ని అంతో, ఇంతో భూమిమీద నిలపటానికి ప్రయత్నించుతున్నది !

హఠాత్తుగా ఉరుములేని పిడుగుల్లా గుమ్మంలో ప్రత్యక్షమయిన కుటుంబాన్ని, బాబ్జినీ చూచి సుబ్బమ్మ విస్తుపోయింది.

"కులాసాగా వున్నారా అత్తా!" అంటూ బాబ్జి వస్తూనే సుబ్బమ్మని పలకరించి ఆమె కాళ్ళకి వంగి దండం పెట్టాడు.

"లేయ్యా ! పిచ్చినాయనా ! నీ పెళ్ళాం పిల్లలు కులాసానా తండ్రీ ," అంది సుబ్బమ్మ ఆపేక్షగా.

"ఆ ! కులాసగానే వున్నారు అత్తా ! అసలు రావటమే మానేశావ్ ! నాన్నతోపాటు మేమంతా కూడా పోయేము అనుకున్నావా అత్తా! ఒక్కగా నొక్క మేనత్తవి నాలుగురోజులు వచ్చి నట్టింటవుండి మేనకోడళ్ళని, మేనల్లుళ్ళని చూడకూడదా !" అన్నాడు బాబ్జి.

సుబ్బమ్మ శరీరం అంతా గోదావరిలా పొంగింది. ఎంతయినా తన తోడబుట్టినవాడి కొడుకు కనుక తను రాలేదని మనసు కష్టపెట్టుకుంటూన్నాడు. తనకు మాత్రం ఎవరు

వున్నారు ? ఆ అన్న సంసారం తమ్ముడు సంసారం తప్పితే తన బాగోగులు చూచేవారు ఎవళ్ళున్నారు ?

"అదేరా తండ్రీ! వద్దామనే అనుకుంటూంటాను. కాని ఇదిగో మీ బావయ్య ఉద్యోగం వెలగబెట్టున్నాడు కదా! ఏదో వేళకింత ఉడకేసి పెట్టటంతో సరిపోతోంది. ఏదో వాడిమెడకో బండని కట్టేస్తే ఇంక నా బాధ్యత వుండదు, ఇద్దరూ ఏదో తంటాలు పడ్తారు. ఆ ఘడియకోసం చూస్తున్నాను. ఎప్పుడో వాడి పెళ్ళికాస్తా జరిపించేస్తే మీ ఇళ్ళల్లో ఎన్నిరోజులుండమన్నా వుంటాను." అన్నది సుబ్బమ్మ.

"అదే అడగటానికి వచ్చా మక్కయ్యా! రఘూ పెళ్ళి ఈ మాఘంలో చేసేస్తే బాగుంటుందనిపించింది. నిన్నుకూడా సంప్రతించి ముహూర్తం పెట్టుకొందామని వచ్చాము, చల్లకివచ్చి ముంతదాచటమెందుకు?" అన్నాడు కుటుంబం.

"వాడి చిన్నప్పట్నించీ వాడి బాగోగులు మీరే చూస్తున్నారు. అంతకన్నా కావల్సిందేముంది! మీ ఇష్టమే నాఇష్టం" అంది సుబ్బమ్మ.

"అంత తేలిగ్గా మాట ఇచ్చేయకు అత్తా! అసలు కథానాయకుని అనుమతిలేనిదే మనమెవరం - కార్యాలు జరుపటానికి !" అన్నాడు బాబ్జి.

"ఆఁ, కుర్రాడు ! వాడికేం తెలుసు ! తల్లిమాట కాదంటాడా ?" అన్నాడు కుటుంబం.

"జీవన సహచరిని ఎన్నుకునేటప్పుడు, తల్లిదండ్రుల ఆజ్ఞకాని, ఆత్మీయతకాని అడ్డువస్తాయా! అందులో రఘు ఇప్పుడు స్వతంత్రుడు. అతన్ని మనం ఏవిధంగానూ నిర్బంధించి ఏపనీ చేయించలేము. చిన్నప్పటి జ్ఞాపకాలు, మమకారాలు నశించకుండావుంటే చేసుకుంటాడు; లేకపోతే లేదు." అన్నాడు బాబ్జి.

"అంతమాటనకురా పెద్దాడా! వాడు మీ ఇంట్లో మీ తోబుట్టువులాగే పెరిగాడు. ఈనాడు వాడంతట వాడు నాలుగురాళ్ళు తెచ్చుకుని బ్రతుకుని నడుపుకోగలిగినంత మాత్రాన్న మిమ్మల్ని మర్చిపోతాడా! అలా ఎప్పుడూ అనుకోకు! లేవండి. స్నానాలు చేయండి భోజనాలు చేసేద్దురు కాని." అంది సుబ్బమ్మ.

"భోజనం మాటకేంలే అత్తా! ముందు రఘురానీయి! అతనితో ఈ వ్యవహారం అవుననిపించుకున్నాక అప్పుడు తీరిగ్గా చేస్తాను భోజనం! ముందు చిన్నాన్నని స్నానం చేయనీ" లేచి "నాన్నా! స్నానానికిపద!" అన్నాడు బాబ్జి.

కుటుంబం బాగ్‌లోంచి తువ్వాలు తీసుకుని పెరట్లోకి వెళ్ళాడు. సుబ్బమ్మ వంటింట్లోకివెళ్ళి పీటలూ, కంచాలూ, సర్దుతోంది. ఇంతలో రఘుకూడా ఆఫీసునించి ఇంటికి వచ్చాడు.

"హల్లో గుడ్‌మార్నింగ్ బావగారూ!" అని విష్ చేసిన బాబ్జినిచూసి రఘు క్షణం తెల్లబోయాడు. చిన్నప్పట్నించీ బాబ్జి ఎప్పుడూ ఎవ్వరితోనూ చనువుగా, ప్రేమగా మాట్లాడటం రఘుకి తెలీదు. బాబ్జి ఎప్పుడూ తన చదు

వేమిటో, తనగోడవేమిటో తప్ప తక్కిన సంగతులేవీ పట్టించుకునేవాడు కాదు. ఈ అయిదారేళ్ళలోనూ రఘూ, బాబ్జిని చూసిందీలేదు. అందుకని బాబ్జి పనికట్టుకుని తమ ఇంటికి రావటం, తనతో ఆప్యాయతగా మాట్లాడబోవటం, వింతగా కన్పించింది, "పూరకేరారు మహాత్ములు" అన్నట్లు ఏదో విశేషం వెంటపెట్టుకు వచ్చాడని గ్రహించాడు రఘు.

"అంతా కులాసగావున్నారా బావా? అత్తా పిల్లలూ అంతా బాగున్నారా?" అన్నాడు రఘు.

"ఆఁ అంతా కులాసగానే వున్నారు? ఏం నాయనా కాస్త అటువేపు ఒకసారివస్తే నీఆభిజాత్యం కరిగిపోతుందా? మేనమామవున్నాడు, మేనత్తవుంది, పిలలున్నారు ఒక్కసారి అమ్మా నువ్వూవచ్చి నాలుగురోజులుండి వెళ్ళిపోతే తప్పా!" అన్నాడు బాబ్జి.

అయాచిత వాత్సల్యం వొలకబోస్తున్న బాబ్జిని చూసి తనలో తనే నవ్వుకున్నాడు రఘు.

"రావొచ్చు బావా! కాని ఏదీ చదువుకొంటున్న రోజులూ! చదువును వదిలి గాలితిరిగితే చదువుకాస్తా గుంటకట్టి గంటవాయిస్తుందని భయం. ఏదో చదువుకున్నందుకు వుట్టినే పోకుండగా వుద్యోగం అంటూ దొరికిందా! ఇంక దీన్ని అంటిపెట్టుకుని కూర్చోవాలి. తలమున్మకుని బ్రతికే వాళ్ళకి సెలవులు ఎక్కడదొరుకుతాయి చెప్పు! ఇంక అమ్మ అంటావా; ఆమె ఇష్టం. నాలుగురోజులు అన్నగారింటిలో వుండి రావచ్చును. కాని ఆవిడ నన్ను విడచి కదలటానికి

పెద్ద బ్రహ్మప్రళయం చేస్తుంది! ఇలానే గడిచిపోతున్నాయి రోజులు!" అన్నాడు రఘు ఇంతలో కుటుంబం స్నానం చేసి లోపలకు వచ్చాడు. బాబ్జి, రఘు మాటాడుకోవటం చూసి ఆతని మనస్సు సంతోష తరంగితమైంది.

"ఏరోయి రఘూ! అప్పుడే ఆఫీసర్ బావగార్ని చూసి ఈ రైతు మామయ్యని మర్చిపోయావట్రా!" హుషారుగా అన్నాడు కుటుంబం.

"ఓ! నువ్వా వచ్చావా మామయ్యా! అత్తా, రాధీ, రమణా కులాసగా వున్నారా! ఐ మీన్ మీరిద్దరూ కలిసేవచ్చారనుకుంటాను." అన్నాడు రఘు.

"ఓ అంతా కులాసగానే వున్నారు. పదండి. ఆల స్యం అయిపోతోంది. భోజనం చేద్దాము! అక్కా! వడ్డిం చెయ్యవమ్మా!" అని కేకవేశాడు కుటుంబం.

"అవును. ఆలస్యం అయిపోయింది. లే బావా!" అని రఘు ఆఫీసుకి వెళ్ళివచ్చిన బట్టలు మార్చి, లుంగీ కట్టు కుని వచ్చాడు.

"ముందు నాకు ఒకమాట ఇస్తేనేకాని భోజనం చెయ్యను."

నవుతోన్నా గంభీరంగా ముఖంపెట్టిఅన్నాడు బాబ్జి.

అంతరార్థం గ్రహించేడు రఘు. బాబ్జిధోరణి రఘుకి అంతగా నచ్చలేదు. అవతల చిన్నమామయ్య నించున్నాడు. తనకా ఆకలి నకనకలాడుతున్నది. అంచేత చమత్కారంగా

"మాటకేంలే! వెయ్యిమాటలిస్తాను. ముందు భోజనానికి లే! చిన్నమామయ్య కాచుకున్నాడు కూడా!" అన్నాడు రఘూ.

"మీరిద్దరూ భోజనంచేస్తూ వుండండి. నేనూ అక్కడే కూర్చుని సంగతి సందర్భాలు వివరిస్తాను." అని భోజనాల గదివెంపు దారితీసాడు బాబ్జి! రఘూ కుటుంబం కూడా వెళ్ళి భోజనాలగదిలో తమకని నిర్దేశించిన పీటలమీద కూర్చొన్నారు.

"నువ్వుకూడా దా నాయనా! భోజనంచేస్తూ మాట్లాడకూడదా ఏమిటి?" అంది సుబ్బమ్మ.

"కతికితే అతకదని, నీకు తెలీదా ఏమిటి అత్తా!" అన్నాడు బాబ్జి.

విషయం సులభగ్రాహ్యంఅయ్యిందిరఘుకి. మౌనంగా వూరుకున్నాడు.

"ఆఁ! అవన్నీ పూర్వకాలంవారి మూఢనమ్మకాలు! అయినా మేనత్త-మేనమామ పిల్లలకి కతికితే అతకదని సామెత ఏమిటి నామొహం!" అన్నాడు కుటుంబం.

"రానాయనా! ఈరోజుల్లో ఇంకాపాతకాలపు నమ్మకాలేమిటి?" అంది సుబ్బమ్మ. ఎంతచెప్పినా బాబ్జి భోజనం చేయకుండానే కూర్చున్నాడు. కుటుంబం, రఘు భోజనాలు చేశారు. బాబ్జి ఆమాటా ఈమాటా చెబ్తూ నెమ్మదిగా అసలు విషయం చెప్పాడు. రఘు, సుశీలని చేసుకొమ్మని తన తల్లి చెప్పమందని చెప్పాడు. రఘు అంతా విన్నాడు.

"అయితే దానికేనా ఇంతసేపు భోజనంకూడా చేయకుండగా, కూర్చున్నావు?" అన్నాడు రఘు.

"అవును బావా! ఇప్పుడు సుశీ పెళ్ళి బాధ్యత నాదేకదా! నువ్వు వూఁ అంటే ఈ మాఘంలోనే కానిద్దామని వుంది" అన్నాడు.

"అంత తొందరెందుకు బావా! నే నెక్కడికన్నా పారిపోతానా?" అన్నాడు రఘు ఎగతాళిగా!

"అల్లాగంటే ఎలా? నువ్వు ఇప్పుడు ఆర్జనపరుడివి! ఆడపిల్లల్ని కన్నతండ్రుల దృష్టిలో, నువ్వు సానపట్టిన వజ్రంలా కనపడుతున్నావ్! నీ విలువ నీకేం తెలుసు?" అన్నాడు బాబ్జి.

"సర్లే! అమ్మా, నేనూ ఆలోచించి వ్రాస్తాము. ముందు భోజనం చెయ్యి" అని మళ్ళీబలవంత పెట్టాడు.

"వ్రాస్తామంటే కుదరదు! నువ్వుసుశీని ఎరుగున్నావు కనుక ఇంక పెళ్ళిచూపులంటూ అవసరంలేదు. కట్నం కానుకా అంటావా, నీ ఇష్టం వచ్చినంత అడుగు! మాకు డబ్బుకి లోటులేదుకదా! అదీకాక, నువ్వు మాకు మేనత్త కొడుకువి! నీకు ఎంత ఇవ్వాల్సి వొచ్చినా మాకు బాధ అనిపించదు." అన్నాడు బాబ్జి.

"బాగుంది బావా! నువ్వు డబ్బుకు లోటుచేస్తావని నాకు సందేహమెందుకు వుంటుంది? పెళ్ళి అన్నాక కాస్త మంచీ, చెడ్డా ఆలోచించద్దూ! ఏ సంగతీ అమ్మతో కబురంపిస్తాను. మాకు మటుకు మీకంటే ఎవరున్నారు?"

అన్నాడు రఘు. బాబ్జి భోజనం చేసి ఆఫీసుకి సెలవు లేదని వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతూ, కుటుంబాన్ని చాటుకుపిల్చి;

"చిన్నాన్నా! ఇంక నీదే భారం! సుశీ నీ కూతురే అనుకో!" అని వెళ్ళిపోయాడు. కుటుంబంకు చనిపోయిన అన్నగారు జ్ఞాపకానికి వొచ్చి, కళ్ళు తడిఅయ్యాయి. బాబ్జి వెళ్ళిపోయాక, కుటుంబం రఘూని కదలేశాడు. అటో ఇటో తేల్చి చెప్పమన్నాడు.

"నాకు పెద్దత్త నడవడి ఇష్టంలేదు మామయ్యా! ఆమెకు నేనంటే కిట్టదు. మేము ఎప్పుడు వెళ్ళినా ముఖం, గంటు పెట్టుకునేది!" అన్నాడు రఘూ.

"ఆమె, నడవడి ఇష్టం లేకపోతే, పిల్లేం చేసిందిరా?" అన్నాడు కుటుంబం.

"ఎందుకు? చేసుకుని ఆ పిల్లని బాధపెట్టాలా? ముందు పెళ్ళి చేసుకుని, తర్వాత మా అమ్మ అలా మాతి ముడుచుకుంది; మా అన్న పండుగకి పిలవలేదు- అని ఆమెని హింసపెట్టటం ఎందుకు? అంత్యనిష్ఠూరంకంటె, ఆది నిష్ఠూరం మేలుకదా? అయినా నావ వెక్కిరిస్తున్నాడు కాని మామయ్యా, పెద్దత్తకి నిజంగా నాకు సుశీనివ్వటానికి ఏమాత్రం ఇష్టం వుండదు. వూరికే, కన్నీళ్ళు తుడవడానికి, బాగుండదని కటురంపి వుంటుంది" అన్నాడు రఘు.

కుటుంబానికి కోపం వొచ్చింది.

"ఒరే రఘూ! లేనిపోని అగాధిలు వెయ్యకు. ఆమెగారికి ఇష్టం ఎందుకుండదు? అయినా నువ్వు పెళ్ళి

చేసుకునేది ఎవర్ని? ఆమెనా; ఆమె కుతుర్నా? వాళ్ళు మనసారా, కోరారు కనుకనే, నిన్ను ఇంటికివొచ్చి అడిగారు! లేకపోతే ఈ మాత్రం సంబంధం లేకనా? నీ తాతలాంటి వాణ్ని తెస్తారు!" అన్నాడు కుటుంబం. మామయ్య పౌరుషానికి రఘుకి నవ్వొచ్చింది.

"నా తాతలాంటివాడికి కట్నం ఇయ్యక్కర్లేదు మామయ్యా! పూరికనే చేసుకుంటాడు. నా తాతలాంటి వాడికిచ్చి చేస్తేనే మంచిది." తన జోక్‌కి తనే నవ్వుకున్నాడు రఘు.

సుబ్బమ్మ బ్రతిమాలింది:

"వారే బాబూ! పెద్దమామయ్య బ్రతికుంటే, సుశీ పెళ్ళి ఎప్పుడో చేసివుండేవాడు. చిన్నప్పట్నించీ వాళ్ళింట్లో పెరిగావు. నీకంత అభిమానం లేకుండగా ఎలా పోయిందిరా?" అంది.

"ఒకచోట పెరిగినంతమాత్రాన్న ప్రేమలు కురిసి పోతాయా అమ్మా! చిన్నప్పట్నించీ పెద్దత్త జెలసీని అనుభవించాను కనుకనే నాకు వాళ్ళింటి అమ్మాయితో పెళ్ళి అంటే శరీరం జలదరిస్తోంది. 'సుశీ' వచ్చిన మర్నాడు, నువ్వు నుయ్యో గొయ్యో వెతుక్కోవాల్సిందే! వాళ్ళింటి ఆడపడుచులు యెవళ్ళు, అత్తవారి పెంపుబంధువుల్ని ప్రేమగా చూశారు చెప్పు! సీతవొదిన పెళ్ళయి వెళ్ళిన మర్నాడే ఆమెగారి అత్తగారు తామ్మని చచ్చిపోయింది! ఇల్లు ఖాళీ! ఇంక సుబ్బులొదిన సరేసరి! ఈమెగార్ని ఇస్తామని వెళ్ళగానే మామగారు చచ్చిపోయాడు! వాళ్ళు అపట్టంపుకేమీ

పెట్టుకోకుండా చేసుకునేసరికి చక్కగా మొగలిపొత్తిలా పెళ్ళికెదిగివున్న ఆడపడుచు కూడా హరీమంది! ఎందుకొచ్చిన బెడద! వాళ్ళింట్లో ఎవ్వరికీకూడా కాలు చల్లన లేదు" అన్నాడు రఘు.

"పోనీలేరా! నేను చెప్తే వింటావని నన్ను తీసుక వచ్చాడు పెద్దాడు! ఏదో పెద్దవాడ్ని! నామీద గౌరవం వుంచుతావనుకున్నాను. నన్నుకూడా చీమలాగా తీసిపారే స్తున్నావు!" అన్నాడు కుటుంబం.

"తప్పు మామయ్యా! నీమీద నాకు గౌరవం, అభిమానం ఎప్పుడూ వుంటుంది. నాకు వాళ్ళపద్ధతి సరిపోదంతే? ఏంచెయ్యను? పెద్దమామయ్యకనుకవుంటే మూరు మాట్లాడకుండా వొప్పుకునేవాడ్ని! నాకా వెనకదక్కుతలేదు. నా మానాన్న నేను 'సుకేని' పెళ్ళిచేసుకుని కులుకుతే అమ్మ గతేంకాను చెప్పు! పెళ్ళి అయ్యేదాకా వూరుకుని తర్వాత, 'నేను చెయ్యమన్నానా అంటే నేను చెయ్యమన్నానా!' అని తల్లీ కొడుకూ తగువులాడుకుంటూ కూర్చుంటారు. ఇంక మనకి కష్టం వొచ్చినా సుఖం వొచ్చినా ఆదుకునే వారెవరుంటారు చెప్పు. ఇంక ఆ పిల్ల బాధపడటమే కదా! నువ్వే ఆలోచించు!" అన్నాడు రఘు.

కుటుంబం ఆ సాయంత్రం వెళ్ళిపోయాడు.

"ఒరే బాబూ, బావ, చిన్నమామయ్య అంత జాలిగా అడిగారు. వొప్పుకున్నావు కాదు. నేను నా పుట్టింటికి శాశ్వతంగా దూరమయిపోతాను, అవును నాకున్న

మమకారం నీకెందుకు వుంటుంది?" అంది సుబ్బమ్మ ఎద్దేవాగా.

"ఏం చేసేది అమ్మా! సుశీ అన్నా అట్టేమంచిపిల్ల కాదు. పెంకితనం ఎక్కువ! మనం చెప్పినట్లు వినదు. చిన్నప్పుడే ముదిమాటలు చెప్పేది. విద్యావిహీనః పశుః అని వివేకం లేని వాళ్ళని చూసి, చూసి ఎలా కట్టుకోమంటావు?" అన్నాడు.

"వారే! చేసుకుంటే చేసుకున్నావు; లేకపోతే లేదు. అనవసరంగా పేర్లు పెట్టకు" అంది రోషంగా సుబ్బమ్మ.

"వాహ్వా! ఏం రోషం వచ్చిందీ, అమ్మగారికి! ఆ మాత్రం పుట్టింటివారు కాని లేకపోతే నన్ను నిలవనీయక పోదువు!" అన్నాడు.

కొడుకు మాట మాటకీ దెప్పుతూంటే సుబ్బమ్మకి కళ్ళ నీళ్ళపర్యంతమైంది. తల్లి దైన్య ముఖం చూసిన రఘు తనలో తను నవ్వుకున్నాడు.

"అమ్మా! ఏంజరిగిందనమ్మా! అంత చిన్న బుచ్చుకుంటావు? ఇంతకీ నేను, నిన్ను పుట్టింటివారికి దూరం చెయ్యనులే! మేనరికం కలుపుకో! ఎవరొద్దన్నారు?" అన్నాడు. సుబ్బమ్మ కళ్ళు ఆనందంతో తళుక్కుమని మెరిశాయ్.

"చేసుకుంటావా! నా బాబే! నా తండ్రే! రేపొద్దుటే, బండికట్టించు. వొదినతో చెప్పి శుభం అనుకుని వస్తాను. అందాకా, నీ వ్రేలినున్న ఎరుపు రాయి వుంగరం ఇయ్యి, అది దాని వ్రేలికి తొడిగిస్తాను. వాళ్ళింటి వుప్పుతిని పెరిగాం నాయినా! వాళ్ళ గురించి ఎన్నడూ

చెడుగా తలచకూడదు. ఇంతకీ మనం ఇవ్వబోవటంలేదు కదా! తెచ్చుకుంటున్నాం! తెచ్చుకున్నదాన్ని మనం జాగ్రత్తగా కాపాడుకోవాలి!" అన్నది సుబ్బమ్మ.

తల్లి కోండరికి రఘు ఒకవంక ఆనందిస్తున్నాడు, వేరొకవంక చింతిస్తున్నాడు. సుబ్బమ్మ నైరాశ్యపు బ్రతుకునకు, వెలుగురేఖ రఘు! కోడలురావాలి! ఆమె యొక్క ఆగిపోయిన జీవనరాగానికి కొత్తపల్లవి వేయాలి! అది సుబ్బమ్మ, ఆజన్మవాంఛ! మనుమడ్నెత్తుకుని తిరిగిన నాడు, ఆమె జీవితం తరించినట్లు భావించుతుంది. ఇరవయి సంవత్సరాల యవ్వన జీవితంలోని, కోర్కెలకు గోరీకట్టి రఘుని పెంచి పెద్దచేయటంలోనె తన శరీరాన్నీ మనస్సునీ కూడా, వంచింపచేసుకుంది. కొడుకు సుఖం తప్ప వేరే ప్రాపంచిక సుఖదుఃఖాలు ఆమె ఆశించలేదు.

"బండెందుకమ్మా?" అన్నాడు రఘు కవ్విస్తూ.

"అదే! పెద్దత్తగారింటికి వెళ్ళొద్దూ!" అంది.

"నేను మేనరికం చేసుకుంటాననన్నాను కాని, 'సుశీ'ని చేసుకుంటానన్నానా?" అన్నాడు రఘూ. రఘూ ఏమాట మెలికలోని అర్థాన్ని గ్రహించింది సుబ్బమ్మ.

"అయితే 'సుశీ'ని చేసుకోవా! అనూరాధని ఇచ్చే మాటుంటే, చిన్న మామయ్య 'సుశీ'ని గురించి చెప్పటానికెందుకువస్తాడు?" అంది సుబ్బమ్మ సందేహంగా!

"బాగుంది అమ్మా! వాళ్ళు సాయితాగా వెళ్ళమన్నారు కనుక వచ్చాడు మామయ్య. అంతమాత్రాన్న రాధిని నాకు ఇవ్వకని సూథి ఏమిటి? పోనీ ఎక్కడన్నా

సంబంధాలు చూస్తున్నాడేమో అంటే అదీ లేదాయె! అంచేత చిన్నమామయ్యవుండగా చిన్నత్తగారింటికి వెళ్ళు. ఇద్దర్నీ ఒకచోటపెట్టి అడుగు. ఇస్తానంటే సరే! లేకపోతే పైసంబంధం చేసుకుంటాను. నాకు పిల్లనివ్వటానికి దేశం గొడ్డుపోలేదు కదా!" అన్నారు నిర్వేదంగా.

రఘు అంత స్పష్టంగా చెబ్తోంటే సుబ్బమ్మ కాదనీ, ఔననీ, అనలేకపోయింది. తనకయితే ఏ అన్నతమ్ముడి కూతురయినా ఒకటే! కాని తమ్ముడు ఇస్తాడన్న నమ్మకం సుబ్బమ్మకి కలగలేదు. ఒక్కతే కూతురు, నాలుగు రూపాయలు ఎక్కువిచ్చి ఘరానా సంబంధం చేసుకుంటారు. అందులో ఆపిల్లది చిన్నప్పట్నించీ బస్తీలో పెరిగిన పిల్ల! చదువుకుంటున్నది. దాని అభిరుచులు ఎలా వుంటాయో? సుశీ అయితే తండ్రిలేని పిల్లకనుక, అన్నగారు చేయవలసి రావటంచేత, ఏదోవిధంగా వదిలించుకుందామన్న ధోరణిలో తమలాంటి దిక్కులేని సంబంధానికి ఇస్తామంటూ వచ్చారు-అని భావించింది సుబ్బమ్మ. అయినా ఒక్కసారి అడిగితే తన పరువు ఏమీపోదులే! అనుకుని నిభాయించుని వెళ్ళి అడగటానికే నిశ్చయించుకుంది సుబ్బమ్మ. సుబ్బమ్మకైనా పెద్దవాదిన సిద్ధేశ్వరి దగ్గరకన్నా, మరదలు అన్నపూర్ణవద్దే ఎక్కువ చనువు వుండేది. కాని అన్నపూర్ణ ఎప్పుడూ పుట్టింటనే వుండుటచేత అన్నగారింటికి వెళ్ళినంత చనువుగా తమ్ముడి దగ్గరకు వెళ్ళేదికాదు. అన్నగారితో

డబ్బు తగాయిదా వచ్చినదగ్గర్నించీ ఎప్పుడన్నా అవసరం వస్తే తప్పనిసరిగా ఆమెకాని, రఘుకాని వెళ్ళేవారు. వెళ్ళినా ఒక్కపూటకన్నా ఎక్కువరోజు లుండటానికి బిడియపడే వారు.

# 15

సుశీలకి తల్లిమీద బాగా కోపమువచ్చింది. ఈసారి ఆమెకి కుటుంబాన్ని చూస్తూంటే అసహనం కలగసాగింది. రఘు ఎప్పుడయితే, ఆమెని చేసుకోనని, తెల్పిచెప్పాడో, అప్పుడే ఆమె హృదయంలో ఈర్ష్యానలం, ప్రజ్వరిల్ల సాగింది. ఆమెకి ముందునించీ, రఘూ అంటే తేలికభావమే వుండేది. అభిమానం అనేది ఎప్పుడూ లేదు. ఈనాడు, తన్ని తిరస్కరించడంతో, ఆమెలో అవమానం రగుల్కొంది. తమంతవారు, ఒక మెట్టుక్రిందికిదిగి, అల్లాంటి దిక్కులేని సంబంధం చూడటమే, తమ అంతస్తుకి ఒక గొడ్డలి పెట్టు! అల్లాంటిది, వాళ్ళు ఆ మాత్రం కృతజ్ఞతకూడా చూప లేకుండగా, కృతఘ్నులై తమని తిరస్కరించటం, అవమానం కాదూ?

"అమ్మా! నువ్వు చేసేవన్నీ ఇల్లాంటి అసందర్భపు పనులే! ఎందుకు అడిగింతావ్, చిన్నాన్న చేతకి ఆ దరిద్రపు

వెధవని నేను కట్టుకుంటాననుకున్నావా? నాన్న ఆస్తిలో, మాకు మాత్రం హక్కులేదా? మా ఆడపిల్లలకేదో, చచ్చు పుచ్చు సంబంధాలుచేసి, బయటకు తోలేసి, ఆస్తిఅంతా, నీ కొడుకులకు, పట్టం కడదామనుకుంటున్నావా? వాడు, ఆరాధి పీనుగ, అంటే పడిచస్తున్నాడు. వాళ్ళా వాళ్లూ, శాముకుని ఏడవనీయి! మనకెందుకీ అక్కర్లేనితద్దినం?" అంది తల్లితో విసుగ్గా. సిద్ధేశ్వరి, నర్మగర్భంగా నవ్వింది.

"పిచ్చిసుశీ! నాకుమాత్రం నిన్ను ఆ తోలీకి తికానా లేనివాడికి ఇచ్చి చేద్దామనుందేమిటి! ఎక్కడ వొప్పుకుం టారో అని భయపడ్డాను. అడిగి లేదనిపించుకుందామనే అడి గించాను. వాళ్ళని కాదని మనంతేట మనం వేరే ప్రయ త్నాలుచేస్తే చిన్నాన్న, ఏమన్నా అనుకోదూ! ఎంత చేసినా, అక్కగారికన్నా ఎక్కువ వాళ్ళం అవగలమా మనం? వాళ్ళే వొదులున్నారుకనుక, ఇప్పుడు మంచి సంబంధం చూసినా ఏమీ అనుకోదు కుటుంబం" అంది సిద్ధేశ్వరి.

"ఆ రాధి అంటే పడిఛస్తారు తల్లీ కొడుకూనూ! అదేదో, రంభ అనీ, లతామంగేష్కర్‌లా పాడుతుందనీ వాళ్ళు ముచ్చటపడ్తారు. చిన్నాన్న మటుకు మనకోసం ఏం చేస్తున్నాడు? ఆ మహానుభావుడు వచ్చినప్పుడల్లా మనం, దాసీవాళ్ళల్లా, ఆయనకి, వేడీ, వెచ్చా చూడటం_ ఆయన పంటఅంతా ఒబ్బిడిచేసుకుని, పెళ్ళాంపిల్లలకి ధారపోయటం! పాపం నువ్వేమో, ఆయనేదో మనకి బంగారు కిరీటం

నెత్తికి పెట్టాడనుకుని మాచేత చాకిరీ చేయిస్తావు! ఇక్కడ డబ్బుతినేవాళ్లు, ఇక్కడకొచ్చి పనిచేసుకోలేరా! బస్తీలు కావాలి పాపం దొరసానులకి. నన్ను కాదని, ఇప్పుడు, ఆ రాధి పీనుగని, చేసుకుంటే, ఎంత అప్రతిష్ఠ! నాకెంత అవమానం? ఎల్లాగూ చిన్నాన్న వాణ్ని పైకి పోనీయటం ఇష్టంలేక ఆ రాధిని కట్టబెట్టాడు. చూడు! అల్లా కనుక జరిగిందంటే. నేను చెర్లోదూకి ఛస్తాను. అప్పైని, నీ తంత్రాలు నువ్వు తీరిగ్గా పన్నుతూ కూర్చోవచ్చు" అంది. సుశీల తీవ్రంగా.

"ఎంత తెలివితక్కువగా ఆలోచించావ్ సుశీ! మనకి కాని పని, వాళ్ళకి అయితే వొచ్చే అవమానం, నాదికాదా! దాని పాటా, దాని అందం అడుక్కు తిన్నాయి. దానిగొప్ప అందుకే ఉపయోగిస్తుంది. నీకింకా పసితనం వదలక అలా అనుకుంటున్నావ్. అక్కా తమ్ముడూ ఏక కుటుంబీకులు అయితే మనకీ వూళ్లో దుమ్ము, దూగరే మిగులుతుందని నాకు తెలీదా ఏమిటి? నీకు పదివేలుపోసి పదివందలు నెలకు సంపాదించే ఉద్యోగస్థుణ్ని తేకపోతే నాపేరు సిద్ధేశ్వరి కాదు. చూడు." అంది.

"లేనిపోని ప్రతిజ్ఞలు చేయకు. మామయ్యలకు నువ్వు ఇల్లంతా దోచి సాయం చేశావు. వాళ్ళు చక్కగా మేడలు కట్టుకుని కులుకుతున్నారు. పెదమామయ్యకొడుకు ఐ. ఎ. యస్. పాసవ్వగానే పొంగిపోయావ్, సుబ్బుల్ని చేసుకుంటాడని. కాని వాడు మన చిన్నక్కకి చదువురాదని

తోసిపుచ్చి పై సంబంధం చేసుకున్నాడు. మనకంటే ఏదో ఇల్లూ వాకిలీ వున్నాయి కనక నీ పుట్టింటివారు నీకు సాయం చేయకపోయినా సాగిపోతోంది. పిన్నిగతేమయింది? తన శరీరం లెక్కపెట్టకుండా, అవమానాన్ని లక్ష్యంచేయకుండా మామయ్యల సంసారాలే తనవి అనుకుని కాసులు కూడ బెట్టి ఇచ్చిందికదా! పిన్ని డబ్బు సంపాదించి ఇయ్యకపోతే నీ తమ్ముళ్ళు సంపాదనలకి ఆ మేడలు కట్టేవాళ్ళా? పిల్లలకి పెద్ద చదువులు చెప్పించ గలిగేవాళ్ళా? కృతజ్ఞత చూపెట్ట కలగటం అంత తేలికయిన సంగతికాదు. ఈనాడు పిన్నిని ఇంటి ఛాయలకి రానీయటంలేదు మామయ్యలు. ఆవిడ తమ బంధువు అని తెలిస్తే సంఘంలో తమపేరు ప్రతిష్ఠలు పోతాయట. ఆపరువీయని డబ్బేదేనావుంటే, ఆ అమర్యాద కరమైన డబ్బు ఇప్పుడన్నా పిన్నికి ఇచ్చేయకూడదూ? ఆ డబ్బు ఆమెకే వుంటే నౌకర్లను పెట్టుకుని చాకిరీ చేయించుకునేదిగా! ఎవళ్ళ స్వలాభాలు వాళ్ళు చూసుకుంటూంటారు. డబ్బుదగ్గిర తల్లనీ, తండ్రనీ, అన్ననీ, అక్కనీ మమకారాలు నించోలేవు! నిప్పుని చూసి పెద్దపులి పారిపోయినట్లు డబ్బునిచూసి మమకారాలు పారిపోతాయి. నీకసలు ఎవళ్ళ సంగతీ తెలీదు. అసలే అన్నపూర్ణ పిన్నికి మన మీద కుళ్ళు వుంటుంది. మండేపొయ్యిలో నెయ్యిపోసినట్లు మన సీతక్క కూతుర్ని, వాళ్ళ శంకరానికిచేసుకోమంటావు. చిన్నాన్న చేతకూడా చెప్పించావ్. మన 'సుభాషిణిని' అన్నం తిననిస్తుందా ఆపిన్ని?" అంది సుశీల.

"తొందరపడుతున్నావ్! నేను నా పుట్టింటినించి పొందలేని ఆప్యాయత, మీ పిన్నికి మటుకు ఎలా లభించు తుందే ? చూస్తోవుందు; నీకేం తెలుస్తుంది ఇప్పుడు?" అంది సిద్ధేశ్వరి. ఈలోగా కుటుంబం పొలంనించి ఇంటికి వచ్చాడు. కుటుంబం కుప్పనూర్పుళ్ళు అయిపోయాయి. ధాన్యం మిల్లుకి పట్టించి డబ్బుకూడా చేసుకున్నాడు. ఇంక ఒకటి రెండు రోజుల్లో భార్యదగ్గరకి వెళ్ళిపోతాడు. కుటుంబం చెంబు తీసుకుని చెరువుకి వెళ్ళి స్నానంచేసి వొచ్చాడు. సుశీల కంచం వేసి మంచినీళ్ళచెంబు ప్రక్కన పెట్టి, విసనకర్ర పట్టుకుని నించుంది. కుటుంబం వొచ్చి భోజనానికి కూర్చు న్నాడు. సిద్ధేశ్వరి భోజనం వడ్డిస్తూ తన అస్త్రం విసరటం మొదలెట్టింది.

"ఏదో తండ్రిలేనిపిల్ల, తన కడుపులో దాచుకుం టుంది- అనుకున్నాను. నిర్మోహమాటంగా చెప్పేసింది కుర్రాడు, ఇష్టపడటం లేదని! ఆమెకి ఎవరూ లేరు; మాకూ ఎవరూ లేరు. ఏదో కలిసిపోతే చాలునని భ్రమపడ్డాను. నా నమ్మకం, నట్టేటిలోముంచారు-తల్లీకొడుకూనూ! అదే,దాని తండ్రివుంటే, ఇల్లా సంబంధం చెడిపోనిచ్చేవారా?" కళ్ళ మ్మట నీళ్ళు రాకపోయినా, ఒకసారి, చీరచెంగుతో కళ్ళు తుడుచుకుంది సిద్ధేశ్వరి. కుటుంబానికి కూడా కష్టంగానే వుంది. అన్నగారింటి పంచన అన్నాళ్ళువుండి, ఆ మాత్రం కృతజ్ఞత తన అక్కగారు చూపక పోవటంతో కుటుంబానికి సుబ్బమ్మ అంటే, కోపం వచ్చింది.

"పోనీ లేమ్మా! నువ్వేం దిగులు పడకు. నావాటా అంతా తెగనమ్మి నా రేసి అయినా, సుశీని పెద్దవుద్యోగస్థుడికి ఇచ్చి, చేస్తాను. నువ్వేం దిగులుపడకు! ఏదో కలుస్తారేమో అని చూశాం. నాకక్కర్లేదు- అంటే వెళ్ళి కాళ్ళ మీద పడేస్తామా ఏమిటి?" అన్నాడు.

"ఇంకో చిత్రం! అతనికి, అనూరాధని చేసుకోవాలని వుందట! అది తెలీక సుశీని చేసుకోమ్మని అడిగాం. 'చిన్న మామయ్య, అన్నకూతుర్ని ఇస్తానన్నాడు కాని, తన కూతుర్ని ఇస్తానని మాటకన్నా అనలేదు. అనూరాధని ఇస్తే కళ్ళుమూసుకుని చేసుకుంటాను' అన్నాడట. చూడండి, కాకి ముక్కుకు దొండపండట! ఆశకు, అంతనేదిఉండాలి. మన రాధమ్మని చేసుకపోవాలని వుందికాబోల్ను! దీన్ని వచ్చలేదంటే, మా అమ్మాయిని ఇస్తాం అంటారు కదాఅని తల్లీ కొడుకూ ప్లాను, వేసుకున్నారల్లేవుంది. ఒక్కగానొక్క పిల్ల అల్లారు ముద్దుగా పెరిగింది. చదువూ సంగీతం వొచ్చినపిల్ల. ఈ దిక్కుమాలిన సంబంధానికి ఇచ్చి, దాన్ని జన్మాంతం దుఃఖపడేలా చేయటం ఎందుకు? ఒకవేళ పైకిపోవటమెందుకని ఇచ్చిచేసినా, మన రాధమ్మ, ఆవిడగారి మడీ, ఆచారానికి తట్టుకోగలదా? సుశీఅంటే, పల్లెటూళ్ళో పెరిగింది కాబట్టీ, పైగా చిన్నప్పట్నించీ, ఇద్దరూ ఆటపాటల్లో పెరిగారు కాబట్టి, ఆశపడి, ఆ మాత్రం అపేక్ష ఉండక పోతుందా అని అడిగాం; ఇప్పుడు, ఇన్నిరోజులుగా ముచ్చట పడుతున్న మేనరికం కాకపోయినాక,ఇంక సుశీకి సంబంధం కుదరటం ఎంతకష్టం? ఏం వంక వుందో,

స్వయానా వాళ్ళింట్లో పెరిగిన మేనబావ వద్దన్నాడు- అను కోరూ?" అంది సిద్ధేశ్వరి.

"ఆఁ ఎవరనుకుంటారమ్మా వొదినా, మీ పిచ్చిగాని! మన అంతస్థుకి తూగరని, మనమే ఇవ్వలేదని అనుకుం టారుగాని; వాళ్ళు నిరాకరించారని ఎందుకు అను కుంటారు?" అన్నాడు కుటుంబం.

"ఇంకొక సంగతి మీ చెవిన పడిందో లేదో, 'మా పెద్దమామయ్య, నా చదువుకి డబ్బు ఇమ్మంటే ఇవ్వలేదు. నాకు వడుగు చేశానని వంక పెట్టి, మా అమ్మ నగలమ్ముకొని ఇచ్చినడబ్బంతా కాజేశాడు. నేను అష్టకష్టాలుపడి చదువు కొని ఉద్యోగం చేసుకుంటుంటే, నా కాళ్ళమీద నేను నిల బడితే తగుదునమ్మా అంటూ అయిదు వేలిస్తాను; మూడు వేలిస్తాను, పిల్లను చేసుకొమ్మంటూవచ్చారు ఆ మాత్రం పిల్లనివ్వాలన్న వుద్దేశ్యమే పెద్దమామయ్యకు వుంటే నా కాలేజీ చదువుకు, నా డబ్బు కాజేసి కూడా ఎందుకని, సాయం చెయ్యడు?' అన్నాట" అంది సిద్ధేశ్వరి. భగ్గుమంది కుటుంబం హృదయం. దేముడిలాంటి తన అన్నయ్యని చని పోయినాక కూడా ఆ మాటలు అంటూంటే, సహించలేక పోయింది కుటుంబం భ్రాతృవాత్సల్యం!

మనిషిలోని మంచినికానీ చెడునుకానీ, గుర్తెరిగిన బంధువులు, ఆమనిషి బ్రతికివున్నా చనిపోయినా చెప్పు కుంటారు. అందుకే ప్రతి ఆలోచించి పని చేసే వ్యక్తికూడా, బ్రతికినన్నాళ్ళూ మంచిగా నడుచుకుందుకే ప్రాధాన్యత ఇస్తాడు. వ్యక్తి నశించినా ఆవ్యక్తియొక్క గుణశీలాలు

నశించవు. తరతరాలుగా చెప్పుకుంటూనే వుంటారు. కీర్తి కానీ అపకీర్తికానీ అజరామరమైనది.

«ఏడిశాడు వాడిబొంద! వుద్యోగం అంటూ దేవు ళ్ళాడుతున్నాడు కనుకనే వాడికి పిల్లనివ్వాలను కోవటం. అంతేకాని, సిలన్, కొబ్బరి చిప్ప పట్టుకు తిరిగితే వాడికి పిల్లనిచ్చి పెళ్ళిచేస్తానని పూ*కేగే వాడెవడు !» అన్నాడు.

"మహాబాగా చెప్పారు. మీా ఎదుట అనాల్సింది, నాలుగూ దులిపేద్దురు. ఏమిటో కుర్రతనం, వెర్రిమాటలూ" ప్రాసగా అంది సిద్ధేశ్వరి.

"అంతే! అంతే! నా ఎదుట అంటే మక్కెలువిరగ తందును. వీడిబోడిడబ్బు కాజేస్తేకాని నా అన్నకు గడవలా వెధవమాటలు. పిట్టకొంచెం కూతఘనం" అన్నాడు ఉత్త రాపాసన పట్టివేస్తూను.

సిద్ధేశ్వరి తృప్తిగా నవ్వుకుంది. సుశీల అంతవరకూ పినతండ్రి ప్రక్కన నించుని విసురుతున్నదల్లా, ఆయన లేచి వెళ్ళేసరికి చేతిలోని విసనకర్రని నేలవేసి కసిగా విసరి కొట్టింది.

"హుం. అన్ని మాటలు చెప్పావు; తను అన్ని మాటలు అన్నాడు. కాని 'రాధి'ని మటుకు వాడికి చస్తే ఇవ్వనని' అన్నడా ? ఎందుకు అంటాడు? మనసులో వాడికి ఇవ్వాలనేవుంది. తన కూతురు కన్నా ఎక్కువా నేను ? డబ్బుపెట్టి గొప్ప సంబంధం చేస్తాడట. పాపం ఈయనగారు నాకు దానం చేస్తాడు కాబోలు. నాతండ్రేతనకి చదువూ,

సాధ్యాలేవని, ఆ బస్తీ పెళ్ళాం చిన్నచూపు చూసి వెళ్ళ గొట్టుతుందని ఆస్తి సగానికి సగం చెక్కలుచేసి దానం చేశాడు. అది మళ్ళీ మనకి దానం చేస్తాడేమిటి ? మనం ఇచ్చినది మన ముఖానే కొట్టాడు. ఇన్నాళ్ళబట్టీ మామగారింటిలో దాచుకున్న డబ్బంతా పెట్టి, శుభ్రంగా పొలమో మేడో కొనుక్కుని కులుకుతాడు పెళ్ళాం పిల్లలతో. చాకిరీ మనవంతు, ఆస్తులూ కులకడం వాళ్ళవంతు." అంది సుశీల కసిగా.

"రఘుకి చిన్నాన్న, రాధిని ఇయ్యడు. నాదీపూచీ" నమ్మకంగా అంది సిద్ధేశ్వరి.

"చూస్తాగా ?" ఎద్దేవాగా అంది సుశీల.

# 16

రఘుకి చిన్నతనం నించీ, సిద్ధేశ్వరి అంటే ఒకవిధమైన భయం వుండేది. సిద్ధేశ్వరికూడా ఎప్పుడూ రఘుని మంచిచేసుకుందుకు ప్రయత్నించేది కాదు. ఆవిడకా అవసరం వుండేదికాదు. సుబ్బమ్మ, రఘుకూడా ఆ ఇంటిలో కాందిశీకుల్లాగడిపారు కాని ఒకవిధమైన ఆత్మీయతా బంధుత్వంతో కాలం గడపలేదు. సుబ్బమ్మఆడపుట్టువు కావటంతో పుట్టింటి నించి తనకి ఏమీ చిల్లికాసీ లభించకపోయినా బాబ్జివచ్చి తన చెల్లిని ఇస్తామనగానే పొంగిపోయింది. స్త్రీ హృదయం

సముద్రంలాంటిది. అది ఎలాంటి కల్మష కశ్మలాలనుతీసుక వచ్చిన కాలువ నీటినైనా నిండుహృదయంతో పొంగి పోతూ తనలోనికి విలీనం చేసుకుంటుంది. రఘుకి అలా వుండమంటే ఎందుకు వుంటుంది? సుశీలని తన కిస్తా ననగానే, చిన్నప్పటి సుశీల గుర్తుకువచ్చింది రఘూకి. అందరి మీదా లేనిపోని చాడీలు చెప్పటం, అసమానూ చింతగింజలు వాళ్ళో పోసుకుని వాళ్ళింటికీ వీళ్ళింటికీ తిరుగు తోంటం, వాక్శుద్ధిలేక బండగా, లేడామాటలు మాట్లాడు తోంటం రఘు కళ్ళకి కట్టినట్లయింది. ఒక్కసారి రఘూ శరీరం జలదరించింది. 'అందంచందంమాటా, డబ్బూ, దస్కం మాటా, దేముడెరుగును. అలాంటి పిల్లని చేసుకుని సంసారం ఎలా చేస్తాను?' అని భయపడ్డాడు. సుబ్బమ్మ పుట్టింటివాళ్ళతో సంబంధాలు తెగిపోతాయి అని బాధ పడుతోంది కనుక చిన్నమామయ్య కూతురయితే ఫరవా లేదు_ అనుకున్నాడు. అనూరాధ పెరిగి పెద్దయినాక రఘూ చూడలేదు. చిన్నప్పుడు ఎప్పుడన్నా సుబ్బమ్మతో వెళ్ళినప్పుడు, అనూరాధ చనువుగానే వుండేది. పెద్దయి నాక రఘు ఎప్పుడన్నా వెళ్ళినా ఇంట్లోంచి బయటకు వచ్చేదికాదు. చిన్నప్పుడు అంతా అనూరాధకి తన తండ్రి వెంపు బంధువులు ఎవళ్ళన్నా వస్తే, ప్రాణం లేచివొచ్చేది. మేనత్త సుబ్బమ్మ అంటే ఆ పిల్లకి ప్రాణంగా వుండేది. ఆవిడ పక్కలోనే పడుకునేది. ఆ పిల్ల తండ్రివూరు ఎప్పుడూ చూసి ఎరుగదు అందుకని సుబ్బమ్మ వూరు ప్రయాణ మయ్యేసరికల్లా తనూ వస్తానని ఏడ్చేది. సుబ్బమ్మ బండి

ఎక్కుతోంటే, కాళ్ళకు చుట్టుకుపోయి ఏడ్చేసేది. చిన్న గౌను, చిన్న జెడ వేసుకుని లేతబుగ్గలు ఎరుపెక్కిపోగా, వెక్కి వెక్కి ఏడుస్తోన్న అనూరాధని చూస్తే రఘూకి జాలి వేసేది.

"తోసీ పంపించకూడదు అత్తా! నేను తీసుకవచ్చి దిగబెడతాను మళ్ళీ!" అనేవాడు. అంతా ఫక్కున నవ్వే వాళ్ళు. తనన్నదాంట్లో, నవ్వొచ్చేమాట ఏముందో రఘుకి తెలిసేదికాదు.

"మీ మామయ్య కోప్పడతారు నాయనా! లేక పోతే పంపిద్దును" అనేది అన్నపూర్ణ.

"ఏమ్మా! పాపం ఎంతలా ఏడుస్తోందో చూడవే! తీసుకురామ్మా! మామయ్యతో ఏదో చెప్పొచ్చు!" అనేవాడు.

"వొద్దు. అసలే చినమామయ్య కోపిష్టిమనిషి! ఈసారి వొచ్చినప్పుడు అడుగుదాం! తీసుకవెళ్ళమంటే తీసుకవెళ్దాం" అనేది సుబ్బమ్మ.

అలానే 'రాధి' ఏడుస్తోండగానే వెళ్ళిపోయేవారు. వెళ్ళిన రెండు మూడు రోజుల దాకా రఘూకి, మతి తోచేది కాదు. చదువుకోబుద్ధి వేసేది కాదు. ఒకసారి సాహసం చేసి చిన్నమామయ్యని అడిగాడు రఘు. అసలు చిన్నమామ య్యతో మాట్లాడటమంటే జడసేవాడు. అయినా 'రాధి

ఏడుపు రఘు, ఆత్మీయతా హృదయం స్పందింప చేయగా ధైర్యంచేసి అడిగాడు.

"పోనీ ఒకసారి తీసుకరా మామయ్యా! అంతలా వస్తానని ఏడుస్తోంటుంది రాధి."

కుటుంబం, భళ్ళుమని నవ్వాడు.

"అరి పిల్లగాడిదా! దానిమీద దయ పుట్టిందిరా నీకూ! ముందు బాగా చదువుకుని పరీక్షలు ప్యాసవు! అప్పుడు ఏకంగా అట్టే పెట్టుకుందువుగాని! అయినా, 'రాధి' మునపట్లా ఏడవటంలేదు. చక్కగా చదువుకుంటోంది. సంగీతం పాడుకుంటోంది. ఇప్పుడు రమ్మన్నా రాదు" అన్నాడు. సుబ్బమ్మ ముసి ముసిగా నవ్వుకుంది. రఘూ సిగ్గుపడ్డాడు. ఈమధ్య వెళ్ళినా 'రాధ' కనపడటం లేదురఘూకి. 'రాధ' రూపం చిన్నగానూ, చిన్న జెడా, చెంపలు ఎరుపెక్కిపోయి లేతగులాబీ రేకుల పెదాలు అదరటమూ, అదే పదేపదేగా, జ్ఞాపకం వచ్చి ఆ పిల్లదాని పట్ల ఆపేక్షగా రూపొందింది.

"అమ్మా! 'రాధి'ని ఎదిగాక నేను చూడనేలేదు. ఎలా వుంటుందే" అన్నాడు.

"బాగానే వుంటుంది. పచ్చగా పొడుగ్గా వుంటుంది. పాటకూడా బాగా పాడుతుంది" అన్నది సుబ్బమ్మ.

ఇంకా ఏదన్నా వర్ణిస్తే బాగుండు ననుకున్నాడు రఘు. కాని సుబ్బమ్మ రచయిత్రి కాదుకనుక, అనూరాధ అందచందాల్ని, సంగీత సాహిత్యాల్ని, అంతకన్న ఎక్కువగా వర్ణించలేకపోయింది.

"అయినా ఒకసారి చూడాలి" పైకి అనకుండగా వుండలేకపోయాడు.

"అసలు ఇస్తానని, చిన్న మామయ్య అననీయి. అప్పుడు తర్వాత చూడొచ్చు." అన్నది సుబ్బమ్మ.

"ఇవ్వడంటావా ?" అన్నాడు రఘు.

"మనం సుశీని కాదన్నామని కోపంవచ్చి వుంటుంది చిన్నమామయ్యకి" వూహించిన సంగతి చెప్పింది సుబ్బమ్మ.

"సుశీని కాదన్నామని కోపం తెచ్చుకుంటారా ఎవరన్నా? పోనీ ఆ పిల్ల నచ్చకపోతే మా పిల్లని చేసుకో; అంటారు కానీ;" ఆలోచనగా అన్నాడు రఘు.

"అలా అనేవాడయితే ఆ వేళనే, ఇక్కడి కొచ్చినప్పుడే అనొచ్చుగా ? ఏమీ మాటకయినా ఒక ముక్కన్నా అనకుండగా వెళ్ళిపోయిన మనిషిని పట్టుకుని వెనకాతలే మనం వెళ్ళి అడగాలా? ఒకవేళ అడిగినా, ఆ ముచ్చట తీరుస్తాడనే నమ్మకం నాకు లేదు"అంది సుబ్బమ్మ.

"ముచ్చట పడ్డవాళ్ళ ముచ్చటలన్నీ ఎవరు తీర్చగలరే. దానికి భగవత్సంకల్పం కూడా తోడువుండాలి. 'బాబ్జి' బావ ముచ్చటపడే వచ్చి అడిగాడు. నేను తీర్చగలిగానా ? అట్లాగే, నా ముచ్చట చిన్నమామయ్య తీర్చటానికి అశక్తు డవ్వవచ్చును. తీరదేమో అన్న అనుమానంతో, మనసులోని కోరికని మనసులోనే దాచుకుంటే తీరా చేయి దాటిన తర్వాత, అయ్యో! మనసులోని మమతని బయటపెట్టటం చాలేకాక, చేతులారా మసి చేసు

కున్నామే; అని బాధ పడవలసి వస్తుంది. బాధ అన్నది ఎప్పుడయినా తప్పదుకదా! మన కర్తవ్యం మనం నిర్వహించుకున్న నాడు, మనవల్ల లోపమేమీ లేదనే తృప్తివల్ల, బాధ అనుభూతి కూడా ఆనందాన్నే ఇస్తుంది. ఫలితమన్నది భగవంతుడు తేల్చవలసిన సంగతి! మనం ఈ జీవన నాటకంలో కేవలం పాత్రధారులం. భగవంతుడు ఏది ప్రసాదిస్తే దాన్ని నిండు మనస్సుతో స్వీకరిస్తాను. సుఖాన్నే ప్రసాదిస్తాడో, దుఃఖాన్నే ప్రసాదిస్తాడో, అది నా పూర్వజన్మ సంచితమై వుంటుంది" అన్నాడు రఘు.

సుబ్బమ్మ నిర్ఘాంతపోయింది. తన కొడుకులో ఇంత తర్క వితర్కాలువున్నాయని ఆమెకు తెలీదు. ఇంకా చిన్న కుర్రవాడుగానే ఆమెకళ్ళకి కనపడేవాడు. పెళ్ళి విషయంలో కూడా, తన మాట వింటాడని ఆమె అభిప్రాయపడింది. కాని ఆ విషయంలో కూడా, రఘూ పెరిగిపోయి తన వివాహం గురించి తనే ఒక స్థిర నిశ్చయానికి వచ్చేశాడు. భయంపుట్టుక వచ్చింది. ఒకవేళ, కుటుంబం ''రాధ''ని ఇయ్యనంటే ఎలా? తనకా ఒక్కగాని ఒక్కకొడుకు; ఏం అఘాయిత్యం చేస్తాడో! శరీరం జలదరించింది సుబ్బమ్మకి. అయినా పైకి బింకంగా,

"ఇస్తే ఇస్తాడు లేకపోతే లేదు. నువ్వన్నట్టుగా, మనకు రాధినిస్తే చేసుకుంటామని చెప్తాను. ఇవ్వకపోతే, మనం గుళ్ళపాడు సంబంధం సెటిల్ చేసుకుందాము. పిల్ల

అందంగా వుంటుంది. కట్నం తక్కువైతేనేం కాక; ఆ పిల్ల తల్లిలేదు. మనతోపాటుగా కలిసిపోతుంది" అంది.

"అవును. ఆ పిల్లకి దిక్కులేదు, మనకీ దిక్కు వుండదు. దిక్కుమాలిన సంబంధం సమంగా సరిపోతుంది. తప్పకుండా అలానే చేద్దాం" అన్నాడు నిర్వేదంగా రఘు

కొడుకు ఏ అన్యమనస్కతతో అంటున్నాడో సుబ్బమ్మ గ్రహించకపోలేదు. అయినా కొడుకు ధోరణి అనుకూల వాతావరణంలో పడేదాకా ఆమె మనస్సుకి ఉపశాంతి లభించదు.

"వెంటనే వెళ్ళి, కనుక్కుని వచ్చేస్తాను. ఏ సంగతీ తేలిపోతే, ఈ మాఘం లోనే నీ పెళ్ళి చేస్తాను. నాకూ వృద్ధాప్యము వచ్చేస్తోంది. ఒక కొడుకనీ, కోడలనీ ముచ్చట చూడకుండానే పోతానేమో అని భయంగా వుంది" అన్నది సుబ్బమ్మ.

"అలాంటి మాటలు అనకోకు అమ్మా! నా కంఠంలో వూపిరి వుండగా, నువ్వు ఏ విధంగానూ కష్టపడటం నేను సహించను" అని బయటికి వెళ్ళిపోయాడు రఘు. సుబ్బమ్మ మర్నాడే అన్నపూర్ణ వద్దకి ప్రయాణమైంది.

# 17

'బాబ్జికి' కూడా చిన్నాన్న అంటే అసహనం కలిగింది. బాబ్జి ఒక బీద అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. ఆరుగురు ఆడపిల్లలు కలిగారు. మళ్ళీ నెలతప్పినట్లు అనుమానం. సుశీల పెళ్ళిఅంటూ అయిపోతే, ఆస్తి పంచుకోవచ్చని బాబ్జికి ఆశ. తల్లి మాట నమ్మి, చిన్నాన్నని తీసుకుని వెళ్ళి, మేనత్తని అడిగి లేదనిపించుకోవటంతో బాబ్జికి చిరాకేసింది.

"ఆయనకి కూతుర్నే ఇచ్చుకోవాలని వుండేమో! లేకపోతేతన సుశీ గురించి, కాస్త గట్టిగా చెప్పి వుందును. ఇప్పుడు ఎక్కడని వెతుకుతాం సంబంధాల్ని? ఈ రోజుల్లో, ప్రతివాళ్ళకి చదువూ, సంధ్యలూ– సంగీతాలూ, సాహిత్యాలూ ఎక్కువైపోయాయి. ప్రతీవాళ్లూ ఏం చదువుకుందని, అడిగేవాళ్ళే. ఏం చెప్పను? పోనీ పాట వచ్చునని చెప్దామంటే మంగళహారతి కూడా పాట్టం రాదాయె. నాకేమీ పాలుపోకుండా వుంది." అన్నాడు తల్లితో.

"ఆయన కూతుర్ని ఎందుకిస్తాడు? ఇక్కడిన్నించీ, పట్టుకెళ్ళిన పంట అంతా, మామగారి దగ్గర దాచుకున్నాడు కదా. ఏ ముప్ఫయ్ వేలో అవుతాయి. అవి ఇన్నాళ్ళూ, ఇల్లు కనిపెట్టుకుని వుండి, ఆ ముసలాయనకి చాకిరీ చేసి, తల్లి లేనిపిల్లాడిని పెంచి పెద్దచేసినందుకు ఆయన. ఏ ఇల్లో

వాకిలో పిన్నిపేర వ్రాసేవుంటారు. అదీ ఇదీ కలిపి శుభ్ర మైన సంబంధం చేస్తారు." అంది సిద్ధేశ్వరి.

"అమ్మా; చిన్నాన్న దగ్గర ముప్ఫయ్‌వేలు పోగు పడ్డాయిటే" ఆశ్చర్యంగా అన్నాడు బాబ్జి.

"ముప్ఫయ్‌వేలేం కర్మ, ఇంకా ఎక్కువే వుంటాయి. ఆయనకి ఖర్చు ఏమివుంది? ఇక్కడవుంటే మనింట్లోనూ, అక్కడ వుంటే అత్తవారి ఇంట్లోనూ తిండి వెళ్ళిపోతుంది. ఇంకా పంట అంతా ఆదాయె," అంది.

"ఇక్కడ్నించి నువ్వు వండి పెట్టకు. ఈయనకి మనం నౌఖరీలమా? కాస్త సుశీల పెళ్ళికైనా సాయం చేయలేక పోయాడు. దౌర్భాగ్యుడు. డబ్బంతా మూట కట్టుకోటం మరిగాడు బాగా;" అన్నాడు బాబ్జి. బాబ్జికి ఈమధ్య డబ్బు విలవ బాగా తెలిసి వస్తున్నది. ప్రేమించిన అమ్మాయి, పేద దైనప్పటికీ, ఆమె అందాన్ని మోహించి, అదే హృదయం గమమైన ప్రేమ అనీ, తనేదో గొప్ప త్యాగమూర్తి అనీ గప్పాలు కొట్టుకుంటూ పెళ్ళి చేసుకున్నాడు. ఆ యువతి ఆరుగురుఆడపిల్లల్ని,అతనిలోనిదివ్యప్రేమారాధనకిజ్యోతుల్లా నిలబెట్టింది. ఇంకా అతనిలోని ప్రేమామృతం ఇంకిపోకుండా యధాశక్తి దోహదం చేస్తోనే వుంటోంది. అంతవరకూ, "ప్రేమమయమిా జీవనమూ, త్యాగమయమిా జగమూ" అంటూ ఉప్పొంగిపోయే వాడల్లా, తనకి ఇద్దరు కూతుళ్ళూ వోణీలు వేసుకోవటం చూసేసరికి ఒక్కసారి చప్పబడి పోయేడు. ప్రేమ, ఆర్థిక తుష్టిని ఇవ్వలేదుగా మరి ? అవ తల చెల్లెలి పెళ్ళి అయితేకాని, ఆస్తి పంపకానికి తల్లీ,

తమ్ముడూ వొప్పుకోరు. పోనీ తన కూతుళ్ళని అందగత్తె లేమో, ఎవరన్నా ప్రేమించి అయినా పెళ్ళి చేసుకుంటారు-అనుకుందుకు వీలులేదు. అందరాడపిల్లలకీ మేనత్తల పోలికలు తప్ప తల్లిపోలిక రాలేదు. అంచేత, కొన్ని వేలు పోస్తే కాని, అతని ఆడపిల్లలకి సంబంధాలు కుదరటం కష్టం. దానితో బాబ్జికి డబ్బుయొక్క విలువ బాగా వంటపట్టింది. పెళ్ళాంతో «పోనీ ఆపరేషన్ చేయించుకోనా, పిల్లలు ఎక్కువౌతున్నారు?» అన్నాడు. ఆ మాటకి, ఆమె త్రాచల్లే లేచి పోయింది. తను నయాపైస తేలేకపోయినా వంశాంకురం మీాది మమకారం ఆమెలో లేకుండగా పోలేదు.

"ఒక్క మగనలుసన్న లేదుకదా; మీాకు నోరెట్టా వచ్చిందీ అలా అంటానికి" అని ఏడ్చింది.

"భగవంతు డిచ్చిన వరాలని వద్దనకూడదు నాయనా"అని, అతనిఅత్తగారుసూక్తి చెప్పింది ప్రతీఏడూ మగనలుసు కలుగుతుందేమో అని చూడటం, ఆడభూతం కలగడం అలవాటు అయిపోయింది ప్రతీ, ఫామిలీ ప్లానింగు వర్కరూ, పిల్లల్ని ఆర్థిక ఇబ్బందుల్లో పెంచటం కష్టమని, ఆపరేషన్ చేయించకోవటం ఉత్తమం అనీ,'బాబ్జి' భార్యకి తమ శక్తివంచన లేకుండా చెప్పేవారు.

ఈ సారికి పోనియ్యండి ఒక్కమగ నలుసు కలగగానే, ఆపరేషన్ చేయించుకుంటాను." అంటూ, వుండేది. తన భాగ్య ప్రతీఏడూ ఒకొక్క పిల్లని కని తన దరిద్రం పెంచుతూంటే, బాబ్జి, తన చేతకాని తనాన్ని, కించపరుచుకోవటం ఇష్టంలేక, తక్కువ పిల్లలున్న వాళ్ళనిచూసి ఈర్ష్య

పెంచుకునేవాడు. ఒకొక్క పిల్లలున్న వాళ్ళు ఏదో విధంగా నశించపోకూడదా! వాళ్ళ ఆస్తి తమకు కలవకూడదా— అని నిత్యం ఆలోచించేవాడు. తను చేతులారా దరిద్రం పెంచుకున్నాడన్న, అభిప్రాయం అతనిలో ఎప్పుడూ కలిగేదికాదు. చిన్నాన్న తమ ఇంట్లో తిండిజరుపుకుని ధనవంతుడై పోతున్నాడన్న దుగ్ధ, అతని శరీరాన్ని దహించివేసింది.

"కావల్సి వస్తే వేరే మకాం పెట్టుకుంటాడు. నువ్వే మాత్రం భోజనానికి పిలవకు" అన్నాడు.

"అల్లాగే! నాకుమాత్రం ఓపిక వుండిచచ్చిందా ఏమిటి! ఏమిటో ఆడపిల్లలు గలవాళ్ళం! దేనికయినా అండగా వుంటాడని జోరనిచ్చాను" అంది.

"ఏం అండ! సీతక్క కూతుర్ని వాళ్ళ బావ మరిదికి చేసుకో నిస్తాడా పోనీ?" అన్నాడు.

"ఎందుకు చేసుకోరు? చచ్చినట్లు చేసుకుంటారు. లేకపోతే, అన్నపూర్ణ అక్కడ్నే వుంటుంది." అంది సిద్ధేశ్వరి.

"పోన్లే, చేసుకుంటే మాత్రం మనకేం ఒరుగుతుందిలే! గుర్రానికి తోకవుంటే, గుర్రమే విసురుకుంటుంది. సీతక్క కూతురు, డబ్బుగల ఇంటిలోపడితే అది సుఖపడుతుంది. మన కేమన్నా పెట్టిపోస్తుందా ఏమిటి? మన బ్రతుకు ఎక్కడ వున్నావు గొంగళీ అంటే, వేసిన

చోటే వున్నాను- అన్నట్లు వుంటుంది.” అన్నాడు బాబ్జి. బయటకు వెళ్ళిపోయేక, సుశీల అంది.

“చూశావా అమ్మా! అన్నయ్యకుళ్ళు. సీతక్క కూతురుకి గొప్ప సంబంధం అవుతే తనకేం ఒరగదని అంటు న్నాడు. నన్నేమో ఆ గతిలేని రఘుగాడికిచ్చి ఏదో అయిం దనిపించేసి, ఆ స్తిఅంతా పంచుకుని, తీరిగ్గా తన కూతుళ్ళకి, పెద్దపెద్ద వుద్యోగస్థులని తెచ్చి పెళ్ళి చేయాలని తాప త్రయం! అమ్మా, నువ్వు వున్నావుకనుక సరిపోయింది. లేకపోతే, ఈ అన్న తమ్ములు నాకు పెళ్ళి చేస్తారా? వాళ్ళ పిల్లల్ని ఎత్తుకు మోస్తూ, వాళ్ళు సినిమాలకూ షికార్లుకూ వెళ్ళి వస్తోంటే, నేను ఇంట్లో వండి వార్చి పెడు తోంటే ఇంతకూడూ, గుడ్డా, పడేస్తారు. తనకి తన పిల్లలు అందరూ ఎలా సమానంగా, కనపడతారో అల్లానే తనతల్లి తండ్రులకి కూడా తమ పిల్లలందరూ సమానంగా కనపడతా రని తెలీదు కాబోల్ను. ఈ ఆ స్తిఅంతా తనూ, తన పెళ్ళామూ, పిల్లలే, అనుభవించాలన్న తాపత్రయం తప్ప, అయ్యో, మన కష్టార్జితమేమీ కాదు! మన అక్క చెల్లెళ్ళకి, అన్నతమ్ములకి కూడా, మన తండ్రి ఆస్తి అనుభవించ టానికి హక్కువుంది- అన్న జ్ఞానం వీళ్ళ ధనదాహంలో నశించి పోతుంది కాబోల్ను! అంతా, తనూ తన పిల్లలూ తప్ప ఇంకెవరూ బాగుపడకూడదు!” అంది.

“అంతే నమ్మా! అంతే. అందుకే ‘తల్లిగలప్పుడే పుట్టిల్లు; పాలుగలప్పుడే పరమాన్నం!’ అని అన్నారు. తల్లి తండ్రి లేని పిల్లల్ని ఎవరాదుకుంటారు? అన్నలు మంచికి

చూసినా, వదినలు వెనకాతల వాతలు పెడారు – తామూ ఆడపుట్టుకే, పుట్టామనీ, తను పుట్టింట తమకీ ఈ మాత్రపు సన్మానమే జరుగుతుందనీ తెలిసికూడా. అందుచేతనే తమరూ, తమ ఆడపడుచులని, నీచంగా చూడాలని, తలుస్తారేమో!" అంది సిద్ధేశ్వరి.

# 18

తండ్రి వచ్చిన నాలుగు రోజులకే, మేనత్తసుబ్బమ్మ రావటం, 'అనూరాధ'కి ఎంతో ఆనందాన్ని కలిగించింది. ఎప్పుడూ, అక్కగారు రావటంతోనే, ఆకబుర్లు ఈ కబుర్లు చెప్తూ, కూడా కూడా తిరిగే, కుటుంబం, సుబ్బమ్మ రాంగానే ఏదో పనివున్నట్టు, బజారుకేసి వెళ్ళిపోవటం, అన్నపూర్ణకి, ఆశ్చర్యాన్ని కలిగించింది. అయినా మామూలు ఆదరణభావంతోనే సుబ్బమ్మని ఆహ్వానించింది.

"ఒక ముఖ్యమైన పనిమీద వొచ్చాను." అంది సుబ్బమ్మ. అనూరాధ కాళ్ళు తలుపువెనకాల నించున్నాయి.

"ఏమిటి?" అంది అన్నపూర్ణ.

"ఏంలేదు. ఈ సంవత్సరం, రఘుకి పెళ్ళి చేసేద్దామనివుంది. ఏదో మా అంతస్థుకి తగ్గ సంబంధాలు వస్తు

న్నాయి. అయినా, నీ కిచ్చిన మాట నిలపెట్టుకోవాలనే వుద్దేశ్యంతో వచ్చాను. రఘు కూడా, 'రాధి' విష యంలో సుముఖంగానేవున్నాడు. అంచేత, మీరు అంగీక రిస్తే, ఈ మాఘంలోనే, రఘుపెళ్ళి చేసేద్దాం!" అంది సుబ్బమ్మ. అన్నపూర్ణ కళ్లు ఆనందంతో చెమర్చాయి. తలుపు వెనకాతలి లేతమనసు తేలిపోతోంది. అనూరాధ చప్పున, ప్రక్కగదిలోని అద్దం ముందుకు వెళ్ళి నించుంది; ఆ పిల్ల దాని, దానిమ్మ పూరేకల్లాంటి పెదాలు వూరికే అదురుతున్నాయి. లేతగులాబీ పూల మృదుత్వంతో వున్న గుండ్రని బుగ్గలని, ఒక్కసారి, అరచేతులతో పట్టుకుని, నవ్వుకుంది. ఒక్కసారి, "రఘుబావ" అనే, అదృశ్యవ్యక్తి యొక్క వూహా రూపం, ఆ పిల్లదాని మనో నేత్రంముందు నించోగానే, అనూరాధ శరీరం యావత్తూ ఆనందోత్సా హంతో గజగజలాడింది. వివాహం అన్నది నూరేళ్ళపంట. కోరుకుని, మనసారా ఆరాధించిన వ్యక్తి, బాలికకు భర్తగా లభిస్తే ఆ బాలికకు, ఇహ పరాల భేదము కనపడదు. అనూరాధ, కూనిరాగాలు తీసుకుంటూ, ఆ గదిలోనే అటూ ఇటూ, తిరగసాగింది. ఏపనీ చేయబుద్ధవటం లేదు. అత్త, అమ్మల ఎదుటపడటానికి ఆ పిల్ల శరీరం అంతా లజ్జ అనే చివురాకులు మొగ్గలు తొడిగింది.

అన్నపూర్ణ, వొంగి సుబ్బమ్మ పాదాలని స్పృశిం చింది.

"వొదినా! తల్లీ తండ్రీ లేనిదాన్ని! నాలాంటి ఎవరూ ఆదుకోని ఈ నిర్భాగ్యురాలి కడుపున పుట్టిన

దైనా, అది అదృష్టవంతురాలు కనుక మీకీ మంచి బుద్ధి ప్రసాదించాడు భగవంతుడు. నా కంతకంటే ఏమి కావాలి? ఇంక నా పిల్లభారం మీదే! దాని బాగోగులు మీవే!" అంది. అన్నపూర్ణ కళ్ళు సజలాలయ్యాయి.

"పిచ్చిదానా! నువ్వు, నీ కూతురూ వొప్పుకుంటా రని, నాకు తెలుసును. కాని తమ్ముడు వొప్పుకోవద్దూ!" అంది సందేహంగా, సుబ్బమ్మ.

"ఆయన ఎందుకు వొప్పుకోరు? రఘు అంటే, మంచి ప్రేమవుంది ఆయనకి!" అంది అన్నపూర్ణ.

"మునుపు వుంటే వుండొచ్చును. ఇప్పుడు వుంటుం దన్న హామీ ఏమిటి? కాలం పెరిగేకొద్ది మనుషులూ, మమతలూ, మారరని నిర్ధారణ లేదుకదా! వాడిచేతకూడా ఔనని పించితే శుభం అనుకోవచ్చును." అంది సుబ్బమ్మ.

"చిత్రంగా అంటున్నారు వొదినా! మీ తమ్ముడు, మీ చేతుల్లో మీరు ఎత్తుకు పెంచిన తమ్ముడు, మీ కొడుక్కి పిల్లనివ్వనంటారా! ఎంతాశ్చర్యం?" సందేహంగా అంది, అన్నపూర్ణ.

"పూర్ణా! నీకు లోకం పోకడ తెలీదు. ప్రతీ వ్యక్తీ కూడా, వచ్చినసంపదకి, దగ్గర లేని అప్పుకి దూరం వుంటారు. కుటుంబం తన కూతురి భవిష్యత్తుగురించి ఏమి నిర్ణయం చేసుకున్నాడో ఎవరికి తెలుసును?" అని, కుటుంబం సుశీలని చేసుకొమ్మని, బాబ్జితోసహా వచ్చి చెప్పిన సంగతి, తమ రఘూ చేసుకోననటం చెప్పింది.

"వాడు నీ పుట్టింటివారికి దూరం కాకుండగా నీకు వుండాలని వుంటే 'రాధి'ని చేసుకుంటాను. లేకపోతే పై సంబధం చేసుకుంటాను– అని ఖచ్చితంగా చెప్పాడు. అంచేత విధిలేక వచ్చాను." అంది సుబ్బమ్మ.

"అల్లా ఎప్పుడూ అనుకోవద్దు మీరు! మీరు అడగవల్సిన బాధ్యత వుండబట్టే వొచ్చారు. మీకు లేనిహక్కు నాకువుంటుందా? భార్యగా ఆయన ఎప్పుడూ నా సలహాలను పాటించలేదు. ఈ విషయంలో పాటిస్తే, నేనూ నా కూతురూ, పునర్జన్మ ఎత్తినట్లు భావిస్తాను." అంది అన్నపూర్ణ.

రాత్రి అందరూ భోజనాలు చేసేరు. కుటుంబం తలనెప్పి వచ్చిందని, శాంతి అరగదీసుకుని ముఖంనిండా పట్టువేసుకుని పడుకున్నాడు. సుబ్బమ్మ, మెల్లిగా గదిలోకి వచ్చింది. అన్నపూర్ణ భర్తకాళ్ళవద్ద కూర్చుని కాళ్ళు పట్టుతోంది. రాధ గోడప్రక్కగా, తండ్రికి కనపడకుండా నించుంది.

"ఏమిటి?" అన్నాడు.

"రఘు మీ రాధిని ఇస్తే చేసుకుంటానన్నాడు. నువ్వుకూడా, అంగీకరిస్తే ఈ మాఘమాసంలోనే జరిపిద్దామని వుంది పెళ్ళి!" అంది సుబ్బమ్మ.

"నేనుకూడా అంటున్నావు? ఎవరు ఎవరు అంగీకరించారేమిటి?" వ్యంగ్యంగా అన్నాడు కుటుంబం.

"హుఁ! ఆ మాత్రం తెలీదా? తల్లికిష్టమయితే తలవరికి కట్టమని శాస్త్రం! తల్లివప్పుకుంది. పెళ్ళికూతురిమనసు

నాకు ముందే తెలుసు? పెళ్ళికొడుకు చేసుకుంటాననని నిశ్చితంగా చెప్పాడు!" అంది సుబ్బమ్మ.

"అయితే ఇంక నేనొక్కణ్ని అడ్డుపడతానా? సంతోషంగా జరుపుకోండి!" అన్నాడు.

అన్నపూర్ణ హృదయం కలుక్కుమంది. అనూరాధ కాళ్ళు వణకసాగాయ్!

"అదేం మాటరా! ఒక్కగా నొక్క తమ్ముడివి. నువ్వూ నేనూ, వియ్యమందాలని నీకు మాత్రం వుండదూ? నాకు ఒక్కనలుసు! నీకూ, ఒక్కపిల్ల. ఇద్దరం కలిస్తే ఎంత ముచ్చటగా వుంటుందో నువ్వే ఆలోచించు!" అంది సుబ్బమ్మ!

కుటుంబం మాట్లాడలేదు. బద్ధకంగా, గోడవెంపు వొత్తిగిలి, పడుకున్నాడు.

"ఏంరా మాట్లాడవూ?" ఆతృతగా అంది సుబ్బమ్మ. "చెప్పావుగా! విన్నాను!" అన్నాడు ముభావంగా. తలనెప్పిగా వుంటం మూలంగా, ఇంకా, ఎక్కువ మాట్లాడిస్తే, చిరాకువస్తుందని సుబ్బమ్మ గదిబయటికి వచ్చింది. బల్లిలా గోడకంటుకుని, నించున్న "రాధి" కనపడింది. మేనత్తని చూడగానే, ఆ పిల్ల ఇవతలకు వొచ్చింది. ఇద్దరూ, వసారాలో వేసివున్న పట్టెమంచం మీద పడుక్కున్నారు. అత్తని, రఘు బావగురించి, ఏమన్నా అడుగుదామని, ఆ పిల్ల మహాం అనుకుంది. కాని ఆమెమాట, ధ్వనిరూపం దాల్చకుండగా, వూహామాత్రంగానే వుండిపోయింది. రాత్రంతా అనూరాధ ఆకాశంలోని

నక్షత్రాలను లెక్కపెడుతూనేవుంది. ప్రక్కలో పడుకున్న ని తనకు వచ్చిన కీర్తనలన్నీ మృదువుగా పాడుతూ, ఏపాట నేర్చుకుందుకు ఎన్నిరోజులు పట్టిందో, ఏ పాట పాడినప్పుడు తన స్నేహితురాళ్ళు తన్ని ఏమని పొగడారో, వివరాలన్నీ చెబూ గలగల్లాడుతూ కబుర్లు చెప్పే అనూరాధ ఆరోజు తనతో ఒక్కమాటన్నా మాట్లాడకుండగా చిన్నపిల్లలా బుద్ధిగావొచ్చి తన పొట్టలోకి ముడుచుకుపోయి పడుకున్న అనూరాధని చూస్తే సుబ్బమ్మకి ఆపేక్ష కలిగింది. ఆమెకి తెలీకుండానే ఆమె చేతులు అనూరాధని గాఢంగా పొదువుకున్నాయి.

తెల్లవారింది ఆ రోజు వైకుంఠ ఏకాదశి! రాధ స్నానం చేసింది. చామంతి మడిలోని నీలం, ఎరుపుచామంతి పూలన్నీ కోసి మాలగా కట్టింది. మేనత్తకూడా స్నానం చేయుటచూసి,

"కోవెలకి వస్తావా అత్తా?" అంది.

"నువ్వు వెళ్ళు! నేను రాను!" అంది సుబ్బమ్మ. ప్రక్కింటి కమలతో రాధ కోవెలకి వెళ్ళింది.

కుటుంబం ఝామ ప్రొద్దెక్కాక లేచాడు. ముఖం కడుగుకొని కాఫీ తీసుకుంటూండగా, సుబ్బమ్మ మళ్ళీ అడిగింది. కుటుంబం వూఁ అనలేదు; ఆఁ అనలేదు.

"మాట్లాడవేమిరా?" రెట్టించింది సుబ్బమ్మ.

"ఏం మాట్లాడను? బాజాభజంత్రీలతో భోజనానికి పిలుస్తే వొద్దని గోడచాటునించి పప్పుముద్ద కొసరేస్తావా, అని అడిగాడట! వెనకటికి ఒకరు! అలావుంది. మేమిద్దరం

మీా ఇంటికివచ్చి అడిగితే మొండిచెయ్యి చూపారు. అయ్యో ఒక్కగానొక్క మేనమామ మిగిలివున్నాడు మనకి అన్న నా పెద్దరికాన్ని నిలిపాడా! నిర్మొగమాటంగా, నిష్కర్షగా చేసుకోనని చెప్పాడు. ఇప్పుడు ఇలావచ్చి నా కూతుర్ని ఇస్తే చేసుకుంటానని చెప్పాడని అంటున్నావు! నవ్వాలో ఏడవాలో తెలియటంలేదు" అన్నాడుకుటుంబం.

"అవునుమరి! సుశీల వాడికి నచ్చలేదుట! పెళ్ళిళ్ళ విషయాల్లో పెద్దరికాలు అంటూ పట్టుకు కూర్చుంటే ఎలాగు? కలకాలం జీవితాలు గడపాల్సినవాళ్ళని మనం పెద్దరికాలనే పట్టుతో మన చేతులార వాళ్ళను జీవితాంతం దుఃఖపూరితం చేయటం పిల్లల సౌఖ్య సంతోషాలు కోరుకునే పెద్దలు చేయవల్సిన విధికాదు. వాడు 'రాధి'ని చేసుకుందుకు మనస్ఫూర్తిగా అంగీకరించాడు. ఆహ్లాదం కనపరిచాడు. అందుకని వొచ్చి అడిగాను" అంది సుబ్బమ్మ.

"అన్న కూతురు పనికిరానిది, తమ్ముడి కూతురు పనికి వొస్తుందా? సుశీలలో లేని అందం 'రాధి'లో కనపడిందా! నువ్వు అడిగావుకదా అన్న సంబరంలో రాధిని నీ కొడుక్కు ఇచ్చి పెళ్ళి చేస్తే ఇన్నాళ్ళుగా నా మంచీ చెడ్డా చూసిన వొదిన ఏమనుకుంటుంది? బాబ్జి ఏమనుకుంటాడు! తన కూతుర్నిచ్చుకుందామనే మన పిల్ల విషయంలో గట్టిగా చెప్పలేదు చిన్నాన్న. లేకపోతే నాలుగు కేకలు వేస్తే రఘూ సుశీని చేసుకోకపోనా? అనుకుంటాడు. నేను నాలుగు మాటలు చెప్పి రఘుని బ్రతిమాలి

బామాలి వొప్పించకపోలేను. కానీ నాకూ ఈ బలవంతపు వివాహాలు చేయకూడదు అనే అనిపించింది. తెల్లవారిలేస్తే వాళ్ళతో మసలవల్సిన వాడిని. వాళ్ళను వొద్దన్న వాళ్ళతో ఎలా సంబంధం కలుపుకుంటాను? నా పరిస్థితి ముందుకు వస్తే గొయ్యి, వెనక్కు మళ్ళితే నుయ్యిలా వుంది" అన్నాడు కుటుంబం.

అన్నపూర్ణ ఆగలేకపోయింది. చేతులారా పండంటి సంబంధాన్ని వొదులుంటుంటే ఆమె మాతృహృదయం విల విలలాడ సాగింది.

"ఎవరో ఏదో అనుకుంటారని మన అమ్మాయి పెళ్లి మానుకుంటారుటండీ! తెల్లవారిలేస్తే వాళ్ళతో మసల వల్సిన వాడినని బెంగపడుతున్నారు. వాళ్ళు వండిపెట్టక పోతే మీకు అన్నమే దొరకదా ఏం! నేను కుంటిదాన్ని, గుడ్డిదాన్ని, ఆ మాత్రం వండిపెట్టటానికన్నా పనికిరాని దాన్నా? అంతగా మొహమాటం అయితే వాళ్ళింటికి వెళ్ళటం మానెయ్యండి. చేతికి వచ్చిన సంబంధం కాదంటే ఇంక ఈ జన్మలో దానికి పెళ్ళి చెయ్యగలమా? అంతగా మీ అన్న కూతురికి పెళ్ళి కాకపోతే మీ వాటా అంతా రాసి యిచ్చెయ్యండి" వుద్వేగంగా అంది అన్నపూర్ణ.

అక్క ఎదురుగా భార్య అలా మాట్లాడుతోంటే సహించలేకపోయాడు కుటుంబం.

"నోర్మూయ్యి! ఆట్టే పేలకు? నాకు ఇష్టంలేదు. నేను చెయ్యను. అంతే. నా మంచిమాట కావాల్సివొస్తే వాడు నా అన్న కూతుర్నే చేసుకోవాలి! అంతేకాని నా

పిల్లని ఇయ్యాను. తండ్రిలేని పిల్ల పెళ్ళికి ముఖం వాచిపోయి వుండగా తగుదునమ్మా అని వాళ్ళింట్లో వుండి కూడా వాళ్ళని కాదన్న ఈ మూర్ఖుడికి నా పిల్లని కట్టబెట్టుతానా! అది అసంభవం" అన్నాడు. అన్నపూర్ణ కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుంది.

"నా మాట వినరా తమ్ముడూ! నువ్వు ఏమీ ఖర్చు పెట్టద్దు. నేనే పిల్లని తీసుకువెళ్ళి పెళ్ళి చేసుకుంటాను. మనసులు కలిసిన మనువుని విడదీయకూడదు. చిన్న పిల్లల్ని వేధపెట్టకు" అంది సుబ్బమ్మ ప్రాధేయతగా.

"వాళ్లు నీతో చెప్పారా. ఒకళ్ళ ముఖం ఒకళ్ళు ఇంతవరకూ చూసుకుని ఎరుగరు. వాళ్ళ మనసులు కలిశాయి అంటున్నావు అసలు ఇతంతా నీ వేషమే. పెద్దోదినకి ముఖం కొట్టినట్లు వుండాలని, వాళ్లు పిల్ల నియ్యావస్తే, కాదని నాదగ్గరకొచ్చేవు. అసలు ఆవిడంటే నీకు మొదటి నుంచీ కోపము పేరుకుంది. అందుచేత వాళ్ళని ఈసడించినట్లు వుండాలని నా సంబంధంకోసం, పెద్ద ప్రేమ వున్నట్లుగా వొచ్చావు! నాకు తెలియదా, ఒక్కచోట పెరిగి, ఆడుకున్న పిల్లని కాదన్నవాడికి ముక్కు మొఖం ఎల్లావుంటుందో చూడన్నా మూడని అమ్మాయిని చేసుకుంటానన్నాడంటే ఎల్లా నమ్మేది?" అన్నాడు కుటుంబం.

"పోని నీ ఇష్టం వొచ్చినట్లు అనుకో, 'రాధ'ని మాత్రం ఇయ్యి. అదేచాల్ను. కావాలంటే పెద్దోదినా వాళ్ళూ అపోనాలు పడకుండా 'సుశీ' పెళ్ళి అయ్యేదాకా

ఆగుతాను. ఇప్పుడు ప్రధానం చేసుకుందాం" అంది సుబ్బమ్మ.

"పోనీ అల్లా చెయ్యండి! మీ వొదినగారివల్ల, మీకు మాట రాకుండగానూ వుంటుంది, మన పిల్లకి సంబంధమూ చెడగొట్టుకోవాల్సిన అవసరమూ వుండదు!" ఆతృతగా అంది అన్నపూర్ణ.

"అబ్బే! అదెలా కుదురుతుంది? 'సుశీల' పెళ్ళి అయిన మర్నాడు, మన 'రాధి'కి చేసేస్తే వాళ్ళు ఆనవాలు కట్టలేరా? మీకేనా తెలివితేటలు వుంట. నేనే రఘూకి సుశీలని చేసుకోకుండా నిరోధించా ననుకుంటారు. అదేం లాభంలేదు. నువ్వు మాతో సంబంధం పొందదల్చుకుంటే సుశీని చేసుకోండి; లేదా మానుకోండి. రాధిని మాత్రం ఇయ్యటం కుదరదు."

"అంతేనా!" గాద్గదికంగా అంది సుబ్బమ్మ.

"అంతే!" అన్నాడు కఠినంగా కుటుంబం.

"ఒక్కసారి ఆలోచించు తమ్ముడూ!" దీనంగా అంది సుబ్బమ్మ.

"ఇంక ఆ విషయం మాట్లాడొద్దు" అక్కడ్నించి లేచి వెళ్ళిపోయాడు కుటుంబం.

"స్నానంచేసి మడికట్టుకోండి వొదినా" అంది అతిథిని ఆదరించాల్సిన గృహిణి బాధ్యతతో అన్నపూర్ణ.

"వొద్దు వెళ్తాను" చేతిసంచీ సర్దుకోసాగింది సుబ్బమ్మ.

"భోజనం చేయకుండా వెళ్తారా" నిరోధించింది అన్నపూర్ణ.

"ఇవ్వాళ ఏకాదశి మాట మర్చిపోయావా ?" ఎదురుప్రశ్న వేసింది సుబ్బమ్మ.

"అయితే ఇవ్వాళ ఏదో ఫలహారము చేసుకోండి. రేపు పొద్దున్నే భోజనంచేసి వెళ్ళొచ్చును. ఇంటి ఆడ పడుచు అభోజనంగా వెళ్తారా ?" అంది అన్నపూర్ణ.

"ఆ మంచి మర్యాద కాలం వెళ్ళిపోయింది పూర్ణా. నేను ఈ యింటికి ఆడపడుచుగా రాలేదు. యాచనకి వచ్చాను. చెయ్యి పూరుకోలేదు, వెళ్ళమన్నారు. వెళ్తున్నాను. కొండంత సంబరాన్ని ఈ మబ్బులు విడగొట్టకలవని నే నేనాడూ నమ్మలేదు. ఈనాడు నమ్ముతున్నాను. తాళి కట్టించుకున్న మర్నాటినించి తన పుట్టింటికి తనే భిక్షుకురాలు అవుతుంది స్త్రీ. ఆప్యాయతగాని, ఆత్మీయతగానీ, లుప్తమైన పుట్టింటి గడపనించి స్త్రీ, నిరుపేదగా, రిక్తహస్తములతోనే సెలవుతీసుకుంటుంది. ఏ అభిజాత్యాని కోసం నేను పిల్లవాడితో అష్టకష్టాలు పడుతూన్నా, నా మానాన్న నేను నిలవరించుకుని, నిలబడ్డానో, ఆ అభిజాత్యంయొక్క మహావృక్షాన్ని నా తోబుట్టువు గండ్రగొడ్డలితో నరికేయగలడని ఒక్కనాడూ వూహించుకోలేదు" దుఃఖంగా అంది సుబ్బమ్మ.

"నావల్ల ఏమీ నేరంలేదు. నామీద ఏమీ కోపం తెచ్చుకోరు కదూ ! నా మనస్సు స్థిమితం వుంటంలేదు

మీరు, ఎల్లాగో రెండు రోజులుంటే, నాకు బాగావుండేది"
అంది అన్నపూర్ణ.

"ఏమీ కోపంలేదు! నువ్వేం చేస్తావు! అంతా విధి చేతులో కీలుబొమ్మలం. కాని ఇంక వుండలేను." ఎంత బ్రతిమిలాడినా వుండనని, సుబ్బమ్మ వెళ్ళిపోయింది. అన్నపూర్ణకి కన్నీళ్ళు ఆగలేదు. ఎలాగో వంట ప్రయత్నం చేస్తోంది.

అనూరాధ కోవెలకి వెళ్ళింది. భగవంతుడికి మన సారా పూలూ, కొబ్బరికాయలూ, పళ్లూ ఇచ్చింది. కళ్లు మూసుకుని;

"భగవంతుడా! నా మనసులోని కోరిక లేమిటో నాకు తెలీదు. నా జీవితం ఎలా నడుస్తే, బాగావుంటుందో, నీవే నిర్ణయించు! నీ నిర్ణయాన్ని నేను హృదయ పూర్వకంగా, స్వీకరిస్తాను." అని ప్రార్థించింది. దారిలో ఆమె మేనత్త, తండ్రి ఒక నిర్ధారణకి వచ్చివుంటారని, ఆలోచించింది. ఎందుకనో, ఆమె మనస్సులో, రఘు భావతో, పెళ్ళి అనే మాట తల్చుకోగానే, ఆరాటం కలుగుతోంది. అది సంతోషమో, సంకోచమో తెలిసే వయసుకాదు అనూరాధది! ఇంటికివచ్చేసరికి తల్లి కన్నీళ్ళతో సంగతంతా చెప్పింది. అనూరాధ ఏమీ అనలేదు. తన్ని ఇవ్వనన్నంత మాత్రాన్న, మేనత్త అంత కఠినంగా అభోజనంగా వెళ్ళిపోవటం ఏమీ నచ్చలేదు అనూరాధకి "వివాహము ఎవరికి ఎవరితో అన్నది, పుట్టినప్పుడే నుదుట వ్రాసిపెట్టాడు బ్రహ్మదేముడు, అది కాదనటానికి మన మెవరముకి" కర్మ

సిద్ధాంతాన్ని నమ్మే అనూరాధ బాధపడలేదు అప్పుడు. అన్నపూర్ణ మటుకు రోజురోజుకీ కృశించిపోయింది. అనూరాధ పెళ్ళిగురించి ఆమె దిగులు పెట్టుకుంది. చిన్నప్పట్నించీ 'రాధ'ని రఘూకిచ్చి చేయాలని ఆమె అనుకుంటూండేది. ఆ ఆశ మొదలంటా నరికివేయబడింది. అనూరాధ ఎంత లాలించినా అన్నపూర్ణ మనసు మళ్ళించలేక పోయేది. కుటుంబంతో అ స్తమానూ తగవుపెట్టుకుని నానా మాటలూ అనేది. దానితో కుటుంబం ఉద్రిక్తుడై నాలుగు దెబ్బలు వేసేవాడు. తల్లి, తండ్రి దెబ్బలాడుకుంటుంటే అనూరాధ కళ్ళప్పగించి చూసేది, రమణ మటుకు తండ్రికి వత్తాసుగా వుండేవాడు.

"ఇంకా బాగాతన్నాలి నాన్నా యీ ఆడాళ్ళని. 'ఎ డాగ్, ఎ వుమన్, ఎ వాల్ నట్ ట్రీ, ది మోర్ యూ, బీట్ దెం, ది బెటర్ దె బీ' అన్నారు. ఎవరో పురాణ పురుషులు." అనేవాడు. రమణ బాగా ఎదిగాడు. బి. ఎ. ప్యాసయ్యాడు. నెలకో వందరూపాయలు తెచ్చుకునేవాడు. కాని ఆ వందకి తోడు తండ్రి దగ్గర ఇంకో వందరూపాయలు పుచ్చుకుని ఖర్చుపెట్టేవాడు. పేకాడటం, సిగరెట్లు త్రాగటం బాగా అలవాటు అయ్యాయి. తల్లి అంటే ప్రేమకాని అభిమానంగాని వుండేదికాదు. తండ్రి ఎప్పుడూ పట్టించుకునే వాడుకాదు. ఆయన పొలమేమిటో గొడవేమిటో తప్ప అయ్యో అనూరాధ పెళ్ళి చేతులారా చెడగొట్టామే, దానికి మంచి సంబంధం వెతికాలని కానీ, రమణ జూదగాడు అయిపోతున్నాడు– వాడ్ని సరిదిద్దాలని కానీ ఆ అజే

వుండేదికాదు. అనూరాధ మెట్రిక్ పాసయ్యింది. కుట్టు పరీక్షలు కూడా ప్యాసయింది. సంగీతం బాగా పాడేది.

కాని, ఆమె చదువు, సంగీతం ఆమెలోనే నిక్షిప్తమై పోయేది వుపయోగించే అవకాశం ఆ పిల్లకి వుండేదికాదు. పోనీ కాలేజీలో జేరుదామా అంటే కుటుంబం అంతగా పట్టించుకునేవాడు కాదు. ఆయన ఎప్పుడూ అన్నగారి కుటుంబం యొక్క సాధక బాధకాలని చూడటంతో సరి పోయేది. రమణకి ఆడపిల్లల చదువు అంటే ఇష్టం వుండేది కాదు. ఆడవాళ్ళు చదువుకుంటే మగవాళ్ళని ఎదిరిస్తారని అంటూ వుండేవాడు. అంచేత ఆ పిల్ల కాలేజీలో జేరటానికి అవకాశం వుండేదికాదు. కాని అనూరాధ వూరుకోలేదు. పరీక్షలకి కట్టకపోయినా ఇరుగు పొరుగు పిల్లలు చదువుకునే పుస్తకాలు తీసుకుని చదివేది. దానితో ఆమెకి జనరల్ నాలెడ్జి బాగా వచ్చింది.

# 19

జీవితం ఎంతో చిత్రమైనది. నలుగురు నోళ్ళల్లోనూ, అవినీతి పరులు అని నానిపోతూండే, వ్యక్తులు, అధాత్తుగా నీతిమంతులయి భార్యా పిల్లల్ని చేరదీస్తారు. నిజాయితీ పరులని పేరుపడ్డవాళ్ళు, ఏదో ఒకానొక అవసరంవల్ల నీతిలేని పని చేయక తప్పక, వీధిన పడ్తారు. చెడిపోయినప్పుడు,

అందునా మనకు కావల్సిన వాళ్లు చెడిపోయినప్పుడు, దానికి కారణాలు వెతుకుతాం. చెడ్డ, అంటే లోకంలో తాగుడు, వ్యభిచారము, జూదము ఇవేకావు. మనకు కావల్సినవ్యక్తి, మనం ప్రేమించి, ఆరాధించే వ్యక్తి మనం నమ్మిన సిద్ధాంతాల కనుగుణంగా నడుచుకోక పోతే, అది చెడు అని నిర్ధారిస్తాం. మంచి జరిగితే, దానికి ఎంతమంది కారకులున్నా, మన ఆత్మ, ఆ మంచేదో మన స్వయం కృషి వల్ల జరిగిందనుకుంటేకాని ఒప్పుకోదు. అభిజాత్యము మహా ఉన్నతమైనది. ఈ ప్రపంచకంలో ఏదిమంచి? ఏదిచెడ్డ! ఏది కష్టం? ఏది సుఖం? ఏది గమ్యం? ఏ దగమ్యం? ఏది నీతి? ఏ దవినీతి? విడదీసి చెప్పలేం! దివారాత్రులవలె, ఒక దానివెంట ఒకటి అంటిపెట్టుకునే నడుస్తున్నయ్! అన్న పూర్ణకి తనకి ఏదైనా, చెడు జరిగితే ఒకరిమీద నెట్టుకు పోయి, నిర్విచారంగా వుంటం చేతకాదు. ఏది జరిగినా స్వయం కృతమే అంటుంది! ఆ తల్లికూతురైనప్పటికీ, అనూరాధ, అన్నిటికీ కారణాలు వెతుకుతుంది. కుటుంబం ఈసారి పల్లెకు వెళ్ళాడు. పొలంలో వుండగానే సిద్ధేశ్వరికి తెలిసింది_ వెంటనే మూటా ముల్లెకట్టి, సుశీలతో సహా, తలుపులు తాళాలువేసి పెద్దకూతురు, సీతగారింటికి వెళ్ళిపోయింది. కుటుంబం ఇంటికి వచ్చేసరికి ఇల్లు తాళం వేసివుంది. ఆయన పద్దు పుస్తకాల బీరువా వీధరుగుమీద పెట్టివుంది.

'ఎప్పుడు వెళ్ళార్రా వొదినగారూ?' పాలేరుని అడిగాడు కుటుంబం.

"ఇప్పుడే వెళ్ళారండి!" అన్నాడు పాలేరు. తను వూళ్లోకి వస్తున్నట్లు తెలిసే వెళ్లారన్నమాట! కుటుంబం ఆశ్చర్యపోయేడు! తను పుట్టిపెరిగిన ఇంటికి తను అతిథి ఈ నాడు! తను చిన్ననాటినించీ ఆడి పాడీ పెరిగిన ఇల్లు, బంధితమై తనకేసి దీనంగా చూస్తోంది! ఆ ఇంటిమీద తన కేమీ హక్కు లేదు. జ్యేష్ఠభాగం క్రింద, అన్నగారికి వెళ్ళింది. తన తన్న వుండగా ఆ ఇంటితలుపులు తనకోసం ఎప్పుడూ తెరిచే వుండేవి! ఈ నాడు, ఆ ద్వారాలుమూసుకున్నాయి. ఎందుకని మూయబడ్డాయో కూడా కుటుంబం హృదయా నికి తెలుసును. తను ఎన్నడూ చేయని, చేయలేని అన్యా యాన్ని తనకి అంటగట్టారని, నిశ్శబ్దంగా బాధపడ్డాడు, కుటుంబం. తన పుట్టిల్లుని కళ్ళారాచూసి, తన గోడ్లు వున్న సావిడి కేసి నడిచాడు కుటుంబం! ఆ సావిడికి తడికలు కట్టి, పేడామన్నూ పెట్టిఅలికించి అందులోవుండి వండుకుతింటూ, వ్యవసాయపు పనుల రోజులు గడిపాడు. నెలరోజుల తర్వాత సిద్ధేశ్వరి వచ్చింది. వచ్చినా, కుటుంబాన్ని భోజనానికి పిలవలేదు, కుటుంబం ఎప్పుడూ తనకు తానుగా ఆమెని పలకరించలేదు!

ఆ మాఘంలో రఘూ పెళ్ళితోపాటు, సుశీలకీ సీతకూతురుకూ, కూడా పెళ్ళిళ్ళు అయ్యాయి. సీతకూతుర్ని శంకరం చేసుకున్నాడు! ఆ పెళ్ళిరోజున, అన్నపూర్ణ తేలిగ్గా నిట్టూర్చింది. సీతకూతురుతో, శంకరం పెళ్ళి మాటలు జరుగుతూన్నన్నాళ్లూ అన్నపూర్ణకి గుండె దడగా వుండేది. ఎక్కడ శంకరం వొద్దంటాడో, ఎక్కడ తన

భర్త తన్ని ఈ మాత్రంగానైనా చూడడో, అని భయపడేది. కాని ఆభయాన్నించి దేముడు, ఆమెని తప్పించాడు! అన్నపూర్ణ భగవంతునికి మనసారా, ప్రణతులర్పించింది. సీతకూతురు అందమైనది. ఆమె శరీరము ఎంత ధవళోన్నతమో, మనస్సుకూడా, అంత ధవళతరమైనది! సరళమైన మృదుస్వభావ! శంకరం యొక్క అనవసరపు ఆర్భాటాన్ని మానంగా, అంగీకరించేది. శంకరానికి చిన్నప్పట్నించీ, తిక్కతనం అలవాటుయింది. అతను స్వాభావికమైన మాతృ ప్రేమనుంచి వంచింప బడ్డాడు, చిన్నప్పుడే! తల్లి కావాలని, అనేమాట, వ్యక్తపరచలేని చిన్నతనంలో తనకు లభించని ఏదో ఒక అనిర్వచనీయ అనుభూతికోసం తిక్కగా దిక్కులు చూస్తూ ఏడిచేవాడు! శంకరం ఏడిచే ఏడుపుకు అన్నపూర్ణకికూడాకళ్ళుసజలాలయ్యేవి! కనకమ్మగారుఅన్నపూర్ణని కోప్పడి శంకరాన్ని ఆడించమనేవారు! తర్వాత పెద్దయినాక, ఏమాటన్నా వ్యతిరేకంగా అంటే నొచ్చుకుంటాడనే భయంతో వూరుకునేది అన్నపూర్ణ! అల్లా తనమాటకి ఎదురనేది, ఎరుగకుండా పెరిగాడు శంకరం! అతని మాటకి ఎదురులేకుండగా నడుచుకుంటోంది సుభాషిణి కూడా!

అన్నపూర్ణకి తను ఇంకా పుట్టింట్లోవుండి పోవటం ఏమీ బాగా లేదు. తన చేతుల్లో పెరిగిన పిల్లవాడు, తన సంసారం తను చేసుకుంటున్నాడు. కష్టమో, సుఖమో, పంచుకుని, అనుభవిస్తారు అమాయకపు పిల్లలు! ఇంక తన విధి, తన ఆడపిల్లగురించి చూడాలి! అనూరాధ తోటకూర కాడలా ఎదిగిపోతోంది, ఆడపిల్లగురించి అన్నపూర్ణకి

దిగులు పెరిగిపోయింది. కుటుంబం ఏసంగతీ పట్టించుకోదు! పొలం పనులున్నప్పుడు అవూరు వెళ్ళటం, ఆపూటలో వండుకు తినటం— లేనప్పుడు, అన్నపూర్ణవద్దకు రావటం తప్ప అయ్యో! చేతులారా, వచ్చిన సంబంధాన్ని పాడు చేశాము! పిల్లదానికి తగిన సంబంధం చూసి పెళ్ళి చేయాలన్న ధోరణి కనిపించేదికాదు. అయ్య అక్కడ! అమ్మ ఇక్కడ! ఇక ఇద్దరికి పొత్తుఎక్కడ?— అన్నట్లు కాలం జరిగిపోతోంది తప్ప కుటుంబానికి మటుకు కాలంయొక్క విలువ తెలిసిరావటంలేదు. 'ధైర్యే సాహసే లక్ష్మీ!' అని ఒకరోజు అన్నపూర్ణకి తెగింపు వచ్చింది. ఏది ఏమయితే అదయిందని తాను పుట్టి పెరిగిన యిన్నాళ్ళకి, తాళికట్టించుకున్న ఇరవయి ఏళ్ళకి తనకుతానే పుట్టిల్లువదలి, పల్లెటూరు వెళ్ళింది అన్నపూర్ణ! అనూరాధకూడా వెళ్ళింది. వెళ్ళటం సరాసరి తన అత్తగారిఇంటికే వెళ్ళింది. అన్నపూర్ణని! సిద్ధేశ్వరి ఆప్యాయంగా ఆహ్వానించింది.

"మేము చెప్పలేదనుకోకమ్మా! ఆయన పెళ్ళయిన మర్నాటినించీ, పోరుతూనే వున్నాము, హాయిగా, భార్యని తెచ్చుకుని, వండించుకు తినమని. వినలేదు. ఇంక విధిలేక నేను, ఈ చాకిరీలు చెయ్యలేక ఆయనకేసి చూడటం మానేశాను. దానితో తిక్కకుదిరి వండుకు తింటున్నారు. కాని ఇన్నాళ్ళకు నిన్ను పిలిపించుకోటం నాకెంతో సంతోషంగా వుంది." అన్నది సిద్ధేశ్వరి.

"మమ్మల్ని ఆయన ఆహ్వానించలేదు. మాకు మేమే వచ్చాము!" అని చెప్పుకోవటం ఇష్టంలేక పోయింది అన్నపూర్ణకి.

«ఎక్కడ వుంటున్నారు!" అంది దీనంగా. అబ్బులు కొడుకు దారిచూపించుతానన్నాడు. అన్నపూర్ణ, అనూరాధ బిక్కుబిక్కు మంటూ, వెనకాతలే వెళ్ళారు. గొడ్లసావిడికి తడికలు కట్టిన ఇంటిలో తొలిసారిగా, అన్నపూర్ణ గృహ ప్రవేశం చేసింది. అన్నపూర్ణ రావటం చూసిన కుటుంబం;

«ఎందుకు వచ్చావు?" అన్నాడు, కోపంగా.

"అది మీరు అడగవల్సిన సరైన ప్రశ్నకాదు నాన్నా! 'ఇన్నాళ్లూ రావటంలో ఎందుకు అలక్ష్యం చేశావు?' అని అడగాలి" అంది అనూరాధ.

"మీ తమ్ముడు గెంటేశాడా, ఇంట్లోంచి!" అన్నపూర్ణ మాట్లాడకపోవటం చూసి అన్నాడు వ్యంగ్యంగా కుటుంబం.

"తండ్రి హయాంలోనే గెంటివేయబడితే, మన సంసారం యీసరికి చక్కగా, మహారాజ నౌకలో, సాగిపోయేది!" అంది అనూరాధ!

"నామటుకు నేను, మీకు రమ్మనమని టెలిగ్రాం ఇచ్చినట్లు గుర్తులేదు!" వెటకారం చేస్తూ అన్నాడు.

«అల్లాంటి అవసరం ఎప్పటికీ రాకుండగా వుండాలనే మా కోరిక" అనూరాధ, కఠినంగా అంది. ఎందుచేతనో కూతురు మాటలకు బదులు చెప్పగల సాహసం లేక పోయింది కుటుంబానికి.

"ఏమిటో ఖర్మ! ఏడవండి !" అని బయటకు వెళ్ళాడు. అన్నపూర్ణ లాంతరు వెలిగించి సంజెదీపం పెట్టింది. ఆ లాంతరు వెలుతురులో వంటచేయటం మొదలు పెట్టింది. ఇన్నాళ్ళ బస్తీ జీవితం తర్వాత, పల్లెటూళ్లో కిరసనాయిల్ దీపంముందు, వంటచేయవల్సి రావటం అన్నపూర్ణకి కిచాటుగావుంది. అయినా తప్పదు! ఎల్లాగో ఆ రాధికి పెళ్లి అయ్యేదాకా ఈ కష్టం నిశ్శబ్దంగా భరించాలి !_అయిపోతే, అసలు చేయగల్గితేనే తనకి నిశ్చింత! అనుకుని పొయ్యి ముందు కూర్చుంది అన్నపూర్ణ.

## 20

కుటుంబం నలభయి ఏళ్ళవాడయినా, ఇంకా పసి తనంగానే, ఆలోచించేవాడు! ఏదన్నా ఒక పనిచేయాలంటే ఇంకొకరు నిర్దేశిస్తేకాని చేయలేని బలహీనత కుటుంబానిది! ఒకళ్ళు చెప్పినట్లు వినటంతో అతనికి ఒక విధమైన మానసిక తృప్తి కలిగేది. ఆ అలవాటు; మనకి అయినవాళ్ళని అదుపులోనికి, పెట్టుకోవాలనే ఆతృత అన్నపూర్ణలో లేక పోవటంచేత కుటుంబం పరాయి వాళ్ళ చేతిలో కీలుబొమ్మ అయినాడు. మనిషిలోని లోపాలని మన కనుగుణంగా మలుచుకోగలిగితే, ఆలోపాలు మన్ని అంతగా బాధించవు!

అనూరాధ పాక ముందు కూర్చుని ఆలోచించింది. స్త్రీ అన్నదానికి, పుట్టినింటికీ, ఎప్పటికయినా ఋణాను బంధం తెగిపోక మానదు. స్త్రీకే కాదు, పురుషుడికికూడా! ఎప్పటికో తెగిపోయే సంబంధాన్ని వూహించుకుని ముందుగానే, తెగేసుకుంటారు. కొందరు; తెగేదాకా తాడు లాగుతూనే వుంటారు మరికొందరు! కొంతమందికి సమిష్టి గావుంటే, వీలుగావుంటుంది- కొంతమంది వంటరిగావుంటే సుఖశాంతులతో తులతూగుతారు. ఒకొక్కళ్ళ తీరు ఒక్కొక్కలా వుంటుంది. సమిష్టిగా వుంటే లాభం అనికానీ వేరుగా వుంటే లాభం అని కాని నిర్వచించలేము. అది వ్యక్తిగత విషయం. దాన్ని సాంఘికం చేయబూనటం; సాహసికమే అవుతుంది. ఒక పనివల్ల ఒక మంచీ ఒకచెడూ కలుగుతుంది. అన్నపూర్ణ పుట్టినింట వుండటం మూలంగా ఒక తల్లిలేని పిల్లాడు, నిష్పూచీగా పెరగటానికి అవకాశం వొచ్చింది. ఈవేరుకాపరమే అప్పుడు పెట్టగలిగితే నిర్భయంగా రఘూకీ రాధకి పెళ్ళిచేయగలిగి వుండును కుటుంబం. దేనికయితే జడిసి కుటుంబం ఏ పుట్టినింటికయితే దూరం కాలేక స్వంత కూతురి మానసికానందాన్ని తన అరికాళ్ళనేసి నిర్దయగా నలిపేసిందో, ఆపుట్టినింటికే, దూరం కావల్సి వొచ్చింది. ఆ బాధ కుటుంబానికీ ఇప్పుడు రాధికీ, మనసులో చీపురు ముల్లులా గుచ్చుకుంటూనే వుంటుంది. అన్నపూర్ణకి మటుకు ఆబేధం ఏమీలేదు!ఎల్లాగో రాధికి పెళ్లి అవటమే కావాలి! ఎవరైనా అల్లునిగా స్వీకరించకలదు! ఎవరైనా అల్లునిగా ఆత్మీయత చూపెట్టకలదు

అన్నపూర్ణ! ఆ తల్లికడుపునపుట్టి, ఆతల్లి పాలని త్రాగి పెరిగిన 'రాధ' అల్లా అనుకోగలదా? రాధకి కుటుంబం, మంచి సంబంధాలే చూస్తున్నాడు. తను చేసిన తప్పుకి, పశ్చాత్తాపంతో కుమిలిపోతున్న కుటుంబం తన సర్వస్వం కట్నంగా ధారపోసి అయినా 'రాధ'ని అందరూ, అద్భుతపడేలా, గొప్పవరుడికి ఇచ్చి పెళ్ళి చేయాలని తాపత్రయ పడుతున్నాడు! అయితే అనూరాధ, రఘుబావ నామం తప్ప మరో పేరుని గణన చేయని అనూరాధ అంతతేలిగ్గా మనసు మార్చుకుని, కాబోయే భర్తలో ఆలీనం కాగలదా! మనసుని మసి చేసుకుని శరీరంతో నవ్వగలదా? ఆ శక్తి, ఆ ఆత్మకాంతి ఆమెలో జీవంతమై వున్నదా? ఏమో! ఎవరి జీవితాలు ఎంతగా మారవలెనని విధాత వ్రాశాడో- ఎవరు చూడొచ్చారు?

—:o:—

# ప్రేమించని మనసులు

"వ్ది వదినేం చేస్తోందీ?"

త్రుళ్ళి పడింది సుభద్ర. ఆశ్చర్యంగా అన్నయ్య వేపు చూసింది. పద్మనాభం తనలో తను నవ్వుకున్నాడు.

"నిన్నే ! మీ వదినగారు ఏమి చేస్తున్నారంటే మాట్లాడవేం?" మళ్ళీ రెట్టించాడు.

సుభద్ర జడకి రిబ్బను ముడేట్టుకోవటం మర్చిపోయింది. జడంతా వదులు కారింది. మళ్ళీ జడని భుజం మీదించి ముందుకు లాగుకుని బిగుతుగా అల్లుకుంటూ,

"నాకు నమ్మకం కలగటంలేదు."

తనలో తనుగా అనుకుంది.

"పోనీ ఇది చెప్పు! అమ్మ ఏం చేస్తోందీ?" ఇంకానవ్వుకుంటూ "బల్లీ" వెలిగించాడు.

"అమ్మ పూజలో ఉందిరా అన్నాయ్! ఎవర్ని పిలవను?" ఇప్పటికి తేరుకుంది సుభద్ర.

"ఇప్పుడు పిలవక్కర్లేదు కానీ, సాయంత్రం షికారుకు రెడీగా ఉండమన్నానని చెప్పు."

అతను సిగరెట్ పూర్తిచేయకుండానే, కారు హారన్ మ్రోగింది. సిగరెట్ "ఆష్ ట్రే"లో పడేసి ఒక చేతికి కోటు తొడుక్కుంటూ బయటికి వెళ్ళిపోయాడు.

సుభద్ర గాలిలో తేలిపోతోంది. ఆమె మనస్సు అన్నయ్యతో బోలెడన్ని కబుర్లు చెప్పుకోవాలని తహతహలాడుతోంది. మళ్ళీ మునపటిలా అన్నయ్య ఉత్సాహంగా ఉండటం ఆ భగినికి ఆనంద ప్రదమయిన విషయం. పెళ్ళయిన రెండు సంవత్సరాలకి, అన్నయ్య వదినని గూర్చి అడగటం, నవ్వుతూ కన్పించటంతో ఆమె మనస్సు పరుగెట్టుతోన్నా, అన్న అనుజ్ఞకోసం శరీరాన్ని నిలబెట్టింది. అన్నయ్య వెళ్ళిపోగానే పరుగు కాని నడకతో తల్లిగదిలోనికి వెళ్ళింది. శారదమ్మ ఇంకా జపంలోనే ఉంది. సుభద్రకి కోపం వచ్చింది. గబగబా 'కిచెన్' లోనికి వెళ్ళింది. నాగమణి కూరలబుట్ట ముందేసుకుని కూర్చుంది. నాగమణిని చూడగానే సుభద్రలోని ఉత్సాహం ఉరకలెత్తి పరుగులెట్ట సాగింది.

"వదినా! నాకేం బహుమాన మిస్తావ్!" అంది.

"నీ కేది కావాలంటే అదే!" అరటి కాయలు చెక్కుతీస్తూ అన్నది నాగమణి.

"ఆమె అడగటం బాగుంది; మీరిస్తా ననటం బాగుంది. కారణం ఏమిటో కనుక్కోకుండానే ఇచ్చేస్తారా బహుమతులూ?" అన్నాడు అయ్యరు.

"సరే! కారణం చెప్తే దాని 'మజా' 'ఉడ్‌జా' అయిపోదూ!"

"చెప్తేకాని ఇవ్వనివ్వను! మణమ్మా! ఇస్తే నేను మీతో మాట్లాడేదిలేదు." అన్నాడు అయ్యరు.

"బహుమానం ఏం కావాలో తెలియందే ఎలా ఇచ్చేది?" అంది నాగమణి.

"సరేకాని ఇవ్వాళ 'సాదం'లోకి ఏం చేస్తున్నారు?"

"అరటికాయ వేపుడు, దోసకాయ పచ్చడి, మోర్ కొళంబు, రసం."

"ఆగండి. ఇవ్వాళ, 'మెనూ' మార్చాలి."

"ఏం కథ?" నాగమణి అడిగింది.

"నీ కథ నాకు తెలుసోయ్! ఇవ్వాళ, కాబేజీ బటాణీలూ కాంబినేషన్‌తో కూర, కొబ్బరి పెరుగు పచ్చడి, సగ్గుబియ్యం వడియాలూ, ములక్కాడసాంబారూ చేయించు. ఇది మదియ అనుజ్ఞ." ఉషారుగా అన్నది సుభద్ర.

నాగమణికి అర్థంకాలేదు. ఇవ్వాళ సుభద్ర పుట్టిన రోజుకాదు. ఆయనకి ఇల్లాంటి పండగలూ, వేడుకలూ లేనే లేవు.

"అయితే ఈ తరిగినవన్నీ ఏం చేయమంటావు?"

"ఆవుకి పెట్టెయ్యి! ఆ మాత్రం తెలీదా పెద్ద ఎం. ఎ. ప్యాసయినావు మళ్ళీ!"

నాగమణి మాట్లాడకుండా "కాబేజీ" కత్తిపీట ముందేసుకుని కూర్చుంది. ఆమె సాధారణంగా అత్తగారి తోనూ, ఆడబిడ్డతోనూ ఎక్కువ మాట్లాడదు. సుభద్ర లాంటి చలాకీ పిల్లకూడా, ఆమెని గంటసేపు ప్రశ్నలతో విసిగిస్తే, సమాధానం కొద్ది మాటలతో రాబట్టుకో గలుగుతుంది. ఇప్పుడు సుభద్ర సంతోషం సముద్రమంతటిదైంది. ఏదో మాట్లాడకుండ ఉంటే, ఆమెలో పొంగుతున్న తరంగాల ఉద్ధృతం ఎల్లా నిర్గతమవుతుంది!

"అయ్యారుజీ! నెలకి నలభయ్ రూపాయలు లాగుతున్నావు కదా? కూరలు ఒకళ్ళు తరిగి పెడితేనే కాని వంట చేయలేవా? నీ జీతంలో సగం వదినకిచ్చేస్తావా మరి?"

అయ్యారు ఆ ఇంట్లో శారదమ్మ కాపరాని కొచ్చిన నాటి నుండి ఉన్నాడు. పద్మనాభాన్నీ, సుభద్రనీ కూడా ఆయన చేతుల్లో ఆడిస్తూ పెంచుకొచ్చాడు. జాబిల్లిని చూపిస్తూ వాళ్ళ చేత పెరుగన్నం తినిపించేడు. అంచేత ఆయనకి సుభద్ర మాటలకి కోపం రాదు.

"ఏం చేసేదమ్మాయ్! పెద్దవాణ్ణయిపోతిని గదా ? ఏదో ఇంటి కోడలు కనుక సాయం ఏస్తుంది. అడే ఇంటల్లుడు సాయితా వస్తాడా? మీ అమ్మాయి తే అసలు వంటింటి ముఖమే చూసేది కాదు. నాగమణి సామ్యతగల పిల్లని కనుక నాకు సాయితా వస్తూంది. ఇల్లాంటివాడే నీ భర్త అయితే నా కింక దిగులుండదు. ఇద్దరూ చెరోపని చేసుకపోతారు." నవ్వుతూ అన్నాడు అయ్యారు.

"ఓయబ్బ! ఎంత దురాశ పంతులికి! నీకు కూరలు తరిగే వాణ్ణి, పచ్చళ్ళు రుబ్బిపెట్టేవాణ్ణి నేను పెళ్ళాడాలా!"

ఆ ఉత్సాహంలో ఆమె ఇంకో మాట జారింది.

"ఈవిడ కనుక, నీ మీద జాలితలుస్తున్నది కాని, అదే సంధ్యేనా, లలితేనా, అయితే తెల్లిసొచ్చేది అయ్యారుజీ పాక శాస్త్ర ప్రవీణత ఎంతవరకో,"

నాగమణి తలవంచుకుంది. కారణం ఆమెకళ్ళునిండుకుంటున్నాయ్. ఆమె చేతులు తొందరగా కాబేజినితరుక్కుపోతున్నాయ్. తన వాళ్ళందరూ తనను; "అవాంఛితంగా వరించిన అదృష్ట దేవత, పద్మనాభం," అని అనుకుంటున్నారు. కాని ఆ దేవత ప్రసన్న దృష్టే తనకు కరువని తనకీ ఈ ఇంటిలోని జనానికీ తప్ప ఇంకెవరికీ తెలీదు. ఇందరి రాజకుమార్తెల కలల్లోని రాజకుమారుడు, తనకి నిక్షిప్తధనంలా లభ్యమవటం, తన అదృష్టమో, దురదృష్టమో తెలుసుకోవాలన్న తహతహలో ఆమె రోజులన్నీ నిరోత్సాహంతో గడుపుతోంది.

"ఎవగ్నేనా లొంగతీద్దుకులేనూ్మ! ఈ ముసలాడు కష్టడపడుతూంటే చూసి పూరుకోగల్గేంత కఠినత్వం, మీ ఆడపిల్లలకి రాదులే తల్లీ!"

"నేను లేనూ?"

"నువ్వయినా, వదినమ్మ సర్దుకు పోతున్నది కదాఅని ఊరుకున్నావు కాని, లేకపోతే, ఎడంచేయికన్నీ సాయితా రాకుండా ఉండకలవా?"

'నేను గెలిచే వెళ్తున్నాను. బావా ! ఓడిపోయి నది నువ్వే ! ఆడది ఆటవస్తువు అనుకున్నావ్ ! కాదని నిరూపించేను. నా వ్యక్తిత్వం ఋజువు పరుచుకున్నాను. ఇంక నీ వ్యక్తిత్వం నువ్వు నిరూపించుకో !'

సంవత్సరంపాటు సెలవు పెట్టి దేశం అంతా తిరిగాను. అమ్మకి మనశ్శాంతి ఉండదు అని నాకు తెలుసును. ఆమె ముఖం చూడలేకే నేను దేశాలు తిరిగాను. సరే! తర్వాత అమ్మ నా పెళ్ళికోసం చేసిన ప్రయత్నంలో నువ్వు దొరి కావు. ఆ సంగతంతా నీకే తెలుసుకదా ? అమ్మకోసమే, నాలో పెళ్లాడాలనే వాంఛ చచ్చిపోయినా, పెళ్ళికి ఒప్పు కున్నాను. నీతో నా బలహీనతంతా వెల్లడిచేసుకోవాలనే కోర్కె ఈ సంవత్సరం నించీ నాలో మెదులుతూనే ఉంది. ఎప్పుడూ నా కళ్ళబడే దానివికాదు. సాధారణంగా ప్రతి స్త్రీ, తన పురుషుణ్ణి ఆకర్షించుకోటానికి, విశ్వ ప్రయ త్నాలూ చేస్తుంది. అందులో, విముఖంగా ఉన్న భర్తపట్ల భార్యకి, ఎక్కువ శ్రద్ధాసక్తులు కలుగుతూంటాయి. అలాం టిది, నీవు ఒంటిగా కంటికి కనబడకుండా, ఏం చేస్తుండే దానివా ? అనే ఆలోచన కలిగేది. ఒకే ఇంటిలో ఉంటూ ఒకర్నొకరు చూచుకోకుండా, కాలం గడపగల్తే మంచే, నా ఆసక్తికి కన్నా, నీ నిరాసక్తతకే, ఎక్కువ ప్రాధాన్య మివ్వాల్సి ఉంటుంది. నీలో అంత నిరాసక్తత ఎందుకు ప్రబలిందో ! దానికి మూలకారణం, ఏమిటో నాకు తెలుసు కోవాలనిపించింది కూడా. అందుకనే ఇవ్వాళ ఇలా...''

పద్మనాభం నాగమణివేపు చూశాడు. ఆమె చెంపలమీద స్వచ్ఛ స్ఫటికాలు జారుతున్నాయి. చటుక్కున లేచి, దగ్గరగా వెళ్ళి భుజంమీద చేయివేసి "ఎందుకూ ?" అన్నాడు.

"ఏంలేదు." చెంగుతో కళ్ళు అద్దుకుంది. తెల్లవారబోతున్నది. మైకులో సుప్రభాతం వినబడ్తోంది. ఒక్కొక్క కాటేజీలోనూ, దీపాలు ఆరిపోతున్నాయి. పాపాలు, పారిపోతున్నాయి. ఆ ప్రశాంత సమయంలో కాటేజీ వరండాలో నించుని, ప్రత్యూష పవనాలకి పులకరించిపోతూ, ఆనంద నిలయ విమానాన్ని చూస్తూ, సుప్రభాతం వినగలగడం, జీవితవరంగా భావించొచ్చును. నాగమణిలేచి లైట్ తీసేసి వరండాలోకివచ్చి నిలబడింది. పద్మనాభం కూడా వెనకాతల వచ్చి నించున్నాడు. "పాలమ్మా పాలు" అంటూ గొల్లవాళ్ళు ఆవుల్ని దూడల్ని తోలుకొని వస్తూ అరుస్తున్నారు. కావల్సినవాళ్ళు పిలిపించుకుంటున్నారు.

"నిద్ర తేలిపోయింది నాకు. నీకు నిద్రవస్తోంటే కారులో పడుకో !" అన్నాడు పద్మనాభం.

"నాకూ నిద్రరావటం లేదు. అసలు రాత్రిళ్ళు నిద్రపోయే అలవాటు నాకు తప్పిపోయి చాలాకాలమయింది." అన్నది నాగమణి. పద్మనాభం బాధగా నిట్టూర్చాడు.

"డ్రైవరు బట్టలు తెచ్చేలోగా నాగురించి చెప్తాను. వింటారా ?" అన్నది.

"అంతకంటేనా ?" కూర్చున్నాడు. నాగమణికూడా

కొంచెం ఎడంగా మెట్లమీదకు కాళ్ళు జార్చుకుని కూర్చున్నది. చల్లని చిరుగాలికి నాగమణి శరీరం గజగజ వణికింది. రెండుతుమ్ములు తుమ్మింది. గొంతు భారంగా ఉన్నది.

"మన మొదటిరాత్రి జ్ఞాపకం ఉన్నదా మీకు ?" అన్నది.

"లేకేం ? అసలు ఈ కథంతా ఆనాడే నీతో చెప్పేయాల్సింది. నాకు మనోనిబ్బరం లేకపోయింది. నీ ముందు నేను మహాపరాధం చేసినవాడిలా అయిపోయాను. నిర్మలంగా, స్నిగ్ధ సుకుమారంగా కనపడే నీలేత మోములో ఆ మలిన కథంతా వెళ్ళదపరిచి, విషాద నీడలు పరవటానికి నా మనసొప్పలేదు"

ఆరోజు ముత్తయిదువలు నాగమణిని తీసుకవచ్చి గదిలో విడిచి పెట్టగానే, అయిదు నిముషాలు నాగమణి వెంపు చూస్తూ నిలబడ్డాడు. నాగమణి తల కొద్దిగా వంచి తలుపు కానుకుని నించున్నది. ఏదో మాట్లాడబోయి ప్రక్కతలుపు తీసుకుని మేడమెట్లుదిగి తోటలోకి వెళ్ళిపోయాడు. నాగమణి ముందు ఆశ్చర్య పోయింది. తర్వాత గుమ్మందాకా వెళ్ళి వెన్నెల్లో కలిసిపోతున్న అతని ఉన్నతమైన ఆకారాన్ని చూస్తోనించుంది. చెట్లనీడల్లో, అతని నీడకూడా కలిసిపోయేక తలుపు వేసుకుని లోపలికివచ్చి పడుకుంది. ఆ రోజునించీ ఆమె ఆ గదిలో ఒంటిగా పడుకుని గంటల

గంటలకాలం, నిర్లిప్తంగా కేవలం ఆలోచనాకాక, ఆవేదనా గాక ఒకవిధమైన, అంతర్ దృష్టితో పరిశీలనగా, గడిపేది.

"ఆరోజు నీవు మౌనంగా, ఎంత దుఃఖాన్ని, హృదయగతం చేసుకున్నావో ఈరోజు తెలుసుకుంటే, ఎంతో సిగ్గువేస్తోంది మణీ" అన్నాడు పద్మనాభం.

"అంత బాధ అనవసరం. నేను చెప్పబోయే నాజీవితం వింటే, ఈ వ్యక్తిని గురించి నేనెందుకు శ్రద్ధ తీసుకోవాలీ, అన్న పట్టుదల మీలో కలిగి తీరుతుంది" అన్నది. ఆమె కంఠధ్వనిలో కొంచెం హాసభావం తొణికిసలాడింది. పద్మనాభం చకితుడైనాడు.

"అదేం ?"

ఆ ప్రశ్నకి జవాబు రాకమునుపే, దిగువ తిరుపతి నుంచి కారు- డ్రైవరూ వచ్చాడు ఎదుటి కొండలమీంచి చింపిరి మొక్కల చివర్లలో ఉషా కన్య లేత నవ్వు సుకుమారంగా కదుల్తోంది.

"స్నానాని కెళ్దామా ?" అన్నది.

పద్మనాభం నాగమణి వేపు శూన్య దృష్టితో చూశాడు.

"పదండి ?" అన్నది మళ్ళీ.

"నాకు చలివేస్తోంది. వేణ్ణీళ్ళు తెప్పిస్తాను స్నానం చేద్దాం" అన్నాడు.

"నేను పుష్కరిణిలో చేస్తాను. మీరిక్కడకు వేణ్ణీళ్ళు తెప్పించుకుని చేయండి" అన్నది.

భద్ర పంపించిన బట్టల బ్యాగ్ తీసి బొటన వ్రేలంత జరీ అంచు ఉన్న తెల్లని సిల్కుపంచె, ఖండువా, పద్మనాభా నికిచ్చింది. పద్మనాభం, టవల్ తీసుకుని బాత్‌రూం లోనికి వెళ్ళిపోగానే, నాగమణి, పుష్కరిణికి వెళ్ళి స్నానం చేసి వచ్చింది. దోసెడు వెడల్పు జరీఅంచు నీలం పట్టుచీర, ఎర్రని జరీగళ్ళ పట్టురవికె తో దుక్కని వరండాలోని లేత ఉదయ కాంతిలో పొడుగాటి జుట్టుని, సన్నని వ్రేళ్ళతో చిక్కు తీసుకుంటూ నించున్న, భార్య ఆకృతి, పద్మనాభం హృదయంలో గాఢంగా ముద్రవేసికొంది. పవిత్రస్థలాల్లో పవిత్ర భావాలే కలుగుతాయ్. స్వామి దర్శనం చేసుకోగానే పద్మనాభం, గుండెల్లో గూడుకట్టుకున్న బరువంతా, దూది పింజల్లే ఎగిరిపోయింది. సౌమనస్విని అయిన భార్య, తన సుఖదుఃఖాలే ఆమె సుఖదుఃఖాలుగా ఎంచుకునే తల్లీ, అన్న ఇల్లు పది ఇళ్ళు మొదలవ్వాలని, మనసారా కాంక్షించే భగినీ తన కేంలోటు? తనలో తనే, తీరని వ్యధతో రోజుల్ని వృథా పుచ్చాడు !-అన్న ఆలోచనతో అతని హృదయం పరిప్లావితమై, ఆనంద తరంగితమైనది. నాగమణి వేపు ఆర్ద్ర నయనాలతో చూస్తూ ముగ్ధుడైపోయాడు! ప్రదక్షిణం చేసి వస్తూండగా, ఒకచోట ఎవరో కూర్చుని పాడుతున్నారు, అన్నమాచార్యుని కీర్తన "ఆకటివేళల, అలపైన వేళల, వేకువ హరినామమే దిక్కు మరిలేదు !"

ఇంటికి వచ్చేసరికి ప్రఫుల్ల వదనాలతో తల్లీ చెల్లెలూ గుమ్మంలో స్వాగతమిచ్చారు. ఆ రోజున, నాగమణి ఇంటి నిండా సంతోషంతో ఆహ్లాదకరంగా తిరుగుతుందనుకున్న

సుభద్ర, నాగమణి మామూలు పూనంతో నే ఇంటిపనుల్లో నిమగ్న మయిపోవటం చూసి, కొద్దిగా చలించింది. అయినా, ఆమెతో ఎల్లా మాట్లాడితే, విషయం, సులభ గ్రాహ్య మవుతుందో అంతుపట్టలేదు సుభద్రకి. తల్లితో సంప్రతిద్దామా అంటే, తనకి చిన్నతనంగా వుంటుంది. ఎంత తల్లి అయితేమట్టుకు, వదిన సాంసారిక సౌఖ్యముగూర్చి చిన్న పిల్ల తను ప్రస్తావించటం బాగుంటుందా? తనలో తనే రోజల్లా మల్లాగుల్లాలు పడింది సుభద్ర. రాత్రి భోజనా లయినాక, అన్నయ్య పేపరు చదువుకుంటూ, హఠాత్తుగా లేచి, మేడమీదకు వెళ్ళటం, తన గది కిటికీలోంచి చూసి, "అమ్మయ్య !" అనుకుంది. ఎంతయినా, నూతన ప్రియ సమాగంవల్ల లజ్జ పుట్టుకవస్తుంది కాబోల్ను. ఇంటికి కోడ లుగా రావటం అయితే, రెండు సంవత్సరాలయింది కాని; భర్త అనబడుతూన్న వ్యక్తి, పలకరింపుల చిలకరింపులు, ఆ "యౌవని"కి క్రొత్తేకదా? అందుకనే, జయదేవకవి, "ప్రథమ సమాగమ లజ్జితయా, పటు చాటుశతైరనూకులం !" అన్నాడు ! భద్రి ఆలోచిస్తూనే నిద్రపోయింది.

తలుపులు జేరవేసుకుని మంచంమీద బోర్లగిల పడు కుని, ఆకాశంలోని కృష్ణపంచమి చందుర్ణ్ని చూస్తూన్న నాగమణి, పద్మనాభం తలుపు త్రోసుకుని వచ్చిన సవ్వడికి లేచి, మంచందిగి నించుంది. పద్మనాభం చిరునవ్వు నవ్వుతూ, తలుపులు లాగి గడియపెట్టాడు. సోఫాలో కూర్చున్నాడు.

"మంచినీళ్ళు కావాలా ?" అన్నది నాగమణి.

"వద్దు ! మీ ఆడవాళ్ళు మగాళ్ళ దాహాల్ని ఇట్టే గుర్తిస్తారనుకుంటాను !" పరిహాసంగా అన్నాడు పద్మనాభం.

పేలవంగా నవ్వింది నాగమణి.

"నా గురించి మీరు వినొద్దా !" ఆమె గుండెల్లోని, ఏదో నిష్కారణ భయం జరజరా వెన్నులో ప్రాకింది.

"చెప్పు మరి !"

"విని కూడా నన్ను భరించకలరా ?"

"నేను భరించలేని విషయం ఈ పృథివిమీద లేదు మణీ !"

ఆందోళనగా అన్నాడు. మణికి బాధ కలిగింది. తన వల్ల జరిగిన ప్రతి చిన్న విషయాన్నీ, అతను దాచక తనతో చెప్పుకున్నాడు. అంత మంచి మనస్సుని తనిప్పుడు, వంచించపోతోంది. దీనివల్ల లాభనష్టాల మాటెల్లా ఉన్నా, తన గుండెలకి రంపపుకోత మాత్రం అవక తప్పదు.

"ఇన్నాళ్ళ నా నిరీక్షణలో, మీ నుంచి లభించిన ఆప్యాయతని, పోగొట్టుకోలేను." తనలో తనుగా అనుకున్న మాట పద్మనాభం విన్నాడు.

"నీ నుంచి ఎల్లాంటి కష్టవార్తలైనా వినటానికి సిద్ధంగా ఉన్నాను మణీ ! ఈతకన్న లోతులేదు - గోచీ కన్న దరిద్రంలేదుట !"

"ఇదుగో! అప్పుడే కష్టంగా మాట్లాడుతున్నారు."

"లేదు మణీ! నాకేం కష్టం లేదు. నిస్సంకోచంగా నీ అనుభవాలని నాతో చెప్పు." ప్రార్థనగా అన్నాడు.

గదిలో వెలుగుతూన్న 60 వాట్సు బల్బువంక శూన్యంగా చూస్తూ మొదలెట్టింది నాగమణి.

"అమ్మా, నాన్నా నా చిన్నప్పుడే పోయారు. అంత పెద్ద మేడలో నేనూ, అన్నయ్యా, వంటమనిషీ ఉండే వాళ్ళం. అన్నయ్యకి నేనంటే చాలా ఆపేక్ష. వంటమనిషి, పేరుకి వంటమనిషే కానీ, ఇంట్లో బంధువులానే మమ్మల్ని ఆదరించేది. అంత పెద్ద ఇంట్లో మేము వంటిగా ఉండలేక, మా దూరపు బంధువుల్ని వచ్చి మాతోపాటు ఉండమన్నాం. ఆయనపేరు రాజమాణిక్యంగారు. వరసకి మామయ్య అవుతారు. ఏదో ఆఫీసులో క్లర్కుగా పనిచేసి రిటైరయ్యారు. ఆయన కూతురు కనకాంగి. ఆయనకి భార్య పోయింది. వేలువిడిచిన చెల్లెలు సన్నమ్మ వంటా వార్పూ చూసేది. కనకాంగి నాకంటే వయస్సులో పెద్దదైనా నా ఆటపాటలకి చేదోడు వాదోడుగానే ఉండేది."

"కనకాంగి అంటే, మీ వదినేకదూ!" అన్నాడు పద్మనాభం.

"అవును. వదినే! చెప్తున్నాను వినండి. కనకాంగికి తల్లిలేదు. ఒకవేళ ఉన్నా, మా కులంకాదు. రాజమాణిక్యం గారు చిన్నప్పుడు ఇంట్లోంచి వెళ్ళిపోయాడుట! సంజన్ గూడులో వేలుమణి మొదలియారు కూతుర్ని లేవదీసుకు

పోయి శ్రీరంగపట్టణంలో పెళ్ళి చేసుకున్నాడుట. కన కాంగి తల్లి యానగా మాట్లాడేదిట. భార్య చనిపోయాక స్వంత వూరు వెంకోడువచ్చి కాపురం ఉండేవాడుట. ఆయ నతో మాకుగల బంధుత్వం సన్నమ్మద్వారానే తెలిసింది రాజమాణిక్యం దృఢంగా ఉండేవాడు. మా ఇంటి ఆవర ణంతా రకరకాల పూల మొక్కలతో నింపేడు. మామ య్యంటే నాకు చాలా ఆపేక్ష. కనకాంగి కూడా నేనంటే చాలా అభిమానం ప్రదర్శించేది. ఎక్కడి కెళ్ళినా ఇద్ద రమూ కలిసి వెళ్ళేవాళ్ళం. కనకాంగి చాలా బాగుంటుంది. పెద్దదైన కొద్దీ, ఆమెలో ఆకర్షణ మరీ ఎక్కువైంది. కోలముఖం, అందులో ఇమడని పెద్ద కళ్ళు, ఎత్తుగా నించున్న ముక్కు, కాస్త వెడల్పైన పెదాలూ, నవ్వితే నల్లకలువ రేకులా బరువుగా వాలే కనురెప్పలూ, క్రింది పెదవి క్రిందుగా గడ్డంమీదకు కనగబడ్డంత పచ్చబొట్టూ, ఎదుటి మనస్సుని అట్టే నిలబెట్టి, తమచుట్టూ, ప్రదక్షిణం చేయించుకునేవి. అన్నయ్య ఆ సంవత్సరం యం. యస్. సి. ప్యాసయ్యాడు. నేను, యం. ఏ. కి కట్టాను. కనకాంగి బి. ఏ. దాటలేక పోతోంది. సన్నమ్మ కనకాంగికి పెళ్ళి ప్రయత్నాలు చేయమని మామయ్యతో రోజూ పోరుతుం డేది. మామయ్యకి, తనతోటపనేమిటో అంతే! వేళకింత సాపాటు చేయటం, నెళ్ళి తోటలోని పూలమొక్కలతో కాలక్షేపం చేయటం.

ఒకొక్కరోజు; "అరే మణీ, ఈ గులాబీ లేత రంగులోకి దిగిపోయిందే? ఎర్రగని గులాబీయే!" అనేవాడు.

ఇంకో రోజు:

"అరే! ఈ చామంతి గడ్డి పువ్వులు విడుస్తోందే మణీ! మొగ్గల్ని తప్పించటం మర్చిపోయాను" అని ఆందోళన చెందేవాడు.

నన్నమ్మ ఊరికే విసుక్కునేది. మాతో మాట్లాడే టప్పుడుకూడా ఈ ఏడు పారిజాతాలు తక్కువ పూశాయనో, చన్నంగి కొబ్బరి గెలవేసిందనో, కొత్తపల్లి మామిడిపూత, నిలవలేదనోతప్పితే, మరే విషయాలూఆయన సంభాషణలో దొర్లేవికావు. మా వంటమనిషి సీతమ్మ, నన్నమ్మ కూడా, కనకాంగి పెళ్ళిగురించి బెంగ పెట్టుకున్నారు. క్రమక్రమంగా, వాళ్ళ దృష్టి మా అన్నయ్య మీద పడిందనుకుంటాను. ఒకరోజు ప్రస్తావనగా, అన్నయ్య ముందు ఈ విషయం బయటపెట్టారు. అన్నయ్యకి కూడా, కనకాంగి అంటే ముందు నించీ ఇష్టమేమో మరి. వెంటనే అంగీకరించాడు. వైభవంగా బంధువులంతా ముందుకువచ్చి, వాళ్ళ వివాహం జరిపించారు. నాకు అప్పటిదాకా, కనకాంగికి పెళ్ళయితే అత్తవారింటికి పోతుందేమో, నే నొంటిగా ఉండిపోవాల్సి వస్తుందేమో అన్న దిగులు వేసేది. ఆమె మా ఇంటి మహాలక్ష్మిగా స్థిరపడటంతో నాకెంతో ఆనందం కలిగింది. కనకాంగి చాలా అందమైనది. నాకింక, ఏ చీరలు చూసినా, ఏ నగలు చూసినా, ఏ పూవులు చూసినా మా వదినవంటిమీద అలంకరించనిదే నిద్రపట్టేదికాదు. కనకాంగిమీద నాకు ఒకవిధమైన ఆరాధనాభావం కలిగింది. నా

అభిమానమూ, ఆరాధనా, కనకాంగి లోకువగా తీసుకుంది. తను కులంలేని పిల్ల! భగవంతుడిచ్చిన సౌందర్య మాధారంగా ఉన్నత వంశీయుల ఇంటికోడలైంది. నేను తనపట్ల చూపే అనురాగాన్ని ఆమె, మా అన్న ఇవ్వవలసిన ఆస్తి కోసం నేను చూపే మిరమెచ్చులని భ్రమించింది. కొత్తలో మా అన్నయ్య ఆట్టే పస్తాయించేవాడు కాదు. కాని రాను రానూ,ఇంట్లో నే నేపనిచేసినా విపరీతార్థాలు తీసి మాట్లాడేవాడు. పెళ్ళయ్యేదాకా, నేను, కేంద్రంగా వున్నదాన్నల్లా పెళ్ళయిన తర్వాత, మారిపోయాను కాబోల్ను. ధనం వుంటే సుఖం ఉంటుందనుకుంటారు చాలమంది. కాని ధనం కన్న ఆప్యాయత వల్లే ప్రాణికోటి సుఖపడుతుందనే సంగతి ఎందుకు విస్మృతమవుతున్నదో నాకు తెలియదు. స్నేహంగా నా చుట్టూ తిరిగిన కనకాంగి వదినగా నాపట్ల కాస్తయినా కనికరం చూపెట్ట లేకపోయింది. రాజమాణిక్యం తోట మాలిగా ఎంతో తృప్తితో ఉన్నవాడల్లా అన్నయ్య మామగారిగా పరివర్తనం చెందేటప్పటికి ఎక్కడలేని హోదా వచ్చి పడింది. క్లబ్బు కెళ్ళటం, పేకాడటం మొదలెట్టాడు. అన్నయ్య ఆయన ధాటికి తట్టుకో లేక ఇంట్లో ఉన్న మా అమ్మనగలు అమ్మటం మొదలెట్టాడు. వంటమనిషి సీతమ్మ వూరుకో లేదు.

"అబ్బాయ్! తల్లిసొత్తు నీవు అమ్మటం మంచిపని కాదు. అది కూతురుకు చెందుతుంది. మణి కియ్యాల్సిన నగలు నీవు అమ్ముకోవటం తప్పుకాదా? న్యాయంగా ఆమె

సగం ఆమె కిచ్చేసి మిగిలినది నువ్వేమయినా చేసుకో !"
అన్నది

అన్నయ్యకి కోపం వచ్చింది.

"నీకు తెలవదు, సీతం పిన్నీ ! ఇదంతా మా నాన్న స్వార్జితం. దానికేం హక్కు లేదు. మా నాన్న జబ్బులో నేను ఆయనకు బోలెడంత సేవచేశాను." అన్నాడు.

"పిత్రార్జితమైనా సరే ! ఈ రోజుల్లో ఆడపిల్లలకి వాటాలున్నాయ్ కదూ ! ఏమైనాసరే ! నువ్వు సగం నాగమణి పేర, రిజిష్టర్ చేయిస్తేకాని ఇంట్లో ఆస్తి ఖర్చు పెట్టటానికి కుదరదు" సీతం పిన్ని పట్టుబట్టింది. కనకాంగికి కోపం వచ్చింది.

"ఆయన ధనం ఆయనిష్టం వచ్చినట్లు చేసుకుంటారు. మధ్య నీకెందుకు? కుటుంబ వ్యవహారాలు మాట్లాడటానికి నీకేం అధికారం ఉంది ?" అని నిలదీసింది. సీతం పిన్ని మనస్సు గాయపడింది. మా ఇంట్లో అయ్యర్‌లాగే, మా ఇంట్లో, సీతం పిన్ని చిన్నప్పట్నించి ఉండేది. అమ్మ ప్రతి పనీ, ఆమెని సలహా చేయందే చేసేదికాదు. నానించి పిన్ని మాటలు పడటం నాకు కష్టమేసింది.

"వదినా ! హద్దులు మీరుతున్నారు ! ఆమె అన్యాయం జరుగుతూంటే చూసి వూరుకోలేక ఏదో అన్నారు. నువ్వలా ఆమెని తీసిపారెయ్యటం బాగాలేదు" కోపంగానే అన్నాను.

"దానిమీద విరుచుకు పడతారెందుకు? కూటికున్న మనిషి కులమంతా చెరపబూనటం ఏం బాగుందేం?" అన్నాడు అన్నయ్య. సీతంపిన్ని కళ్లు నింపుకున్నాయి. ముప్ఫయి ఏళ్ళ పనితనంలో ఆమె ఏనాడూ మాట అని పించుకునేట్లు చేయలేదు.

"అవునన్నయ్యా! కూటికి వచ్చి, ఆలై వెలసి పాలి మ్మని కూర్చున్నది. సీతంపిన్నే! నువ్వు ఇలా అనగలుగుతా వనుకోలేదు. నా భవిష్యత్తుకోసం, సీతంపిన్నిగారు కంగారు పడిందన్న మాటేకాని, లేకపోతే ఆమెకేం కావాలి?"

అన్నయ్య ఎగ్రబడ్డారు.

"వెధవ సూటిపోటి మాటలు మానెయ్యి. నా తండ్రి ఆస్తి నా యిష్టం. మీరెవ్వరు అడ్డగించటానికి? ఇష్టంవుంటే వుండి గుప్పెడు బియ్యం నమలండి, లేకపోతే పొండి! ఇంట్లో వుండి నా మనస్సు మంట పెట్టకండి!"

గట్టిగా కేకలేశాడు అన్నయ్య! కాలేజినించి రాగానే 'గాన్లే' సుకునే నన్ను ఎగరేసి హృదయానికి హత్తుకుని ముద్దాడే అన్నయ్య! సైకిలెక్కించుకుని, సముద్రపు ఒడ్డున అర్ధరాత్రిదాకా త్రిప్పే అన్నయ్య! నాకు జ్వరమొస్తే నిద్రా హారాలు మాని, నా మంచంమీద కూర్చుని కాపలాకాసే అన్నయ్య! ఏకోదరులని విడదీయగల మంత్రశక్తి ప్రేయసి వెడదకన్నుల్లో ఉంటుంది కాబోల్ను! మర్నాడు సీతంపిన్ని మూటాముల్లె సర్దుకుంది. ముప్ఫయ్ యేళ్ళుగా, నల్లి దూర కుండా, కంట్లో కనుపాపల్లే కాచుకు కూర్చున్న యింటినీ,

నా వంటేసి, అన్నయ్యకి అప్పచెప్పి, తనకు నచ్చిన ఊరు వెళ్ళిపోవటానికి సిద్ధమైంది.

"నా కోసమైనా ఉండవా సీతంపిన్నీ!" అన్నాను.

స్థానం లేదని తెలిశాక ఉండకూడదమ్మా! మీ ఇంట్లో మంచే అనుభవించానో చెడే అనుభవించానో, అయిపోయింది. భగవంతుని కృపవల్ల నీవు చల్లగా ఒకింటి కోడలై పేరు తెచ్చుకోవాలి. అదే నా వాంఛ తల్లీ!" చీర కొనుక్కోమని యాభయ్ రూపాయలు ఇచ్చేను. మళ్ళీ నా చేతికిస్తూ "ఇదే నేను నీకివ్వగలిగే పెళ్ళికానుక! నువ్వే మంచి బట్టలు కొనుక్కో," అన్నది. నాకా యిల్లంతా శూన్యంగా కన్పించింది. నేను వంటరినై పోయాను. నా బాగు ఎవరు చూస్తారు? ఎవరున్నారు? రానురానూ, వదిన నాతో మాట్లాడటంమానేసింది. అస్తమానమూ, సన్నమ్మా తనూ ఏదో గుసగుసలాడుకునేవారు. అన్నయ్య, పల్లెటూళ్ళో ఉన్న భూములన్నీ అమ్మేశాడు. వచ్చినడబ్బంతా కనకాంగిపేర బ్యాంకులో వేశాడు. ఆ సంవత్సరమే నేను యం. ఎ. పరీక్షకి నాగపూరుకి వెళ్ళాల్సి వచ్చింది. మెడలో ఉండే నెక్లెస్ తెగిపోయింది. 'అతికించవా అన్నయ్యా!' అని అడిగాను.

"ఈ ఏడాది నీ క్రింద ఎంతైందో తెలుసా? ఇంకా నెక్లెసులూ అవీ తెమ్మంటే ఎక్కణ్ణించి తేను? మొన్ననే వంద రూపాయలు పెట్టి బట్టలు కొనుక్కున్నావు. రెండొందలైనా లేందే పరీక్షకి వెళ్ళిరావటం కుదరదు! తెలుసా!"

అన్నాడు. అప్పట్నుంచీ నాకు, నగలు ధరించటంమీద మోజు తీరిపోయింది. నన్ను మెచ్చుకునే వాళ్ళెవరున్నారు? అనే నిర్లిప్తత నాలో కలిగింది.

"తిని కూర్చోలేక చదువులు నీకు! డబ్బు ఇక్కడ పోగుచేసుకుని కూర్చున్నామా? ఏదో దొరికిన ఉద్యోగం చేసుకోకూడదూ?" అనేది కనకాంగి. నాకు మనశ్శాంతి దూరమైంది. ఈ ఇంట్లోంచి నాకు విముక్తి యెప్పుడా అనే వ్యథ గుండెల్ని, పిండేది. ఉన్నట్లుండి ఒకరోజు సిలగిరికి బయలుదేరింది తండ్రిని తీసుకుని. అన్నయ్యకి సెలవుల్లేవు. నేను వూరుకోలేక—

"నీ ఇంటిని నువ్వు శ్రద్ధగా చూసుకోకపోతే ఎలాగమ్మా! అన్నయ్యకేమో సెలవుల్లేవుకదా! ఇప్పుడు వెళ్ళకపోతే ఏం?" అన్నాను. ఆమె ఆ ఇంటికి యిల్లాలు. గృహలక్ష్మి! ఆమె ఇంట్లో మసలకపోతే నాకేమీ తోచేదికాదు. నాతో ఆమె సరదాగా ఉండకపోయినా ఫరవాలేదు. అన్నయ్యతో సరదాగా ఉంటోంది కదా? అది చాలదా నాకు? ఎప్పటికైనా సంసారం నడుపుకోవల్సినది వాళ్ళేకదా. నన్ను ఏమి తిట్టినాసరే! వాళ్ళిద్దరూ ఇంట్లో తిరుగుతూంటే నాకు, అమ్మా నాన్నా తిరుగుతున్నట్లే అనిపించేది. అందుచేత నాకు అంత ప్రేమ! నాగమణి కళ్ళు ఆగలేదు. ఆమె కృశించిన చంపలమీద కన్నీరు వర్షిస్తోంది.

"ఊరుకో మణీ!" చటుక్కున ఆమె తలను తన హృదయానికి హత్తుకున్నాడు పద్మనాభం. అతని హృద

యావేగం, నాగమణి చెవులకి స్పష్టంగా వినపడ్తోంది. కాస్సేపయ్యాక నాగమణి తేరుకుంది.

"నా ప్రేమని వాళ్ళు గుర్తించలేదండీ! అదే బాధ నాకు! నేను వాళ్ళవించి ఏం కోరుకున్నాను? నాకేం లభ్యమయ్యింది? నాకొక్కావల్సింది ఏముంటుంది! చెప్పండి!

"సరే! ఏముందో తెలుసా మా వదిన! 'ఇది నా యిల్లు యెలా అవుతుంది నువ్వుండగా! నా ఇల్లయినప్పుడు నేను ఆ మాత్రం శ్రద్ధ తీసుకోకపోను' అన్నది విసురుగా. నేనుండగా, అది తన ఇల్లవుతుందని నమ్మకం ఉండదు అన్నమాట ఎంత బాధాకరమయిన విషయం? ఏ ఆడబిడ్డయినా, అనగలదా- ఆ మాట! తను మాత్రం స్త్రీ కాదా? తను ఒకింటి ఆడబిడ్డ కాదా? కాని అయితే ఒకటి మటుకు నిజం. ఆమెకి ఇల్లు లేదు_వాకిలి లేదు. ఆదరించాల్సిన అన్నదమ్ములు లేరు ఆమెకి. మామూలు ప్రేయసీ ప్రియ బాంధవ్యంతప్ప, కుటుంబపు మమకారాలు అర్థంకావు. అందుకనే మా అన్నయ్య, అంత చప్పున మారిపోగలిగాడు. ఒకసారి అన్నయ్యతో అన్నాను.

'అన్నాయ్! వదినకి శ్రద్ధ తక్కువరా! ఇంటిపట్టున ఉండదు. ఖరీదైన సామాన్లు ఎక్కడపడితే అక్కడ పడవేసి పోతుంది. అన్నప్పుడూ మన రోజవుతుందా? పనివాళ్ళు మనవాళ్ళవుతారా?'

'దాన్ని గురించి రిమార్కు చేయటానికి నువ్వెవరు? నా సంసారం జోలికి నీకెందుకు? నీ ఏడుపు నువ్వు ఏడు!' చీదరింపుగా అన్నాడు. ఇంక తనతోనూ మాట్లాడటం

తగ్గించాను. ఒక్కరినీ, రెండేళ్ళు ఎలా కాలం గడిపానో, నాకే అర్థంకాదు. మీ సంబంధం సీతంపిన్నే తీసుకువచ్చింది. కట్నం ఇవ్వలేనని, 'గంగిరెద్దులా' గంతులేశావు. ఇచ్చి తీరాలని సీతంపిన్ని.

'మాటిమాటికీ మీరెందు కిక్కడికి రావటం? మా ఇంట్లో సుఖశాంతులుండనివ్వరా ఏమిటి?'

అని వదిన విసుక్కోవటం మొదలెట్టింది.

'నీ కెందుకు పిన్నీ! నా గురించి నీ విన్నిమాటలు పడటం!' అన్నాను.

'చేతుల్లో పెంచినది, ముగ్గులోనే త్రుంపేయటానికా తల్లీ! నే నెన్నిమాటలు పడ్డా నీ మెళ్ళో ఆ మూడుముళ్ళూ పడితే, ఆ మాటలు, పన్నీరు వర్షంలో కడిగేసుకున్నట్లే!' అన్నది. కన్న ప్రేమకన్న పెంచిన ప్రేమ గొప్పది అంటారు యిందుకనే కాబోల్ను. నా కన్నతండ్రి ఏం చేయగల్గాడు? పన్నెండేళ్ళు నిండుతూన్న ఆడపిల్లని దయా, ప్రేమా లేని అన్నయ్యకి, స్వార్థపూరితుడైన అన్నయ్యకి, అప్పచెప్పి పోయారు. నాకని ఏదో కొంచెం ఇవ్వకపోబట్టి వదిన దగ్గర అంత అలుసై పోయాను. ఆ రోజుల్లో అప్పుడు, అన్నయ్య నా పట్ల కనపరిచే ప్రేమనిచూసి మా నాన్న మోసపోయారు. అంకుకున్న నిరనురాలిగా వదిలి వెళ్ళిపోయారు. అత్తయ్యగారు, నన్నుదయతలచికట్నంకానుకలు అక్ఖర్లేదనుకున్నారు కనుక సరిపోయింది, లేకపోతే నేనే మయిపోదును? పుట్టుకతోనే తల్లినీ, యౌవనారంభంలో

తండ్రినీ, తర్వాత భ్రాతృప్రేమనీ పోగొట్టుకున్న నిర్భాగ్యురాలిని. నన్నెవరాదరిస్తారు?

మీ ఇంటికి వచ్చాక, అత్తయ్యగారిదగ్గర, భద్ర దగ్గరా నేను చాలా సేద తీరాను. అలాంటి బంధువులు నన్ను ప్రేమించటం నాకెంతో ఉత్సాహాన్నిచ్చింది. జీవించ వచ్చుననే ఆశ చిగురించింది. అంచేత మీరు మాట్లాడక పోయినా, వాళ్ళ అండని నిర్భయంగా, స్వేచ్ఛగా, బ్రతక గల్గాను. ఈ రెండేళ్ళల్లో, మా అన్నయ్య- వదినా వచ్చి చూడటంకాని, ఉత్తరాలు వ్రాయటంకాని చేయలేదు. పుట్టింటి ప్రేమ నోచుకోలేదు నేను. వాళ్ళకి నా పట్ల ఇంత నిరాదరణ యెందుకో నాకు తెలియదు. సాధారణంగా, పుట్టింట గౌరవించని, స్త్రీని అత్తవారూ భర్త కూడా ప్రేమించలేరు. అందుకనే వాళ్ళ ప్రసక్తి, అత్తయ్యగారి దగ్గరా, భద్ర దగ్గరా తేను నేను. నా కెవరితోనూ మాట్లా డటం అట్టే అలవాటులేదు. అంచేత కొంచెం ముభావంగా ఉండటంతో భద్రకి కోపం అనుకుంటాను.

అయినా నేను ఆమెని యెంతో గౌరవిస్తాను. నేను మా వదినవల్ల పొందలేని ప్రేమని, భద్రకి అలభ్యం చేయ గలనా?" నాగమణి ఆపేక్షగా అన్నది. పద్మనాభం తృప్తిగా భార్యవేపు చూశాడు. ఆమె కళ్ళచుట్టూ పరుచు కుంటున్న విషాదనీడ తను పోగొట్టలేనిది కాదు.

"అంచేత నావల్ల జరిగిన ఈ అకార్యం, వారికి చెప్పలేక పోయాను" అన్నది మళ్ళీ నాగమణి.

పద్మనాభం తలెత్తి ఆమెకేసి చూశాడు. 'ఏమిటి' అన్న ప్రశ్న అతని ముఖభంగిమలో ఉత్పన్నమయింది.

"చెప్పకుండా ఉండలేను. మీనుంచి ఏమీదాచను" ఆమె చెంపలు అదురుతున్నాయి. అబద్ధం ఆడటానికి కూడా అచేతన మవుతున్నది ఆమె సున్నిత మనస్సు!

"మీకు రఘునందన్ తెలుసనుకుంటాను. ఈ ఊళ్లో కాలేజీలో వర్కు చేస్తున్నారు."

అని తలవంచుకుంది నాగమణి.

"అయితే!"

ఆ అయితే, అన్న ప్రశ్న వెనకాతల ఎన్ని సంశయ పూరిత వ్యధాజ్వాలలు ఎగసిపడుతున్నాయో, నాగమణి పసికట్ట కలిగింది.

"ప్రతి జీవితం, రకరకాల అనుభూతులకోసం అర్రులు చాస్తుంది. ఈ సుఖదుఃఖాలనేవి, మానవ మనోకల్పితాలని కొంతమంది వ్యక్తుల వాదన. ఏదయినా, శరీరానికేగాని, మనస్సుని స్పృశింపలేవు. మానవుల రసచేతన ఒకొక్కప్పుడు, ఊర్ధ్వ దృష్టితోనేకాని అధో దృష్టిని ప్రసరింప జాలదు. వాళ్ళు తాత్కాలిక ఇంద్రియ సౌఖ్యాలని అతీంద్రియానందానుభూతిగా వర్ణిస్తూంటే, మనం కూడా, ఆ మిధ్యలో పరిభ్రమిస్తూ, ఏది శాశ్వతం? అనుభవమే జీవికి ఆనందం అనుకుంటాం—

'ఈ శరీరం మట్టిలో కలిసిపోయేదే! నీతి నియమం ఎల్లాంటి వారికి? పడ్డించని విస్తరిలాంటి జీవితం కలవారికి.

మేడలో కూర్చున్నవాడు అడుక్కు తింటున్న వాణ్ణి, పని చేసుకు బ్రతుకలేవా – అని గద్దిస్తాడు. ఆ పని దొరకక్కే అడుక్కుతింటున్నానంటాడు అడుక్కుతినేవాడు. పని ఇచ్చే శ్రద్ధ అనేవాడికి, పనిచేసే ఓపిక వినేవాడికి ఉండదు. కాని ఆ తర్కం తాత్కాలికమైనది. నైతిక ప్రవర్తనలూ, విలువలైనా అంతే! 'నీతిగా ఉండండి' అని చెప్పేవాడూ, వినేవాడూ కూడా, అవినీతి పనులంటే అంతర్గతంగా ఆనందపడుతారు. మనం చేయలేని పనులన్నీ, అవినీతి అని అనటం వ్యక్తుల సరదా! కాస్త పొదుపుగా జీవిస్తున్నవాణ్ణి, దూబరావాడు, లోభి అని హేళన చేస్తాడు. స్త్రీలతో ఆనందం అనుభవించలేని దుర్బలుడు, స్త్రీ పాపహేతువనీ, సంసారం దుఃఖసాగరమనీ నిర్వచిస్తాడు. నిరంతర స్త్రీ సాహచర్యం ఉంటేకాని భరించలేని యౌవనుడు, 'సర్వం మిథ్య! సాని సత్యం!' అని ప్రవచిస్తాడు. ఎవరి వాదాన్ని మనం ప్రామాణికంగా తీసుకొని జీవితం నడపబూనినా సాహసకృత్యమే అవుతుంది. ఎవరి శారీరక, మానసిక ఆనందానికి వాళ్ళు ప్రయత్నించి జీవితాన్ని సఫలం చేసుకోవాలి!'

ఇది రఘునంద్ చదువుకునే రోజుల్లో చెప్పే ఉపన్యాసం. నాకు అతనితో మామూలు పరిచయమే ఉండేది. మన వివాహం అయినాక, నాకు జిజ్ఞాస పట్టుకున్నది ఈ సంవత్సరములోనే. నేనెందుకు జీవిస్తున్నాను? నేను జీవించటంవల్ల, ఎవరికి ఆనందం లభ్యమవుతున్నది? నాకన్న చెట్టు నయం – దారినిపోయే బాటసారులకి నీడనిస్తుంది.

పుట్టనయం! ఎంతో సాగసైన తెల్లత్రాచులని ప్రాణప్రదంగా తన గర్భంలో దాస్తుంది. గట్టునయం! నురగలతో పరవళ్లు త్రొక్కే సమస్త ప్రాణికోటినీ, తన కెరటాలలో, అమిత లాలసత్వంతో విలీనం చేసుకునే కడలిని అడ్డగలిగి, సమస్త చైతన్య ప్రకృతినీ సంరక్షించకలుగుతుంది.' ఈ భావ సంఘర్షణలో నాకు, కంటికి నిద్రవచ్చేదికాదు. ఈ నిర్వేదంలోనే రఘునందన్, మళ్ళీ ఈ ఊరికి రావటం సంభవించింది. ఇన్నాళ్ళకి నా జీవితాన్ని విప్పిచెప్పుకుందుకు ఒక స్నేహితుడు దొరికాడన్న ఆనందంతో శరీరాన్ని విస్మరించాను. కాని ఒక స్త్రీ తన దుఃఖగాధ స్త్రీతో చెప్పుకుంటేనే నిజమయినసానుభూతి లభిస్తుందన్న సత్యం, నాకు తెలియదు. అతను పురుషుడు! నాది అనుభవంలేని, నిస్సార జీవితం! ఇంకేంకావాలి!" నాగమణి తలవంచుకునే చెప్పుతోంది.

పద్మనాభం మనస్సు చివుక్కుమంది. ఈ స్త్రీలని తను కనిపెట్టలేడు! వీళ్ళకి ఎప్పుడేం కావాలో, తనకి తెలీదు! తను వాళ్ళ మనస్సుని కనిపెట్టి నడుచుకోలేడు. తన జాతకంలో స్త్రీచేత వంచితుడవ్వాలని వ్రాసిపెట్టి ఉంది కాబోలు. అయినా, నాగమణి తప్పేమీలేదే! తను ఆమె వంక, కన్నెత్తి చూడలేదు. నిరంతరం ఆమెకోసం తిరుగుతున్నా, సంధ్య అలా ప్రవర్తించిందికదా! సంధ్యకన్న, నాగమణి వేలరెట్లు నయం!

"నిన్ను మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాను మణీ! నా అనుచిత ప్రవర్తనకీ, నీ నిర్వేదంలోని అనౌచిత్యానికీ,

సరిపోయింది. బాధపడకు!" దగ్గరకు తీసుకుని లాలింప బోయాడు. నాగమణి శరీరం అగ్నిజ్వాలల్లో దగ్ధమైపోతోంది. తను ఆశించినది ఒకటి; జరుగుతూన్న దొకటి. భగవాన్! ఏమిటీ విపరీతం? తను ఈ ఆత్మవంచన నించి ఎప్పటికి విముక్త అవుతుంది!"

"మీ సహృదయానికి నేను లొంగిపోతున్నాను. అయిదారు నెలలు మీరు నన్ను సహిస్తే..." చేతుల్తో ముఖం కప్పుకుంటూనే ఏడిచేసింది నాగమణి. పద్మనాభం మౌనంగా ఆలోచిస్తున్నాడు. వీళ్ళంతా స్త్రీలు! లలిత, సంధ్య, మణి, వీళ్ళంతా స్త్రీలు! నిజంగా స్త్రీలేనా? తన్ని వంచించటానికి సృష్టింపబడ్డ నాగుపాములా? వీళ్ళ శరీరాల్ని ఇంత పూరేకుల్లా, మృదువుగా తయారు చేసి, వీళ్ళ గుండెల్ని నల్లరాతితో ఎందుకని సృష్టించేడు! శరీరం ఆకర్షకం-మనస్సు అగాధం! ఆ అగాధాల్లోకి చూసి చూసి తన కళ్ళు నెప్పిపుట్టాయి. లాభంలేదు. తనకళ్ళు మూసుకుపోవాలి, తప్పదు. కటికి చీకటైన గతంలోంచి, ఒక్కసారి కోటి సూర్యకిరణాల భవిష్యత్తులోకి చూస్తే, గడ్డకట్టిన మంచు గడని, కాలే ఇనుప మూకుడులో గిరాటేస్తే ఏమవుతుందో అదే అవుతూంది, తన పరిస్థితి. నాగమణి ఎక్కిళ్ళుపెడుతూనే నిరాసక్తతతో సోఫాలో ఒరిగి కన్నుమూశాడు పద్మనాభం. రెండు వర్షఋతువులూ, వర్షించకుండానే, వెళ్ళిపోయాయి. ఇంట్లో భద్రకాని, శారదమ్మకానీ గమనించ లేదు.

ఆఫీసర్స్ క్లబ్బులో, "కొత్త మెంబర్ రఘునందన్" ఆ రోజు పార్టీ యిస్తున్నాడు. రఘునందన్‌ని చూస్తూనే, పద్మనాభానికి ఏదో జ్ఞప్తికొచ్చింది. పార్టీ అయ్యాక రఘునందన్ ఉన్న టేబుల్ దగ్గరకెళ్ళి—

"మీరేనా, కొత్తగా కాలేజీలో ఎప్పాయింట్ అయినది!" అన్నాడు.

"అవును! మీరు?" అన్నాడు రఘునందన్.

"నేను ఫలానా కంపెనీలో పనిచేస్తున్నాను. మీరు వచ్చి ఎన్ని రోజు లయిందీ!" అన్నాడు పద్మనాభం.

"రెండు సంవత్సరా లయ్యుంటుంది."

"మీరు అనంతపురంలో చదివారు కదూ!" అన్నాడు.

"అవును. నీకెలా తెలుసు?" ఆశ్చర్యపోతూ అడిగాడు రఘునందన్.

"జి. యస్. మణి తెలియదూ!"

"మణి! మణి! ఓ! నాకు తెలియకపోవట మేం? మా క్లాసుమేటు! ఆమె, మీ...?"

"నా భార్య!" అతనిలోకి పస్తాయించి చూశాడు పద్మనాభం.

"అయితే తను ఇక్కడ వున్నదన్నమాట. చూసి చాలా కాలమయింది. నేను కాశీలో వుండగా కాబోలు, మీ మేరేజ్ ఇన్విటేషన్ వచ్చింది. మీరుంటున్నది ఎక్కడ? చూడాలని ఉన్నది. చాలా రోజులయింది" అన్నాడు.

"ఏనాడు తనకి తెలుసని చెప్పింది మణి అందుకనే..." అన్నాడు. అంటే అన్నా ఏం మాట్లాడలో తెలియలేదు పద్మనాభానికి.

"అవును తెలుసు. నా కంటే కూడా, ఆమె గురించే ఎక్కువ తలపోసేవాణ్ణి. ఆమె జీవితం ఎలా గడుస్తుందా, అన్న దిగులుతో ఒక్కొక్కప్పుడు నాకు చదువుకో బుద్ధయ్యేది కాదు." "అంత ఇదన్నమాట — ఆమె అంటే!" ఆదృత పడ్డాడు పద్మనాభం. అంత ప్రేమించి పూజించే వ్యక్తి అండ ఉండగా తన నెందుకు పెళ్ళాడినట్లు?

రఘునందన్ పూర్వ స్మృతులలోకి విసరివేయబడ్డాడు.

"అలారండి. ఇక్కడి రొదగా ఉన్నది" అన్నాడు. క్లబ్బులో ఫ్లడ్ లైట్లు వెలిగాయి. టెన్నిస్ ఆడేవాళ్ళు టెన్నిస్, మిగిలినవాళ్ళు పేకాట టేబుల్స్ దగ్గర సర్దుకున్నారు. వాళ్ళిద్దరూ నర మామిడిచెట్టు క్రింద కూర్చున్నారు. అప్పుడే పార్టీలో ఫలహారాలు చేసిరావటం మూలంగా, పద్మనాభం కళ్ళు, చెట్లగొంక చల్లని గాలికి బరువుగా వాలుతున్నాయ్.

"మణి మీలాంటివారి ఇంట పడగలిగినందుకు నే నెంతైనా సంతోషిస్తున్నాను. నేను మణివాళ్ళ ప్రక్క ఇంట్లో అద్దెకుండేవాణ్ణి. ఫారాలనించీ, నేనూ మణి చదువుకునేవాళ్ళం. కాలేజీలో చేరిన సంవత్సరం అనుకుంటాను; మణి వాళ్ళన్నయ్యకి వివాహం అయినది. అప్పట్నించీ, మణిలో చలాకీతనం కన్పించలేదు. నేను రెండు మూడు

సార్లు పలకరించినా ఏదో అన్యమనస్కంగా జవాబులు చెప్పేది. అలా తనలో తను క్రుంగిపోవటంకన్న మానసికా నందంకోసం మార్గం అన్వేషించటం ఆరోగ్యప్రదమని ఎన్ని సార్లో హెచ్చరించాను. విన్పించుకునేది కాదు. ఫోర్తు ఇయర్‌లో అనుకుంటా, ఇంగ్లీష్ క్లాసు జరుగుతూండగా, కళ్ళుతిరిగి పడిపోయింది. నేనూ, సుశీల అనే అమ్మాయీ యింటికి తీసుకవచ్చాం. చాలా నీరసంగా ఉందన్నాడు డాక్టర్. తర్వాత క్రమక్రమంగా కోలుకున్నా అప్పుడప్పుడు ఫిట్సగా వచ్చేవి. వాటికి మానసిక అశాంతులే కారణం అన్నాడు డాక్టర్. ఫోర్తుయియర్ ఎగ్జామిన్స్ అయిపోగానే, తనకి మళ్ళీ జ్వరం రావటం మొదలెట్టింది. వాళ్ళ యింటి విషయాలు మీతో నేను చెప్పకూడదు. కాని మీ ముఖంలో ఒక విధమైన ప్రశాంతత అలముకొని ఉన్నది. కనుక మణి కోసం మీరేమైనా చేయగల సంసిద్ధత కనుపించుతోంది” నుదుటిమీద పట్టిన చెమట బిందువులని చేరుమాలుతో తుడుచుకున్నాడు రఘునందన్. కర్తవ్యతా విమూఢునిలా వింటున్నాడు పద్మనాభం. నిశాకన్నె తన హొయలు వలక బోస్తూ, చెట్ల గుబుర్లలో నృత్యం చేస్తున్నది.

“మణికి, జ్వరం వస్తూనే వుండేది. అంత పెద్ద ఇంటిలో, ఒక మూల తనగదిలో నిర్జీవంగా పడివుండేది మణి. ఇంటిలో ఏం కావాలని, అడిగేవాళ్ళుండేవాళ్ళు కాదు. కనకాంగి మేనత్త, సన్నమ్మగారని ఒకావిడవుండేది. ఆవిడ వంట యింటి పెత్తనం వహించేది. కనకాంగి ఇంక ఇరవయి నాలుగ్గంటలూ, షాపింగనీ, పిక్చర్లనీ తిరుగుతూ

ఉండేది. రోగికి మందులూ, మాకుకన్న, ఆదరణా, ఆప్యా యతే ఎక్కువ ఫలితాన్నిస్తాయి. నేనువెళ్ళి ప్రక్కన కూర్చునేసరికల్లా మణి కళ్ళు ఆనందాన్ని వర్షించేవి. నన్నమ్మగారికి నారాక రుచించేదికాదు అనుకుంటాను- ఎప్పుడు వెళ్ళినా ముఖం చిట్లించేది ఆవిడ! మణి అన్నయ్యే మటుకు బంధువులైనా, స్నేహితులైనా, వచ్చినప్పుడు మణిమీద ఎక్కడిలేని అపేక్ష ఒలకబోసేవాడు. కడుపులో లేనిదే కౌగిలించుకుంటే వస్తుందా! ఏవో మందులు వాడే వారు. శానిటోరియంకు పంపే ప్రయత్నంలో ఉండగా, నన్ను దగ్గరికి పిలిచింది.

'రఘూ! ప్రేమించే మనస్సుకి, ప్రేమించే మనస్సు అలభ్యమయితే, ఇదే గతికదూ!' అంది ఆవేదనగా.

'ఏమిటో చెప్పు!' అన్నాను.

"నేను ప్రేమించాను రఘూ!" అన్నది.

'అది సర్వసాధారణం, దానికి దిగులెందుకు?' అన్నాను.

'ప్రేమించటమంటే, మోహించటంకాదు రఘూ! కామించటమూ కాదు. ప్రేమఅన్నదిపవిత్ర వస్తువు. ఆత్మగత మైనది. అందమైన వస్తువునిచూసి, ఆకర్షింపబడతాం. అంటే మోహితుల మవుతాం అన్నమాట! తర్వాత దాన్ని మన చేతుల్లోనే అట్టేపెట్టుకోవాలని కాంక్షిస్తాం. అదే కామన! కనకాంగిని, నేనూ ప్రేమించాను; అన్నయ్యా ప్రేమిం చాడు. అన్నయ్య ఆమె అందాన్ని అనుభవిస్తోన్నా పరి తృప్తికవటంలేదు. నాకు ఆమె ఇంట్లో తిరుగుతూండగా

చూస్తేనే, ఆనందంగా ఉంటోంది. కాని ఆమె ప్రేమా, ఆదరణ నాకు లభ్యంకాలేదు. స్త్రీ, స్త్రీ ప్రేమ కోరుకోవటం విచిత్రంగా లేదూ?'

'డెలీరియం కాబోల్ను-అని భయపడ్డాను.'

'నే నుండగా నీకేం భయం మణీ!' అని దిగులుగా అన్నాను.

'నువ్వే మా అన్నయ్యయితే, నాకు భ్రాతృ ప్రేమ కూడా క్షీరసాగరంలో అమృతంలా లభ్యమయ్యేది,' కళ్ళ నీళ్ళూరుతూంటే అన్నది మణి.

గతుక్కుమన్నాడు పద్మనాభం. మణి! పరిమళభరితమైన మల్లెపూవులోంచి విడిపోయి నేలరాలే సున్నిత మల్లి పూరేకులా, జలజల్లాడుతూ ఎగిరి తను ప్రాంగణంలోని మహా వృక్షాల క్రింద సేద తీరుతున్న అమృత మూర్తి!

'ఆ మాట, ఆ రూపూ, నా మనసులో చెరగని ముద్రవేసుకున్నాయి. ఎంతమంది కుటుంబీకులు తమ మధ్య మెసులుతూన్న అమృత హృదయాల్ని కనుగొంటున్నారు? అసలు తోటి హృదయాలలోని నవనీత సారం గ్రహించగల్గే స్థిమిత మనస్సు ఎంతమందికున్నది? 'ఎక్కడున్నా ఈ అన్నయ్యని మరచిపోకమ్మా' అన్నాను. తర్వాత కొన్ని రోజులదాకా ఉత్తరాలువ్రాసేది. శానిటోరియంలో, రెండు సంవత్సరాలున్నది. తర్వాత ఇంటి కొచ్చాక, యం. ఎ. కు కట్టి పరీక్ష ప్యాసయినది. వివాహపు శుభలేఖ తర్వాత మళ్ళీ ఉత్తరాలు వ్రాయలేదు. బహుశా ఆ త్తవారింట

తీరిక లేదు కాబోలు—అనుకున్నాను. మిమ్మల్ని చూసేక, ఎప్పుడు చూద్దామా అనిపిస్తున్నది" అన్నాడు.

అయితే ఇంతవరకూ మణి ఇతన్ని చూడలేదన్న మాట. రఘుకేసి దీర్ఘంగా చూశాడు పద్మనాభం. చామన చాయగా, పొట్టిగా ఉన్నాడు మనిషి. పొట్టి మూలంగా పిలగా అగుపించుతాడు. చురుకైన కళ్ళు. ప్రతి చిన్న విషయాన్ని మనస్సుకి పట్టించుకునే సున్నిత వ్యక్తి!

"మిమ్మల్ని చూశానన్నదే మణి!" అన్నాడు పద్మనాభం.

"మిమ్మల్ని మీరు పరిచయం చేసుకునేదాకా మణి పూరు ఈ పూరనే తెలియదు నాకు. అందుకనే, చూడాలనే ఆతృత కలిగింది నాకు! పదండి!" అన్నాడు.

రఘునందన్‌దా అబద్ధం! మణిదా? ఎవర్ని నమ్మాలి! ఎవర్ని నమ్మకపోవాలి! తనలోతనే మల్లాగుల్లాలు పడుతూ కారు దగ్గరకు నడిచాడు పద్మనాభం. రఘునందన్ వెళ్ళిపోతూ,

"ప్రొద్దుటే వచ్చేస్తా! చెల్లాయిని చూట్టానికి. వాళ్ళ వదినని, పిల్లల్ని కూడా తీసుకువస్తానని చెప్పండి" అన్నాడు.

"తప్పకుండా రండి. భోజనం మా ఇంట్లోనే!" అన్నాడు పద్మనాభం. అదృష్టవంతురాలు మణి! అనుకున్నాడు రఘునందన్. ఆమె జీవితానికేం భయంలేదు. అన్నిటినీ భరించగల్గే హిమవంతుడులాంటి భర్త దొరికాడు—అని ముచ్చటపడ్డాడు.

♦ ♦ ♦

రెండేళ్ళ అనంతరం, రాత్రి పన్నెండయ్యాక, తన గదిదగ్గర ఏవో అడుగుల చప్పుడికి మెలుకువ వచ్చింది మణికి. సన్నగా తలుపు తెరిచి దిక్కున మాత్రం బెడ్‌రూం లైట్ వెలుగుతూంది. మణి లేవలేదు. నీరసంగా అలానే పడిఉంది. పద్మనాభం లోపలికి వచ్చి, లైట్ వేశాడు. రెండేళ్ళనాడు కన్నా మణి యింకా చిక్కిపోయింది. పొడుగాటి జుట్టు మాత్రం దిండు అంతా పరుచుకున్నది. వచ్చి మంచంమీద కూర్చుంటూనే ఆమె చెంపమీద చేయివేశాడు. తడి తగిలింది అతని అరచేతికి.

"ఎందుకు వచ్చారు?" అన్నది మణి శుష్కించిన స్వరంతో.

"ఎందుకని అబద్ధం చెప్పావు మణీ! నా మీద నీకు కోపమా?" రెండు చేతులతో భుజాలు పుచ్చుకుని లేవదీశాడు.

"కోపమని ఎలా అనుకున్నారు?" నవ్వింది మణి హార్దికంగా.

"ఆ మనిషి దేవతా! ఎలా నవ్వగలుగుతూంది! ఆ నవ్వులో ఆ శుష్కించిన పెదాలమీద విరజిమ్మే వెడనవ్వు వెన్నెలలా ఉన్నదేమిటి?" దిగ్భ్రమగా చూశాడు మణి వెంపు.

"మీామీాద కోపం దేనికి చెప్పండి! నా కెవరిమీాదా కోపంరాదు. డాక్టరు, నా వూపిరితిత్తి ఒకటి పూర్తిగా

చెడిపోయిందని చెప్పావు. అందుకని మిమ్మల్ని దూరంగా ఉంచటానికి చిన్న ప్రయత్నం! అంతే!" మణి నెమ్మదిగా, తాపీగా అన్నది.

ఒక్కమారు రోదసీలోంచి, సముద్రంలోకి గిరా టెయ్యబడ్డట్లు భావన వచ్చింది పద్మనాభానికి. కళ్ళమ్మట నీళ్ళొచ్చేయ్.

"అంతబద్ధ మాడతావా మణీ! ఇన్నాళ్ళకైనా, రఘునందన్ కన్పించాడుకనుక సరిపోయింది. లేకపోతే ఎన్నేళ్ళు ఇలా గడిచిపోనూ చెప్పు! నా మీద నీకింత అవి శ్వాసమా మణీ!"

"ఏదబద్ధం! ఏది నిజం! అబద్ధం కథ అయితే, నిజం జీవితం! సగం అబద్ధం సగం నిజం కలిపితే జీవితకథా; లేకపోతే కథలవంటి జీవితాలూ అవుతాయి. అంతే!" కళ్ళు మూసుకుని మాట్లాడింది మణి.

"రఘునందన్ కన్పించాడు రేపొస్తాన్నాడు అతనికి మన పెళ్ళయ్యాక ఉత్తరాలు వ్రాయటం మానేశావలగా!"

"అతను వచ్చి రెండు సంవత్సరాలయింది." అన్నది.

"తెలుసునుగా? మరి వెళ్ళి చూడలేకపోయావు?" ఆపేక్షగా అన్నాడు.

"ఆసక్తి లేక!"

"ఆసక్తి! అలాంటి మాటలు ఇంక అనకు మణీ!"

"ప్రేమ మంచువంటిది. అది ఏ వ్యక్తిమీదా నిలవదు."

"అలా అంటున్నావేమిటి!"

"కాకపోతే! మీరు సంధ్యనీ, లలితనీ ప్రేమించబోయారు. నన్నూ ప్రేమించబోతున్నారు."

"నిన్ను నిజంగానే ఈరోజు_ ఈ క్షణంనించీ ప్రేమించటం మొదలెట్టున్నాను." మణిని గాఢంగా హృదయానికి హత్తుకోబోయాడు. మణి దూరంగా జరిగింది.

"ఇంకా నమ్మకంలేదా?"

మణి ముఖం చేతుల్లో కప్పుకుంటూ;

"వద్దు వద్దు! మీ ప్రేమను భరించలేను. రెండో పూపిరితిత్తిలోనికికూడా, వ్యాధి ప్రవేశించిందట!" అన్నది. అతను దేనికీ విచలితుడయ్యే దృష్టి కోల్పోయినాడు. అంచేత దృఢంగా, "అమృతంపోసి బ్రతికించుకుంటాను మణి!" అంటూ చేతుల్లోకి తీసుకున్నాడు.

"నన్ను నువ్వు ఎంత గాఢంగా ప్రేమించావో అర్థం అయ్యింది మణీ! నీమీద నా ప్రేమ తొలగింప చేసుకునే యత్నంలో, నీ జీవితానికి కళంకంకూడా ఆపాదించుకున్నావు."

"మనం మనని ప్రేమించుకున్నంతగా ఇంక ఎవర్నీ ప్రేమించలేము. ప్రేమించామనుకోవటం మన భ్రమ. ప్రేమఅనేది స్వార్థపూరితమైనది. మన్ని, మన ఉదారతని

సహనశీలతని ఇతరులు గుర్తించాలనే తాపత్రయానికి ప్రేమ అనే నైలాన్ ముసుగు వేస్తున్నారు వ్యక్తులు!''

''నువ్వూ అంతేనా!''

''నాయొక్క సహన శీలతని మీరందరూ గుర్తించాలనే, తాపత్రయంలో నాజీవితపు విలువని కోల్పోయాను.''

బాధగా అంటూ అతని వడిలో కళ్ళు మూసుకుని పడుకుంది నాగమణి. వేడిగా కాలుతున్న ఆమె నుదురు మీదకు వంగి, ముద్దు పెట్టుకున్నాడు పద్మనాభం!

---

# ఎగిరే పిట్టలు

ఒకటి-రెండు-మూడు-నాలుగు-అయిదూ-

"వసుంధర" చేతివాచీలోని, సెకన్లముల్లు గిరగిర, అరవయిసార్లు తిరిగింది. బద్ధకంగా నిముషం ముల్లు కాస్త ప్రక్కకు జరిగింది.

ఒకటి-రెండు-మూడు-నాలుగు-అయిదూ-

మళ్లీ సెకన్లముల్లు గిరగిర. అరవయిసార్లూ తిరిగింది మళ్ళీ నిమిషం ముల్లు బద్ధకంగా ప్రక్కకు జరిగింది.

అల్లా పదిహేనుసార్లూ, సెకన్లముల్లు వాచీ వర్తులాన్ని గానుగెద్దులా చుట్టింది. పదిహేనుసార్లూ, నిముషం ముల్లు కాస్త కాస్త జరుగుతూనే వుంది. ఒక్కసారిగా కాళ్ళు తిమ్మిరెక్కితే లేచినించోలేం మనం, కొంచెం సరిచేసుకుంటేకాని. అలానే నిముషం ముల్లుకూడా, తన కాలిని కొంచెం కొంచెం సరిచేసుకుంటూంది. నిముషం ముల్లు జరగటంలో బాధ, విసుగు స్ఫుటంగా కనిపిస్తుంది. సెకన్ల

ముల్లు, గిరగిరా తన చలాకీతనాన్ని నిరూపించుకుంటూ తిరుగుతుంది. వీటివాలకాన్ని మౌనంగా చూస్తూ నించున్న పెద్దమనిషి గంటముల్లు, ఏదో చెప్పబోయేలా అసింటా జరిగింది, తను నించున్న చోటుకి కాస్త ఎడంగా.

టప్. టప్. టప్. టప్... ... ...

చప్పట్లవర్షం! ఈ పావుగంటనించీ ఆగటంలేదు. ఒకే లయలో, సైనికుల బూట్ల శబ్దాన్ని అనుకరిస్తూ శబ్దిస్తున్నాయి, ఆ చప్పట్లు! అప్పుడే నవరాగమాలిక వర్ణం పాడటం పూర్తిచేసింది వసుంధర! "సంగీత మహల్" ఆవరణలోని నిద్రగన్నేరు చెట్లమీద పిట్టలు, సంధ్యాకాశంలోకి ఎగురజొచ్చాయి. వాటికి ఆ హాలులోంచి వచ్చే చప్పట్లశబ్దం, పిడుగుపడబోయేముందు గర్జించబోయే మేఘంచేసే శబ్దంలా వినపడిందికాబోలు. అరకరకాల పిట్టలన్నీ కిచకిచమంటూ ఎగురుతున్నాయి. మళ్లీ రెమ్మల మీదికివచ్చి వ్రాలుతున్నాయి. కాసేపు ఎగురుతూ, కాసేపు దొరికిన రెమ్మమీద వాలుతూ, అనిశ్చితతో గల్లంతు పడుతున్నాయి. అంతదాకా శ్రీ చూర్ణరంగులో వున్న ఆకాశం, బూడిదరంగులోకి మారజొచ్చింది. కొన్ని నక్షత్రాలు అక్కడక్కడా నవ్వుముఖాలతో, ఆకసంమీదికి విహారం చేద్దామని రాబోయి, పడమట దిక్కునుంచీ వురకలు, పరుగులుగా వస్తూ నీలి జలదాలని చూసి ముఖాలు ముడుచుకొంటూ నీలి తెరలోపలికి తప్పుకొన్నాయి. అప్పటి వరకూ సంగీత మహల్లోని దీక్షితార్ హాలులో కిక్కిరిసి

వున్న జనానికి చల్లని నీటిగాలి తగలటంతో కాస్త గుక్క తిప్పుకున్నట్లు అయి ప్రాణం సేదదీర్చుకున్నట్లు అనిపించింది. లేత నీలంబట్ట మీద మంచి ముత్యాలతో వీణపాణి "పద్మాసన" అయివున్న వాణీమూర్తి కుట్టబడిన తెరముందు, పద్మాసనంలో కూర్చున్నది వసుంధర స్టేజి ముందర వరసగా అమర్చిన లైట్లకాంతి, ఆమె ముఖంమీదకు సూటిగా ప్రసరిస్తున్నది. కొద్దిగా ముఖం క్రిందికిదించుకుని చేతివాచీ కేసి చూస్తూ ఆలోచిస్తున్నది వసుంధర! వుండుండీ ఫ్లాష్ బల్బులకాంతి ఆమె ముఖాన్ని మెరిపిస్తోంది ఆమె చెవుల వజ్రాల దుద్దులు, ముక్కునున్న నిమ్మగుత్తి బేసరి, మెడలోని రెండువరసల వజ్రాల అడ్డిగా, ధగధగా, మెరిసిపోతూ తమ యజమానురాలి ఆర్థికోన్నతిని ప్రేక్షకులకు, నిరూపిస్తున్నాయి. భుజంచుట్టూ కప్పుకున్న ఎర్రని జరీగళ్ళ పమిటలోని జలతారుతో అల్లబడిన తామర పూవులు, సూర్యోదయ మయిందా అన్న భ్రాంతితో, వసుంధర మెరిసే. చెవుల దుద్దుల కెంపు అనురాగప్రేరితంగా చూస్తున్నాయి.

ఆ హాలులో ఆ వాణీ తెరముందు వేదికమీద ప్రసిద్ధ గాయనీ మణులెందరో, ప్రోగ్రాంలు ఇచ్చారు. డి. కె. పట్టమ్మాళ్, యం.యస్. సుబ్బులక్ష్మి, యం. యల్. వసంత కుమారి రాధ, జయలక్ష్మి, టి. టి సీత మొదలగు ప్రసిద్ధ గాయనీ మణుల గానాన్ని, వసుంధర, ఆ హాలులో గేలరీలో ఒక మూలగా వొదిగి కూర్చుని వళ్ళంతా చెవులు

చేసుకుని వాళ్ళ గానంలోని మలుపులనూ మెరుపులనూ, ఆకళించుకునేది. ఆరోజుల్లో సన్నగా, నల్లగావున్న, ఆ అమ్మాయి కానీ, కాస్త ముందు రెండుపళ్లూ ఎత్తుగావుండి ఎవర్ని చూసినా, చిరునవ్వు నవ్వుతూన్నట్లుండే, ఆమె ముఖముద్రకాని ఎవర్నీ ఆకర్షించేదికాదు! ప్రక్కన కూర్చో గానే కల్పించుకుని మాట్లాడి, స్నేహం చేసుకోవాలన్న ఆతృత కలిగించే సౌందర్యం కాని, కలుపుగోలుతనంకానీ వసుంధరలో లేదనేచెప్పాలి! మూగగా, వింటం తన్లోనే పాటలు అల్లుకుంటూ కూర్చుంటం ఆమెకి అలవాటు! ఆ హాల్లోనే తన బాల్యమంతా మధురమయిన సంగీత ప్రపంచాన్ని వూహిస్తూ గడిపింది. పద్మాసన స్థితులై సంగతులమీద సంగతులు వేస్తూ గానం చేసే, గాయనీమణులు, ఆమెకి సరస్వతీ రూపులుగా కనిపించి, మనస్సులోనే వేయి ప్రణామాలు ఆర్పించేది కొందరు బాలికలుంటారు. వాళ్ళల్లో చొరవ ఎక్కువగా వుంటుంది. వాళ్ళ కభిమానప్రదమయిన విషయాల్ని పదిమందితోటీ చర్చిస్తూ, పదిమంది వల్లా సేకరిస్తూ, మెట్లుమెట్లుగా, చూస్తోండగానే ఎగ్రాకి శిఖరం అధిరోహిస్తారు. వసుంధరలో, అలాంటి చొరవ లేదు. గానంమీద అభిలాష ఆమెలో అంతర్వాహిని!

ఒక్కగా నొక్క కూతురు ముచ్చటకోసం వసుంధర తండ్రి, వైకుంఠం, "అప్పులో అప్పు అర్ధవీశ ఇంగువ" అన్నట్లు వసుంధరకి పధ్నాలుగేళ్ళు వచ్చేదాక సంగీతం నేర్పించాడు. వసుంధర మాష్టరు కోదండయ్యగారు,

వసుంధర గాత్రంలోని లాలిత్యాన్ని, గమకాన్ని గమనిం చారు 'ఉత్తమగాయని, అయ్యే లక్షణాలున్నయ్యాని వంద నార్లు వైకుంఠంగారితో చర్చించారు. వైకుంఠంగారు నవ్వి పూరుకునేవాడు. ఆయనకి కూతురు గాయనీమణి అయి ప్రశంసలు పొందటంకంటె అత్తవారింటి కోడలై ఫలానా వైకుంఠం గారమ్మాయి, తల్లో నాలుకల్లే మెసలుకుం టూంది, అత్తవారింట్లో! అన్నకీర్తియే, ముఖ్యం. ఆయన పదహారణాల, నూరుపైసల ఆంధ్రస్త్రీల తండ్రి! అందుకని! అందుకనే——

టం-పం-టం-అంటూ మృదంగం సరిచూట్టం ఆపి అయ్యపిళ్ళ, వసుంధర వేపుచూశాడు. వసుంధర మౌనంగా చేతివాచీకేసి చూస్తూ కూర్చుంటం గమనించాడు! హాలులో చప్పట్ల వర్షానికి జోడుగా హాలుబయటకూడా సన్నని తుంపర మొదలైంది! ఫ్లడ్‌లైట్ల కాంతిలో ఆ తుంపర్లు వజ్రపు రవ్వలల్లె మెరుస్తున్నాయి! పావుగంటనించీ మౌనంగా ఈ మేఘసంగీతం వింటూన్న ఆమె శ్రవణాసక్తికి అద్భుత పడ్డాయి ప్రేక్షక శ్రోతలు. శక్రటరీ రామానుజం ఇంక పూరుకోలేను. గీతానికి, గీతానికి మధ్య పావుగంట పావుగంట విరామమైతే కచ్చేరీ పూర్తవటానికి చాలా సమయం అయిపోతుంది. అందుచేత నెమ్మదిగా, "అమ్మా!" అన్నాడు రామానుజం. ఆమెని ప్రకృతంలోకి తేవటానికి ప్రయత్నించటం చూసిన, వయొలినిస్టు పద్మశ్రీ "వడివేలు" కమాన్ వయొలిన్ మీదవేసి గట్టిగా లాగి "జాయ్" మని

పించాడు. అది చూసిన విమాలా దేశికన్, వెంటనే "తంబుర" శృతి వేయటం ఆరంభించింది. వసుంధర ఉలిక్కి పడి, రామానుజం వైపు చూసింది.

"ఏమిటి ఎనౌన్సు చేయమంటారు!" అన్నాడు రామానుజం. "లిస్టు ఇచ్చాను కదా!" అన్నది.

"మీరు ఆలోచిస్తోంకేనూ!" సందేహంగా అన్నాడు రామానుజం.

"నేను సంగీతాన్ని మర్చిపోను రామానుజం! నన్ను నేనే మర్చిపోతుంటాను!"

"అమ్మా!" అన్నాడు రామానుజం మళ్లీ!

"ఆ పిలుపు! అమృతం వర్షించే ఆ పిలుపుకూడా మర్చిపోను. రామా! నా జీవితం వున్నంతవరకూ నువ్వూ సంగీతం, ఇవే నా ప్రపంచాలు. ఇదే నా ఆలయం. నేను ఎగిరే పిట్టను! రామా! ఎగిరే పిట్టకి నీలాకాశం పచ్చని చెట్టూ మాత్రమే జ్ఞప్తి వుంటుంది. మిగతా మనుష్యు లందరూ, క్రిమి కీటకాలన్ని దానికి ఒకటిగానే కన్పడతాయి. నాది లోంచి మనది లోకి వెళ్ళకలగటం ఆధ్యాత్మిక జీవి ఆశయం రామా! నేను ఆధ్యాత్మిక జీవినికాను, బలవం తంగా ఇందులో ప్రవేశించాను. మళ్ళీ దీన్ని బుద్ధిపూర్వ కంగా ఎప్పుడూ వొదులుకోను." ఆమె, రామానుజంతో బహిర్గతం చేయాలనుకున్న మౌన సంభాషణలు ఇవి. పైకిమటుకు మృదువుగా నవ్వి;

"కానీయి!" అంది. రామానుజం లేచి మైక్ ముందు నుంచున్నాడు. అతను అయిదు అడుగుల ఆరంగుళాల పొడుగున్నాడు. స్టేజిమీద ఒకప్రక్కన పొడుగుపాటి మైక్. అతను, వసుంధర పాడబోయే ప్రతీకీర్తనా ఆ మైక్ ముందు నించుని ఎనౌన్స్ చేస్తాడు. వసుంధరని అతను "అమ్మా"అని పిలుస్తాడు. ఆమెతోనే వుంటాడు, తింటాడు, తిరుగుతాడు. సంస్కృత సాహిత్యంతో పరిచయం వుంది. సంగీత సాహిత్యంతో కూడా పరిచయం వుంది. వసుంధర అంటే అతనికి భయం, భక్తీ, ప్రేమ, గౌరవం, ఆపేక్షా, అనురాగం. అతనికి వూహవచ్చింది మొదలు వసుంధరని తప్ప మరే బంధువునీ తెలియదు. ఆమె "ఫలానా వూళ్ళో, ఫలానా బంధువులున్నారు నీకు!" అని ఎప్పుడూ చెప్పలేదు; అతను అడుగా లేదు.

"ఫలానా వూరు వెళ్ళాలి. అక్కడనాకు బంధువులు వున్నారు" అని ఆమె ఎప్పుడూ చెప్పలేదు. 'మీకుకాని, నాకుకాని బంధువు లెవరూ లేరా?' అని అతను అడగనూ లేదు!

బహుశా అడుగుతే "లేకేం రామా! బోలెడంత మంది వున్నారు. ముఖ్యంగా నీకు నేను, నాకు నీవు ఆత్మ బంధువులం! ఇంక త్యాగరాజస్వామీ పురందరదాసూ, ముద్దుస్వామి దీక్షితులవారూ, మొదలైన వాగ్గేయకారు లంతా నాకు దగ్గర బంధువులు. కాళిదాసూ, భవభూతీ, భారవీ, మొదలైన సంస్కృత కావ్యకర్తలంతా నీకు, దగ్గర బంధువులు" అని చెప్పునేమో!

రామానుజం అడగలేదు తీరిగ్గా తమ వంశ చరిత్ర లని పరస్పరం చర్చించుకుందామన్న కుతూహలత ఇద్దరి లోనూ కలగలేదు! రామానుజం, పెద్దవాడై నప్పట్నించీ అంటే, పదహారేళ్ళు వచ్చేటప్పటికి స్కూల్ ఫయినల్ పూర్తి చేసినప్పట్నించీ, వసుంధర ప్రోగ్రాంస్ డిసైడ్ చేయటం, అడ్వాన్స్ పుచ్చుకుని వాళ్ళకి రశీదులిచ్చి పంప టం, ముఖ్యమైన పనులన్నీ చూసుకునేవాడు. కాలేజీ చదు వులు చదువుతానని రామానుజం అడుగనూ లేదు; చదువు కొమ్మని వసుంధర చెప్పనూ లేదు. ఒకళ్ళ మనోగతాల్ని ఇంకొకరు, సులువుగా అవగాహన చేసుకుంటారు వాళ్ళు!

«ఎహ్హాం!» చిన్నదగ్గు విన్పించింది. మైక్‌లో హాలంతా పిన్‌డ్రాప్, సైలెన్స్ అయ్యింది.

«ఇప్పుడు పాడబోయేది!" రామానుజం, చెప్తు తున్నాడు! కొన్ని వేల చెవులు వింటున్నాయి.

"భావయామి రఘురామం!" అన్నది స్వాతితిరునాళ్ వారి రచన. రామాయణగాథ! రాగమాలిక!

«స్వాతి తిరునాళ్ వారు పంథొమ్మిది వందల శతాబ్ద ములో తిరువాన్కూరు రాజ్యమును పాలించిన రాజ వంశీ యులు! అనేకానేక భాషాకోవిదులు. వీరి కీర్తనలు తెలుగు, సంస్కృతము, తమిళము, మళయాళము, మణిప్రవాళము అనగా మళయాళ సంస్కృతము, హిందుస్థానీ, మరాఠీ భాషలలో రచించారు. ఈయన ముద్ర పద్మనాభం. ఇంకా

వీరి కీర్తనలే కాక, పదములు, వర్ణములు, తిల్లానములు చాలా ప్రచారములో వున్నయ్.

"భావయామి రఘురామం- అన్నది రాగమాలిక రూపకతాళం, పల్లవి సావేరిలోనూ, బాలకాణ్డ; నాట కురంజి, లోనూ అయోధ్యకాండ, ధన్యాసిలోనూ, అరణ్య కాండ, మోహనలోనూ, కిష్కింధకాండ, ముఖారిలోనూ, సుందరకాండ, పూరీ కళ్యాణిలోనూ, యుద్ధకాణ్డ, మధ్య మావతిలోనూ, పాడబడుతున్నది."

చెప్పటం పూర్తి అయీ కాక ముందే, వసుంధర, సావేరిలో కొద్దిగా, ఆలాపన చేసి పల్లవి ఎత్తుకుంది.

పాడటం అందరూ పాడతారు తొడమీద చరిచి తాళం వేస్తూ, కళ్ళు మూస్తూ తెరుస్తూ ముఖం మూడు వంకర్లు త్రిప్పుతూ, తమ గళాన్ని స్వాధీనంలోకి తెచ్చుకో బోతూ, ప్రేక్షక శ్రోతలికి కూడా వ్యాయామం నేర్పబో తారు. వసుంధర స్తిమితంగా కూర్చుంటుంది. మృదువుగా చేతితో తాళం వేసికొంటుంది. దాని శబ్దం ఆమెకే వినపడ నంత నెమ్మదిగా వేస్తుంది తాళం. తల కొద్దిగా వినమ్రంగా వంచుకుని కదలకుండా పాడుతుంది. కదలకుండానే, ఆమె గళనాదంలో సుళ్ళు తిరిగే స్వరలహర్లకి ముగ్ధులౌతారు, ప్రేక్షక శ్రోతలు. చాలా మందికి సంగీతం అంటే, వినే ఆసక్తి వుంటుంది. అంచేత రేడియోలో విని తృప్తిపడ తారు. కాని స్టేజ్ మీద చూడటానికి అంతగా ఇష్టపడరు. ఏమంటే వాళ్లు చేసే ఫీట్స్ చూడలేక! వసుంధరలో ఆ లోపం లేకపోవటంవించి, గాయనీమణిగా ఆమె దర్శసి

యంగా వుంటుంది శ్రోతలు, ప్రేక్షకులుగా కూడా, వుంటారు. ఆమె కూర్చుని వుండగా ప్రేక్షకులుగా వుండే జనం ఆమెగానం ప్రారంభించేసరికి ఫక్తుశ్రోతలుగా మారి పోతారు. ఆమె గాన ఝరులలో లౌకికులు అలౌకికులుగా, చేతనులు అచేతనులుగా, మారిపోతారు. వారి మనస్సులు సర్వ ఇంద్రియ ఆలోచనల్నించీ విముక్తమై, విశిష్టమైన శ్రోతలస్థాయిని అందుకుంటాయి. ఆమె పాడుతూంటే, పవిత్రమైన శారదా మాతగా గోచరమౌతుంది, తప్ప నైలాన్ వస్త్రాలు ధరించే నాగరీక స్త్రీగా గోచరమవ్వదు. ఆమెని చూస్తుంటే పూజ్యభావము కలుగుతుంది తప్ప తేలికైన ఆలోచన్లు కలుగవు!

ఆమెగానం సాగుతూంది. గేటు కీపర్లుకూడా శ్రద్ధగా వింటున్నారు పవిత్ర రామాయణగాధ. ఒక్కొక్క వాక్యంలో ఒకొక్క చరిత్ర. కళ్ళకు కట్టుతున్నట్లుండే కీర్తన. యుద్ధకాండలోకి వొచ్చింది. మధ్యమావతి రాగంలో పాడుతున్నది వసుంధర. "కలిశవర సేతుబంధం-కలనిశి చరబృంద దళనం. అతిశూర్య-దశకంఠవిదారం అతి ధీరం,జ్వలన పూత జనకసుతా-సహితమిహ సాకేతం-విలసిత పట్టాభిషేక విశ్వసాలం-పద్మనాభం"

రీస-రిమపనీ- పమపనిసా- అంటూ చిట్టస్వరం ఎత్తుకుంది. ఆపయిన అన్ని రాగాల చిట్టలూ కలిపిపాడి ఆఖరున సావేరీలో "గరిసధా-రిసధా-సధా" అన్న చిట్ట పాడి భావయామి అని అందుకునేసరికి హాలంతా మారుమ్రోగి పోయింది చప్పట్లతో.

'వాణీదేవి భూతలానికి దిగివచ్చిందా' అన్నారు కొందరు. స్త్రీలకి ఆనంద బాష్పాలుకూడా వొచ్చాయి.

'ఆమె పాదాలు ముట్టుకుంటే పంచమహా పాపాలు పోతాయ్' అన్నాడు మాణిక్యవేలు అప్పాదొరైతో.

అప్పాదొరై వులిక్కిపడ్డాడు. మాణిక్యవేలు మళ్ళీ మొదలెట్టాడు.

'లేకపోతే ఎప్పుడూరాని నువ్వుకూడా వచ్చావంటే ఇంకేం కావాలి? ఇవ్వాళ నేను గుర్తెరిగిన ఇన్ని రోజులకి నువ్వు అయిదు రూపాయిలు ఖర్చుపెట్టి సంగీతసభకి వచ్చావంటే, అంతకన్నా ఇంకేంకావాలి? ఇదంతా తప్పక వసుంధర గాత్రమహిమ అయివుంటుందనుకోనా? సర్వ ప్రపంచాన్ని సమ్మోహన పరిచేది వసుంధర గానం కాదేమిటి?' తన్మయంగా చెప్పుకుపోతున్నాడు మాణిక్యవేలు. అప్పాదొరైకి వళ్ళంతా చీపురుముళ్ళు గుచ్చుతున్నట్టు అనిపించింది. స్టేజిమీద వసుంధర కాస్సేంత తలెత్తి ఎదరకు చూసినప్పుడల్లా తన్ను చూసిందేమోనన్న అనుమానంలో పడ్డాడు అప్పాదొరై.

అప్పాదొరై, గానకళా కోవిదుడు కాడు.

అల్లాకాదని నగరంలోని ప్రముఖ వాణిజ్యదూకాడు. కేవలం మొదలో కలిసిపోయే గొర్రెపోతు. అతనిలోని వీరరసం చైనావాళ్ళు మన సరిహద్దులమీద, దురాక్రమణ చేసేరన్న వార్త విన్నప్పుడు, వుప్పొంగక పోయినా, వుదయాన్నే తోమ్మిదింటికల్లా చూడికుడుత్తమ్మ అప్పడాలం

కాల్చి సాదం విస్తర్లో పరిమాత్యం చేయక పోయేసరికి బుస బుస లాడుతుంది.

అతనిలోని శృంగారరసం, అతని హృదయాంతర్గత రక్తనాళాల్లో అంతర్వాహినిగా, ప్రవహించాల్సిందే! ఏమంటే అతను ధరించే, పందలపాక పంచెలూ, లాల్చీలూ, జైరు చెప్పులా వుండే అతని ముఖమూ, నెత్తిమీద అంగుళం ఎత్తుగా నించుండే అతని జుట్టూ, ఏకాలేజీ అమ్మాయి హృదయ వీణనీ శృతిజేయనీయవు! ఇంక భార్యా రత్న మయిన చూడికుడు త్తిమ్మ, స్వతహాగా అందమయినదైనా, వయసు మీరని చిన్నదకాదు. అయినా అప్పాదొరై;

'అద్దిర కులుకులు, బెళుకులు
నిద్దపు మెఱుంగు దొడలు నీటులు గంటే,
దిద్దుకునే ఏలవచ్చును'

"ముద్దియ యీ వృద్ధనారి ముచ్చట దీరగ" అని చదువుతే, ఒక్కసారి ముఖమంతా గంట్లు పెట్టుకొని, "సిగ్గు లేకపోతేసరి ముఖానికి! పూర్వం రాజులైనా వుండే వారు, మీలాంటి పైత్యకారి, కవిత్వాల్ని భేష్ భేష్ అంటూ మెచ్చుకుని, అక్షరలక్షలు ఇచ్చేటందుకు. ఇప్పుడో రోడ్డుమీద చదివేరంటే, ఎవరైనా రోడ్డుసైడు రోమియో లనుకొని, మేజస్ట్రీటుకి అప్పగిస్తారు. ఎంత తెలుగు ట్యూట రయినా, అలాంటి రసగుళికల్ని భద్రంగా నోరెత్తకుండా మింగటం అలవాటు చేసుకోండి" అని గదమాయిస్తుంది, అయిదుగురాడపిల్లల తల్లి అయిన చూడికుడు త్తిమ్మ!

ఇంక భక్తిరసం అంటే అతనికి భయం. సాధారణంగా మనవాళ్ళు భయం, భక్తి అని జత చేస్తూంటారు. అంటే భయంనుంచి భక్తి ఉత్పన్నమవుతుందని మనవాళ్ళ భ్రమ. అది నిజంకూడానూ. పరీక్షలు బాగా వ్రాయనివాళ్ళు పాసవ్వమేమో అనే భయంనుంచి భక్తులుగా మారుతారు. ఇల్లానే పిల్లలు కలగనివాళ్ళు- అంటే వివాహమయిన మొదటి రెండు మూడు సంవత్సరాల్లోనూ, పిల్లలు కలగకపోతే, యిక పిల్లలు కలగరేమో అనే భయంలోంచి, భక్తులుగా మారుతారు. ఇలానే రకరకాల భయస్తులు, రకరకాల భక్తులుగా తయారవుతున్నారు. భయస్థులు అంతా భక్తులే. అలా అయితే అప్పాదొరైకి ఏ భయంలేదా?- అన్న ప్రశ్న సహజంగానే రావొచ్చును. అతనికి భక్తిలేదు కాని భయంవుంది. ఎప్పటికైనా ఆ భయంలోంచి భక్తి వుద్భవించదా అనుకోవచ్చును. ఫరవాలేదు. భక్తిలోంచే ముక్తి ప్రాప్తించటంకాకుండా, రక్తిలోంచికూడా ముక్తి లభిస్తుందికదా! గాఢానురక్తుడైన బిల్వమంగళుడు ముక్తుడుగా మారలేదా? అయినా అప్పాదొరై భయానికి కల కారణం వివరించకపోవటం న్యాయంకాదు. చూడికుడుత్తమ్మ ప్రతి శుక్రవారం భక్తి శ్రద్ధలతో పూజలు చేస్తుంది. ఆమె నగర "యతిరాజ మహిళామండలి" లో మెంబరు. "వైష్ణవి" పూజ చేసిందంటే ఆరోజు, పైరిమినిష్టరుకి డిన్నరు ఇవ్వొచ్చును అనుకుంటారు చాలా మంది. కాని ఆరోజు అప్పాదొరై లంఖణమే చేయాల్సొటూందన్నది చెరగని సిరాముద్ర!

ఏమంటే ప్రొద్దుట కాలేజీ వేళకి చూడికుడుత్తమ్మ అభ్యంగన స్నానము పూర్తవదు. ఒంటిగంటకి ఇంటికొచ్చేసరికి పొంగలి వుడుకుతూంటుంది! సాయంత్రం ఇంటికొచ్చేసరికి నూతి చప్టామీది గిన్నెలు తళతళా మెరిసిపోతూ అప్పాదొరైని చూసి వెర్రినవ్వు నవ్వుతాయి.

అదేమంటే 'శుక్కురారం పూటా, మిగులూ, తగులూ, తినగూడదు మగాళ్ళు. అందుకనే మనబతుకులిలా బండలౌతున్నాయి. సాయంత్రం ఏద్దైనా ఫలహారం చేస్తాలెండి' అంటుంది, గోదాదేవి అంశను తనలో విలీనం చేసుకున్న చూడికుడుత్తమ్మ! అందుకని భక్తిరసం అన్నది పడదు అప్పాదొరైకి. ఇంతకీ అతనిది రసచేతనకాదు! నీరస చేతన! శృంగార, వీర, భక్తి రసాల్ని అంతర్లీనం చేసుకున్న గానరసానికి అతను ముగ్ధుడెందుకవుతాడు? కాకూడదు న్యాయంగా! అయితే అతడు తన సంపాదన, సంసారపు జరుగుబాటుకే, చాలీచాలనట్లుండగా, అయిదు రూపాయలు ఖర్చుపెట్టి విలాసంగా గానసభ కెందుకొచ్చినట్టు? రెండు కుంచాల బియ్యం వచ్చునే! నాలుగురోజుల గ్రాసం నిర్విఘ్నంగా గడిచిపోవునే! ఇంతటి అపచారాన్ని దుర్వ్యయాన్ని ఆడపిల్లలతల్లీ, అందగత్తె అయిన చూడికుడుత్తమ్మ ఎలా భరించేట్లు?

అతను రావటాన్ని, అయిదు రూపాయలూ, ఖర్చుచేయటాన్ని చూడికుడుత్తమ్మ భరిస్తూంది; ఎందుకంటే! తంబురా శృతిచేస్తూ, మధ్యమధ్య వసుంధర మందరంలో పాడుతున్నప్పుడు, తను తారస్థాయిలో ఒకోముక్క

అంటున్న విమలా దేశికన్ చూడికుడుత్తమ్మ పిన్నతల్లి కూతురుకనుక, ఆదికాల పద్మశ్రీ వడివేలు, తను ఇంటి ప్రక్కనున్న, మాణిక్యవేలుకి అన్నయ్యకనుక.

ముఖ్యంగా అప్పాదొరై, వెళ్ళిరాతీలని శాసించింది చూడికుడుత్తమ్మ; ఎందుకనంటే ఇరవయి వేళ్ళక్రితం, అప్పాదొరై వసుంధరమెళ్లో పచ్చని కొబ్బరాకులపందిరి క్రింద మూడు ముళ్ళువేయటం తనకింకా గుర్తువుంది కనుక! అన్నిటికన్నా ముఖ్యం, తను అయిదుగురాడ పిల్లల తల్లి. పెద్దపిల్ల నాయకి ఎదిగి కూర్చుంది. ఇంట్లో కాసినిలవ లేదు. వసుంధర తన భర్తకి భార్య అయిన వసుంధర, వేలు సంపాయిస్తోందంటే తను ఎదుగుతూన్న ఆడపిల్లలకి సరయిన బట్టలులేక, సదుపాయాలు చేయలేక, వుండీలేక కాలక్షేపం చేయవలసిరావటం, ఆమెకి అసంబద్ధంగా, అసహజంగా అసహ్యంగానూ కనుపించింది కనుకా.

ఆరోజు, ఆ రాత్రి, ఆ విధంగా, అప్పాదొరై అనధికార దేహం గేలరీలో ఒకమూలగా మాణిక్యవేలు ప్రక్కగా కూర్చోబడింది.

ఆకాశం ఆనందంతో జలదరించింది! మేఘాలు జడుసుకున్నట్లు పరుగులెత్తుతూన్నాయి. ఎగిరేపిట్టలన్నీ పన్నీరు వర్షంలో తడిసిపోయి, చీకట్లరెమ్మల్లో. ముక్కులను పొట్టల్లో దాచుకుని బుద్ధిగా కూర్చున్నాయి. వాటిబుద్ధి మంతతనానికి మేఘరాజు మురిసిపోతూ అప్పుడప్పుడు మెరిసి పోతున్నాడు. వసుంధర రామాయణగానం పూర్తిచేసింది. ఎదరకు చూసింది; పరిచితా పరిచిత ముఖాలలో మెచ్చి

కోలు కన్పించింది. ఈ వేదిక తనకు పూజా వేదిక! తన ఆరాధ్య దేవతలు, కూర్చుని, పాడిన ఈ పీఠంపై తను కూర్చుని పాడుతోంది? తను ఆ స్టాండర్డ్‌లోకి వచ్చిందో లేదో తనకి తెలియదు. ఇప్పటికీ ఆనాటి గాయనీమణుల వరసలో తనని చేర్చి, పిలిచితే తను ప్రోగ్రాం ఇవ్వరు. ఏదో జీవికకు ఉపాధిగా, నేర్చుకొన్నది తను! తను, నేర్చిన విద్య నలుగురు బాలికలకు చెప్పి పొట్ట గడుపుకోవాలనే వాంఛ తప్ప గాయనీ మణిగా, సరస్వతీ పీఠం ఎక్కగలనని కానీ, ఎక్కాలని కానీ తను అనుకోలేదు! జీవిత ధ్యేయంగా నాదబ్రహ్మను ఉపాసించే గాయకుల పాదాలమీద పడితే కానీ తన జీవితం తరించదు. అలాంటిది ఎలావచ్చిందో; పేరు వచ్చింది. ఆ పేరు పైకి పైకి పోతూంది, ఎగిరేపిట్టలా! అంతం లేని అనంతంలోకి పోతూంది. ఎగిరేపిట్టని చూసి, మిగతా పిట్టలు కూడా ఎగురుతాయి! నేలబారున దొరికిన గింజలేవో తిని తృప్తిగా వుండే పిట్టలుకూడా ఎగిరే పిట్టలని చూసి ఆకాశం మీదకు ఎగురుతాయి. యెగిరేపిట్ట తనని అనుసరించే పిట్టల్ని చూసి, గర్వం పెంచుకుంటుంది. అహంభావంతో తన ఉన్నతిని చూపాలనే, గొప్పతో యింకా పైకి యింకాపైకి యెగురుతూంటుంది. వీటికి అందకుండా చివరికి తను వెళ్తూన్న శూన్యం పురోగమనానికి చిహ్నమో, తిరోగమనానికి చిహ్నమో తెలుసుకోకుండా కాలగర్భంలో కలిసిపోతుంది. వసుంధరికి అన్ని వేల ముఖాల్లోనూ భర్తముఖం కన్పించలేదు. 'వొచ్చివుండరు' అనుకుంది. ఎందుకని రావాలి? అన్న ప్రశ్న ఆమెలో కలిగింది,

'ఆయన చెప్పినమా పాటంటే సరదాలేదు! సరదావుంటే మటుకు తన వెనకాతల తంబురా శృతివేస్తూనో ప్రక్కన మద్దెల వాయిస్తూనో కూర్చుంటారా!"

వసుంధరకి తన చిన్నతనం ముఖ్యంగా పెళ్ళిచూపుల తతంగం స్ఫురణకు వొచ్చింది.

వసుంధర తండ్రి వైకుంఠంగారు ఎంతో సంబర పడ్డారు, అప్పారావ్లాంటి అల్లుడు దొరికినందుకు! పెళ్ళి నాటి అప్పారావ్కి ఇరవయి ఏళ్ళు. తెలుగు గ్రూప్తో బి. ఏ. ఫస్టుక్లాసులో ప్యాసయ్యి కాలేజీలో ట్యూటర్ గా వర్క్ చేస్తున్నాడు. తల్లికి ఒక్కడే కొడుకు.

పెళ్ళి చూపులు చూసుకునేందుకు, జ్ఞానమణి, అప్పారావ్ వొచ్చారు. తతంగమంతా అయ్యాక, వసుంధ రని పాటపాడమన్నారు.

"ఒకమాట ఒక బాణము" హరికాంభోజిరాగ కీర్తన త్యాగరాజుల వారిది పాడింది వసుంధర. ఆనందపడి పోతున్నట్లు తలలూపారు. వసుంధర అక్కడే పొరపాటు పడింది. తన అత్తగారికీ భర్తగారికీ కూడ సంగీతాభిరుచి వున్నదనుకొంది. కాని తనది పొరపాటు అనికాపరానికొచ్చిన మూడో రోజుకి తెలిసింది. అయినా ఆమె తన సంగీతం, సాధకం చేసుకోవటం, ఆపుకోవాల్సి వొచ్చినందులకు చింతించలేదు. 'పితా రక్షతి కౌమారే, భర్తారక్షతి యావనే' అనే సూక్తి ఆమె ఆచరించ దలచుకుంది. అత్తవారింటో కాపరం చేసిన మూణ్ణెల్లు వసుంధర 'సా' అంటే వొట్టు!

పతియే ప్రత్యక్షదైవము అనుకునేది. అప్పాదొరై, ప్రత్యక్ష దైవములా ప్రవర్తిస్తే కూడా ఆమె పన్నెత్తి మాట్లాడకుండా భరించేది. పతిభక్తే సతికి చిరంతన ముక్తిప్రదాయిగ కదామరి! అంతటి మిధిలేశ్వర తనయ, అయోనిజమైన, సీతాతల్లికే తప్పని అగ్నిపరీక్ష తనకా తప్పేది? అలాంటి అగ్ని పరీక్ష వసుంధరకి వొచ్చింది!

వైకుంఠంగారు మూడువేలు కట్నం ఇస్తానని వొప్పుకున్నారు. అన్నపరికారం వున్న ఇంటిమీద అప్పుతెచ్చి అప్పాదొరైకిచ్చి పెళ్ళి అయిందనిపించారు. అప్పంటే తెచ్చారుకాని, అదేలా తీర్చాలో అర్థం అవలేదు వైకుంఠం గారికి. నలుగురు కొడుకులున్నారు. వాళ్ళు కాస్తో కూస్తో సంపాయిస్తున్నారు - సంసారాలు జరుపుకొంటున్నారు. తండ్రి అప్పుతెచ్చి వసుంధర వివాహం జరిపిస్తోంటే చూస్తూ వూరుకున్నారు. 'తెచ్చినవాడు తీర్చలేడా? ఎవన్నడిగి చేశాడు అప్పు !" అని గుర్రు పెంచుకున్నారు.

వైకుంఠంగారు అప్పుతీర్చమని కొడుకులని అనుగ దల్చుకోలేదు. పెళ్ళిలో వాళ్ళు, వాళ్ళ భార్యలు అనుకునే మాటల్నిబట్టి వాళ్ళకి వసుంధర భవిష్యత్తు గురించి యే బాధ్యతా వుండబోదని గ్రహించేడు. అందుకని ఇల్లు అమ్మేసి అప్పుతీర్చి, తనదారిన తను ఏ పుణ్యతీర్థానికో పోయి చరమదశని, నిశ్చింతగా గడుపుదామను కున్నాడు. అది వసుంధరకి తెలిసింది.

"ఈ పెద్దతనంలో వొంటిగా దేశాలమ్మట వెళ్ళి పోతావా నాన్నా! నలుగురు కొడుకులుండీ" అన్నది. తన

దగ్గర వుంచుకోవటానికి, అత్తగారూ భర్తగారూ అనుజ్ఞ ఇవ్వరని తెలుసును.

"వసూ! 'యస్యాస్తి విత్తం సనరః కులీనః సపణ్డిత స్స శ్రుతవాన్ గుణజ్ఞః' అన్నది మర్చిపోయేవా? అప్పు తీర్చటానికి ఇల్లు అమ్మెయ్యాలి కద! ఇంటిమీద వచ్చే నలభయి రూపాయిల ఆదాయంతో, నా జీవనం గడవటం కష్టమైపోతూంది కదా! ఇల్లు అమ్మేస్తే ఆ ఆదాయంకూడా వుండదు. ఇల్లంటూ వుంటే ఏ కొడుకుకయినా మాకిస్తాడంటే, మాకొస్తాడనే ఆశకలిగి నన్ను దగ్గర అట్టిపెట్టుకుందురు. ఏమాశా లేని ఏమీ ఇల్లులేని నిర్ధనుణ్ణి నన్ను ఎందుకని పోషిస్తారువాళ్లు?"

"నువ్వు పెంచి, చదువు చెప్పించి వాళ్ళ జీవితాలకో దారి ఏర్పరిచి నందుకిదేనా ప్రతిఫలం?" వసుంధర దుఃఖంగా అన్నది.

"ప్రతి ఫలాపేక్షతో, తల్లిదండ్రి సేవనీ చేయరు. అదీ వాళ్ళ కనీస ధర్మం. ఒక జీవిని ఈ ప్రపంచంలోనికి తీసుక రాగానే వాళ్ళ తిండి తిప్పలూ, చదువూ సంధ్యలూ, జీవితా వసరాలూ, చూడాల్సిన భాధ్యత కలుగుతోంది. ఈ బాధ్యత, ఒక్క మానవులకే కాదు. సమస్త ప్రాణికోటిలోనూ ఉత్పన్నమైంది. అదొక సాతోష శ్రమకరమైన జీవ భ్రిమణం. క్రిమికీటకాలకా, పశుపక్ష్యాదులుకూడా ఈ సృష్టి పెరుగుదలకి తోడ్పడు తున్నాయి. పిల్లలని రెక్కలొచ్చే దాక పెంచటమే బాధ్యత! రెక్కలు వచ్చిన పిట్టలు ఎగిరి పోతయ్! పిల్లలు మాత్రిం అంతే ఎందుకు కాకూడదూ?

తల్లిదండ్రులు పిల్లలని పెంచుతారు కాని, పిల్లలు తల్లి దండ్రులని పెంచటం, పెంచవలసి రావటం, ఒక్క మానవుల్లో తప్ప, మరే ఇతర ప్రాణికోటిలోనూ లేదు. నాకు డబ్బు లేదు. ఏ కొడుకు దగ్గరుంటే వాళ్ళకే అధికవ్యయం! ఇంకనీవు. నీకు ఆపేక్షవున్నా నీ భర్త కుండాల్సిన పనిలేదు. కొడుక్కి ఆపేక్షుంటే కోడలికుండదు. వుండాల్సిన అవసరంకూడా లేదు. ఈ వృద్ధాప్యంలో నిర్ధనత్వంలో వాళ్ళ సంసారంలో చేరి కలతలు కలగటానికి కారణం కావటం కంటే భగవంతుని సన్నిధిలో దొరికిన దేదో తింటూ కాలక్షేపం చేయటమే మంచిది. ఇహ పరసాధకం! భక్తి ముక్తి దాయకం. అందుకే మన పూర్వపు రాజులు, యువరాజులకి పట్టాభిషేకాలు చేసి వానప్రస్థాశ్రమానికి వెళ్ళి పోయేవారు."

"నీఇష్టం" అన్నది వసుంధర.

వసుంధరకి "తనఇష్టం" అన్నమాట చెల్లదు అని చిన్నప్పట్నించీ తెలుసును.

"నీ ఇష్టం" అనే అప్పుడొకసారి పెళ్ళైంది.

"నీఇష్టం" అనే తండ్రి నిర్గమనాన్ని మౌనబాధతో హృదయగతి మొనర్చుకున్నది.

"తల్లి గలప్పుడే పుట్టిల్లు! పాలుగలప్పుడే పరమాన్నం" అంటారు. వసుంధరకి ఆ రెండూ లేవు. అది జ్ఞానమణికి లోకువ.

"వాకిట్లో నించోకు! ఎవరన్నా చూసేరు." అనేది. జ్ఞానమణి లోపలికొచ్చేది వసుంధర.

"పోతుల్లాంటి అన్నలున్నారు. ఎందుకూ? వో నా

డన్నా వచ్చిచూడరు. వచ్చి పలకరిస్తే వాళ్ళ మొఖాసాలు దోచుకపోతామా"

"నిజమే మరి" అనుకునేది వసుంధర. నాన్న ఇల్లు తన గురించి అమ్మేశాడు. తనకు పెళ్ళిచేసి తనదారిన తాను వెళ్ళిపోయాడు. ఆ ఇల్లే వాళ్ళకిచ్చేసి తన పెళ్ళి బాధ్యత వాళ్ళమీద పెడితే, ఏమన్నా అభిమానం చూపుదు రేమో! కాని తండ్రి అలా చేయలేదు. అన్నలనించి తన్ని విడదీశాడు. గారాబంగా పెంచారు. చేతులతో పెళ్ళిచేశారు. అంతవరకూ సవ్యంగానే చేశారు. ఆయన అన్నీ స్వయంగా చేయటంతో అన్నలకి తనమీద జెలసీ గలిగింది. ఏ ముఖం పెట్టుకుని వాళ్ళ యింటికి వెళ్ళ గలదు.

"ఇప్పుడు పాడబోయేది" రామానుజం గొంతు మైక్‌లో విన్పించింది. చేతులో కాగితం వెంపు చూసుకు న్నాడు, రామానుజం లిస్టు. వ్రాసిచ్చింది, వసుంధర. 'తరంగం నారాయణ తీర్థులవారిది, వీక్షేకదా దేవ దేవం, రాగమాలిక, ఝంపెతాళం పల్లవి, ఆనందభైరవి తరువాత వరసగా బిలహరి, సింధూర, బేహాగ్, భైరవి, కేదారగౌళ, రాగాలలో పాడబడుచున్నది' అని కూర్చున్నాడు రామానుజం.

వసుంధర ప్రారంభించింది. 'సాక్షాన్మదనకోటి సౌందర్య భావం– గోపాలమూర్తిం–వీక్షేకదా దేవదేవం–'

వసుంధరకి, రాగమాలికలంటే ఇష్టం. ఎక్కువ ఇష్టం. సాధారణంగా కొంతమంది గాయకులు, భైరవి, అటతాళ వర్ణం, 'విరిబోణి' పాడతారు. వసుంధర నవరాగ

మాలికవర్ణం పాడుతుంది. తర్వాత అష్టరాగమాలిక 'నిత్య కళ్యాణి' పాడుతుంది. అదికాక ప్రతి కచ్చేరీలో కూడా, 'వారణమాయిరమ్' (ఆండాల్ స్వప్నం) 'కణ్ణినుల్ శిర్ త్తామ్బు' పాడుతుంది. రెండుకూడా రాగమాలికలే. మనోహరంగావుండే, ఆ రాగమాలికలు ఆమె పాడకుండా కచ్చేరీ పూర్తిచేయదు. ఇంద్రధనస్సు రంగులు ఎంత మృదువుగా, ఒకదానిలో ఒకటి ఎలా విలీనమవుతూ, నయనానందం కలుగచేస్తయ్యో, రాగమాలికల్లోని రాగాలుకూడ ఒక రాగంలో ఇంకొకరాగం మృదువుగా కలిసిపోతూ శ్రవణానందం కలుగచేస్తయ్!

రాగం - రంగూ, ఒకటి అదృశ్యం- ఇంకొకటి దృశ్యం. ఒకటి చెవికింపు - ఒకటి కంటికింపు. సంగీతంతో చిత్రకారుడికి అవినాభావ సంబంధం వుండితీరుతుంది. సంగీతం హృదయస్పర్శి! ఆ రసస్పందనలేనిదే చిత్రకారుని కుంచెలో కాంతుల రంగుల వెల్లివిరియవు.

"అద్భుతంగా పాడుతున్నారు. కాదూ!"

ప్రక్కనున్న జయలక్ష్మి అనగానే నాయకి ప్రకృతంలోకి వొచ్చింది.

"అవునవును" అన్నది నాయకి. పొరుగింటి అయ్యర్ల జయలక్ష్మికి సంగీతం అంటే భలే పిచ్చి. వాళ్ళక్కరిసి వాళ్ళు వాళ్ళు ఎక్కడికీ పంపరు. నాయకికి సంగీతం అంటే ఇష్టం వున్నా లేకపోయినా పదిమందిలో తిరగటం సరదా. జయలక్ష్మి సీజన్ టికెట్‌మీద నాయకిని తీసుకొచ్చింది. నాయకి

వసుంధర స్టేజ్ మీది లైట్ల వెలుగులో దేవతావిగ్రహంలా మెరుస్తున్నది. నాయకి వేడిగా నిట్టూర్చింది.

"ఈవిడ తన సవతి తల్లన్నమాట! ఎంత భాగ్యవంతు రాలు? ఆవిడ కడుపునే తను పుట్టివుండ కూడదూ? తనకి కూడా చదువూ సంగీతం చెప్పించును. వేలుకట్నంపోసి మంచి హోదాలోనున్న వాణ్ని అల్లుడుగా తెచ్చుకో నుండును! తను దురదృష్టవంతురాలు. కాస్తలో తప్పిపో యింది. ఆమెకూడా ముందు తన తండ్రి వదిలేసి నందులకు, దురదృష్టవంతురాలననే చింతించి వుంటుంది. 'సాధకమున పనులుసమకూరు ధరలోన' అన్నట్లు, ఆమె చేజారిన అదృష్ట రేఖకోసం చింతిస్తూ చేతులు ముడుచుకుని కూర్చోక తన అదృష్టం బయటపడటం కోసం మళ్ళీ ఒక్క ప్రయత్నం చేసింది. ఆ ప్రయత్నం విజయవంతమైంది. ఈతరాక మునిగి పోతున్నవాడు దొరికినదేదో ఆకూ అలమైనా సరే వూతగా పట్టుకుని తేలి ఒడ్డు చేరుకుందుకు ప్రయత్నిస్తాడు! ఒడ్డుచేరు కోవచ్చును. అదృష్టంబాగుంటే, ఫలవృక్షాలతో నిండిన తోట అవ్వచ్చును .. అతను తేలిన ప్రదేశం! దురదృష్టం లోంచి, అదృష్టం పుట్టుక వస్తుంది. చీకటి రాత్రిలోంచి ఉదయమైనట్లు! అసలు రాత్రి చీకటిగా వుంటేకాని ఉదయ కాంతి మనస్సుల్ని ఆహ్లాదపరిచేదిగా వుండదు!"

నాయకి ఆలోచిస్తోంది. ఆమె కన్నులు చెమ్మగిల్లు తున్నాయి. తన తల్లికేం మిగిలింది? ఆమె ఏం సుఖపడు తోంది. లేచినది మొదలు - పొయ్యిలోకి- పొయ్యిమీదకు ఎలారా భగవంతుడా అన్న జిజ్ఞాసే అమ్మకి! అంత అంద

మైన అమ్మకి అన్నానికూడా తడుముకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతోంది! నాన్న తననేం ఉద్ధరిస్తాడు? నాలుగు ప్రైవేట్లు చెప్పకుని, పైరాళ్ళు తెచ్చి ఆదాయం వృద్ధి చేసుకుందా మన్నా తెలుగు ట్యూటరాయె! తెలుగు సబ్జక్టు యెవరు ప్రైవేటు చెప్పించుకుంటారు? అమ్మకంతకంటెనూ! తను చదివిన స్కూల్ ఫయినల్ ప్యాసయి ట్రయినింగ్ అయితే శాస్త్ర చేదోడు వాదోడుగా వుంటుందిట. తనకి లెక్కలు బాగారావు. రెండుసార్లూ పోయింది. అమ్మకి తనమీద కోపం చదువుమీద శ్రద్ధ లేదని. ఇంక ఆపరీక్ష, ప్యాసవ్వటం తనవల్లకాదు. ఎంతకీ తమకి చదువు లంటటం లేదని గోల చేస్తారు. కానీ, పోనీ తగ్గ సంబంధాలుచూసి పెళ్ళి చేద్దా మన్న వూహేకలగదు అమ్మకీ నాన్నకీ! తన ఖర్మకొద్దీ పరీక్షలు పోవటంకూడా అంతే! పెద్దచెల్లి తంగమణి, హిందీ పరీక్షలు చదవకగదా, అని కట్టింది. రెండో చెల్లి అంబుజం శాస్త్రనయం! టైలరింగ్ నేర్చుకుంటోంది. బాగానే వస్తోంది. అమ్మను తలుచుకుంటే జాలీ, కోపంకూడా కలుగుతుంది. అస్తమానూ వంటింటికి అంకితమైపోతోంది. పాపం, నిస్సహాయురాలు. ఎంతనిస్సహాయురాలు కాకపోతే కోరికోరి సవతినియింటికి పిల్చుకురమ్మని ఏ స్త్రీ భర్తని వత్తిడి చేస్తుంది? ఉదయాన్నే. తన తల్లి, తండ్రితో చెప్తూంటే విన్నది నాయకి. వసుంధర తనకి సవతితల్లి అవుతుందని అప్పుడే తెలిసింది. జయలక్ష్మి అట్టే బలవంతం చేయకుండానే, ఆమె వెంట కచ్చేరీకి వచ్చింది.

"ఈమె, తమతో వుంటే బాగుండును" అనుకుంది

నాయకి. మళ్ళీ తనలో తనకి శుభ్రమైన బట్టలులేవు. నగల మాట కలలోని వార్త. ఈమె తమందరితో కలిసివుండి తను సంసార సాగరాన్నంతటినీ, ఈదకపోతేమానె, కనీసం తననైనా కూడా తీసుక పోతేబాగుండును. ఒక్కొక్క ప్రోగ్రాంకి వెయ్యి మొదలు పదివేలదాకా పుచ్చుకుంటుందట. ఎంత డబ్బు చేసుకుంటుంది! ఆవిడ కూడా వుండీ ఆవిడ పాడబోయే ప్రతీ పాటా ఎనౌన్సుచేస్తూండే, ఆ యువకుడెవరో పొడుగ్గా బాగానే వున్నాడు. బహుశా ఆమె అన్నగారి కొడుకయివుంటాడు. పెళ్ళి అయిందో లేదో! ఆ తంబురా శృతివేసే ఆమె ఏమవుతుందో! చుట్టాలయి వుంటారు. 'తెప్పలుగ చెరువునిండిన కప్పలు పదివేలు జేరు' అన్నట్లు ఆమెని అందరూ ఆశ్రయిస్తారు. తనుమాత్రం ఎందుకు ఆశ్రయించకూడదు! తను ఆమెకి సవతి కూతురు కాకపోతే బాగున్ను. ధైర్యంగా వెళ్ళి ఆశ్రయం కోరును. ఈ దిక్కుమాలిన బాంధవ్యంవల్ల తన్ని ఏమని అడగాలా అన్న సంకోచం, కలుగుతోంది. తనదొక వెర్రికాకపోతే, తన్ని అష్టకష్టాలు పెట్టి ఇంట్లోంచి, తన్నితగిలేసిన భర్త కూతుర్ని ఆమె ఆదరిస్తుందా? ఏమో! ఏ పుట్టలో ఏపాముందో ఎవరు చెప్పగలరు! తన్ని చూడగానే, ఆమెలో అభిమానం పుట్టుక రాకూడదా ఏమిటి? అదృష్టంబాగుంటే తన్ని ఆ శక్రటరీ అబ్బాయికిచ్చి పెళ్ళిచేసి, ఇద్దర్నీ తనదగ్గరే అట్టేపెట్టుకో వచ్చును. ఇంతకీ ఆ తంబురమ్మాయి, ఆ అబ్బాయి భార్యయితే! అయివుండదు. రెండుజడ లేసుకుంది ఆ అమ్మాయి. పెళ్ళయిన వాళ్ళు రెండుజడ లేసుకుంటారా? అన్నట్టు జ్ఞాపకం

వొచ్చింది. ఆ తంబురమ్మాయి అన్నకి బ ధ్యులేనట! ఇంటి కెళ్ళాక అమ్మని అడగాలి. ముందు ఈమె ప్రోగ్రాం అవగానే ఈమెని కలుసుకుని అడగాలి. ముందు ఈమె ప్రోగ్రాం అవగానే ఈమెని, కలుసుకుని ఏదయినా సహాయం చేయమని ప్రాధేయపడాలి!

నాన్న చేసినదానికి, తనేంచేస్తుంది? తను దుర్భర దీనావస్థ ఆమె కరిగిపోయేలా వర్ణించి చెప్పాలి. ఎలానో అలా ఆమెని తను ఇంటికి తీసుకపోవాలి. అమ్మ నాన్నతో చెప్పింది కాని, తనకి మటుకు. నాన్న ఆవిడ్ని బతిమాలుకుని ఇంటికి తీసుక వస్తాడని నమ్మకం లేదు. ఏమయినా మగవాడు కదా! వదిలేసిన భార్యని, ఇవ్వేళ రెండుచేతులా ఆర్జిస్తాం దని ఎలా బతిమాలతాడు? అబ్సర్డ్! అలా చేయడు తన తండ్రి! బియ్యం లేకపోతే, పొరిగింటికెళ్ళి అప్పైనా తేని వ్వాడు! అలాంటిది, ఆమెని ఎలా బతిమాలుతాడు? అమ్మ సాధింపు పడలేక వొచ్చాడంతే! కన్చేరి, కాగానే తన మానాన్న తను వెళ్ళిపోతాడు నిశ్శబ్దంగా! అందుకే, ఈమెని బతిమాలి, బామాలి, తమ ఇంటికితీసుకుపోయి అమ్మకి అప్ప చెప్పే బాధ్యత తనమీద వుంది. ఇంటికివచ్చి, తను అయిదు గురప్పచెల్లెళ్ళనీ, తల్లినీ. చూస్తే ఆమెకి, జాలి, తనంతట దే కలుగుతుంది. కలిగి తీరుతుంది. ఆమెది మాత్రం స్త్రీ హృదయం గాదా? స్త్రీని స్త్రీయే ప్రేమించి, ఆదుకోలేకపోతే ఇంక ఎవరు ఆదుకుంటారు? స్త్రీ సహజంగా కరుణామయి! పురుషులకున్న కఠినత్వం, స్త్రీ కుండదు ఆమె తప్పక తమతో కలిసి తీరుతుంది.

నాయుకి మనస్సు తేలిగ్గా, దూదిపింజల్లే ఎగురుతూంది సంభవా సంభవాలు ఆ పిల్లకి తెలియవు. తన తండ్రికీ, ఆమెకీ, మధ్య యెందుకింత అగాధం కల్గిందో, ఎందుకని, ఆమె వొంటిగా నిస్సహాయుంగా ఈ విశాల ప్రపంచంలో పయనించాల్సి వచ్చిందో, ఆ కన్నె మనస్సుకి, అర్థం అవదు. వయసుతో కాని, లోక పరిశీలన అలవడదు. కలల నిలయమైన నాయు! కన్నెవయస్సు, వసుంధర గాన స్రవంతిలో తేలిపోతోంది

టప్ టప్ టప్.........

మళ్ళీ చప్పట్లవర్షం ప్రారంభమయింది. అప్పుడొక్కసారి కునికిపాట్లుపడుతున్న వాడల్లా ఉలిక్కిపడి తీక్షణంగా కూర్చున్నాను. పదకొండున్నర! వసుంధర ప్రతి కీర్తనా పూర్తి చేసినప్పుడల్లా సభికులు మైమరచి, ఆదేపనిగా చప్పట్ల వర్షం కురిపిస్తున్నారు. నగరంలోని ప్రసిద్ధగాయక గాయనీ మణులు, ముందు వరుసల్లో కూర్చుని, వసుంధర పాడే ప్రతీ సంగతికి శేభష్ శేభష్ అంటూ మెచ్చికోలుగా తలలూపుతున్నారు. గంటన్నరసేపు హనుమత్తోడిలో రాగం తానం పల్లవి పాడింది. పాట్రన్స్ చైర్స్‌లో కూర్చున్న కొంతమంది సంగీత ప్రియులు చీటీలలో, ఫలానా కీర్తన పాడమని వ్రాసి స్టేజ్ మీదకు వాలంటీర్ చే పంపుతున్నారు.

వాలంటీర్లు, కార్యదర్శి కూడా స్టేజ్ మీదకు వొచ్చి, కొ. చం "పాలు" పుచ్చుకొమ్మని వసుంధరని అడిగారు. వసుంధర వద్దన్నది. ఆమె గానం మధ్యలో ఏమీ పుచ్చుకోదు. రామానుజం వాలంటీరు తెచ్చిన ఒకచీటినిచూపాడు.

అందులో అమృతవర్షిణి రాగములోని దీక్షితార్ కీర్తన పాడవలయునని కోరబడినది. రామానుజం వసుంధరతో అన్నాడు.

"అమ్మా మీకు ఈ కీర్తన సాధకంలో వున్నదా?"

"లేకేం! పాడుతోంటే అదే జ్ఞాపకాని కొస్తుంది" అన్నది వసుంధర. పదివేలు ఆమెలోని నిర్లిప్తతని గ్రహించాడు. వసుంధర ప్రోగ్రాం ముందర రిహార్సల్ చేసుకోదు. ఆమెకిష్ట మయినవన్నీ పాడేస్తుంది. అపయిన శ్రోతలు కోరిన వేవైనా జ్ఞాపకం వుంటే పాడేసి మంగళం ఎత్తుకుంటుంది అవ్యవధానంగా! ఒక్కసారి శ్రోతలు గతుక్కు మంటారు. బయట చీకటిగా చలిగా వర్షంగావుంది. సభికులు వసుంధర గానం కోసం ఎదురుచూస్తున్నారు. రామానుజం మైక్ ముందర నించుని చెప్పసాగాడు.

«బయట జోరెడు వర్షం కురుస్తున్నది. అయినా సభికులు అమృత వర్షిణిరాగ కీర్తన పాడమని కోరుతున్నారు ఇప్పుడు. 'ఆనందామృత వర్షిణి' అన్న దీక్షితులవారి కీర్తన అమృత వర్షిణి రాగములో పాడుతారు. ముద్దుస్వామి దీక్షితులవారు. పద్దెనిమిదో శతాబ్దివారు శ్రీ విద్యోపాసకులు. ఈయన నవగ్రహ కీర్తనలు, నవావరణ కమలాంబా కీర్తనలు, మిక్కిలి ప్రసిద్ధి పొందాయి. ఈయన ఎట్టయపురానికి వెళ్ళుతూ, మార్గమధ్యంలో బీటలువారి వున్న నేలలో ఎండి వున్న పైరుని చూసి, ఆకాశము వైపుచూసి, కూడా వున్న శిష్యులకి అమృతవర్షిణి రాగములో ఈ కీర్తనను చెప్పుచుండ,

అంతవరకూ దిన్నగావున్నా ఆకాశంలో ఎక్కణ్ణుంచో పరుగులెత్తుతూ వచ్చిన నీలమేఘాలు, జల్లుజల్లుమని వర్షించ నారంభించాయట! వీరిముద్ర 'గురుగుహ'. ఈయన అన్ని దేవతలమీదను గీర్వాణ భాషలో కీర్తనలు రచించారు" అని చెప్పటం పూర్తిచేసి చేయకుండానే, వసుంధర కీర్తనని ఎత్తుకుంది.

దూరంగా ఠాణాలో, పన్నెండుగంటలు కొట్టటం వినిపించింది. చూడికుడుత్తమ్మకి చటుక్కున మెలుకువ వచ్చింది. నులకమంచంమీద కాస్త ప్రక్కకు వొత్తిగిలి చూసింది. నులక, వంటికి గట్టిగా వత్తుకుంటోంది. నాయకి తప్ప మిగిలిన పిల్లలంతా క్రింద గోనెపట్టా పరుచుకుని పడుకుని నిద్రపోతున్నారు. వాళ్ళని చూసి గాఢంగా నిట్టూర్చింది, చూడికుడుత్తమ్మ. నల్లులు తెగజేరాయి మంచం పట్టెలనిండా! అరటి దూడలాంటి చూడికుడుత్తమ్మ చేతుల నిండా కందగిజ అంత దద్దుర్లు లేచాయ్! లేచి మంచం నడుంగా కూర్చుంది, చూడికుడుత్తమ్మ. ఆవలించి చిటికెలు వేసింది.

"తండ్రీ కూతుళ్ళు ఇంకారాలేదు" అనుకుంది.

"ఇంతకీ ఆమె నింటికి తీసుక వస్తారో, లేదో! ఆమె వస్తుందా! ఇన్నాళ్ళకి భర్త మళ్లీ రమ్మంటుంటే రాకుండా వుండగలదా? ఎంత వేలు సంపాదిస్తున్నా భర్తతో వున్న గౌరవం సాటివస్తుందా? ఏమో నరంమీద వుందూ నరమంత్రపుసిరీ అన్నారు. బాగా డబ్బుతో కొవ్వెక్కిపోతూన్న

ఆమెకి ఈ అణాపరక భర్త నీడన వుందామన్న ఆసక్తి వుంటుందా? అదంతా పూర్వకాలం వాళ్ళకి భర్త ఎంత హింసపెట్టినా కిక్కురు మనకుండా వాళ్ళ దయా దాక్షిణ్యాలకోసం తపించి పోతూండేవారు. ఇప్పుడంతా తెనుగు మీరి పోయారు. మబ్బు విడిచిన ఎండల్లే, చితచిత లాడుతూ వెలుగుతున్నారు. ఏ రంగాల్లో చూసినా భర్త వొదిలేసిన స్త్రీలే! కాస్తయినా లజ్జలేదు వాళ్ళకి! స్త్రీకి లజ్జే అంద మిస్తోందనే వారు పూర్వులు. ఇప్పుడు నిర్లజ్జే అందమిస్తోంది. ఎంత వళ్ళు కనపడేటట్లు గుడ్డలు కట్టుకుంటే అంతఫాషన్ ! అసలు దురదృష్టమంతా తన్ను వరించింది. చిన్నప్పుడంతా బంధువుల్లో చురుకైనది, అందమైనది– అని తను పేరు పడింది. పెళ్ళయిన కొత్తలో, కాలేజీలోని, స్టాఫ్ అంతా తన్ని చుట్టానికొచ్చారు. ఎందుకొచ్చిన అందం? అడుక్కు తిన్న అందం? అందం హాలివుడ్‌లో అరణాలకి అమ్ముతారు అని చిన్నప్పుడెప్పుడో చదివినగుర్తు! నిజంగా చూస్తే తన పరిస్థితి అల్లానేవుంది. "రెండో పెళ్ళి" అనగానే, తనకి వంటి నిండా నగలూ, జరీపట్టుచీరలూ, జ్ఞాపకానికొచ్చాయ్, వాటి వరసనే దగ్గుతూ, దగ్గుతూ బాధపడే అరవయివ్వేళ్ళ భర్త కూడా నిలబడ్డాడు. కాని తను అనుకున్న దేదీ కాలేదు. వంటి నిండా నగలూ ఇంటినిండా జరీపట్టు చీరలు లేవు. అరవయి వేళ్ళ భర్తాకాదు! ఇరవయి నాలుగేళ్ళ యువకుడే భర్త. ఒక అత్తగారూ! చిన్న ఇల్లూ! చిన్న ఉద్యోగం! ఈయనకి రెండో పెళ్ళి ఎందుకు చేయాల్సివచ్చిందో తన అత్తగారు

తనతో చెప్పలేదు; పెళ్ళిచేసిన తన తాతయ్యా చెప్పలేదు! చేసుకున్న భర్త మాత్రం "ఆమె చూడ తగ్గమనిషికాదు! విన తగ్గగుణము కలదికాదు" అన్నాడు. అప్పుడు తనందానికి తనే మురిసింది. ఆ మురిపాల ముద్దుల మూటలే ఈ పంచ కన్యకలూ! అదేమిటో ఖర్మ! ఒక్క పిల్లకీ తన పోలికే రాలేదు! అందరూ తండ్రి పోలికే!ఎత్తుగావత్తుగావుంటారు. అందం లేదు! చదువు అంటటంలేదు! ఎల్లా వీళ్ళని ఒకయ్య చేతిలో పెట్టాలో అర్థంకావటంలేదు! కట్నాల గలగలల్లో వీళ్ళ రూపాల్ని దాయొచ్చు అనుకుంటె, ఇంట్లో "కాసీ" నిలవలేదు. "పిట్టను గొట్టా పొయ్యిలో పెట్టా!" అత్తగారు బహుదొడ్డ మనిషి. చేయించు కున్నన్నాళ్ళు అల్లిబిల్లి అప్పాలు చేతిలో పెట్టి చాకిరీ చేయించుకుని, ఆమె దారిన ఆమె వెళ్ళిపోయారు. ఎలా ఈ సంసార సాగరాన్ని ఈదుకు రావాలోన్న అర్థం కావటంలేదు. పిల్లలా తెలివైన వాళ్ళు కారు. అంటే వెర్రిాళ్ళని కాదు. ఈ కాలపు పిల్లల కుండా ల్సిన లక్షణాలు లేవు. అదే మరొకళ్ళు అయితే ఈ పాటికి ఎవర్నో ఒకర్ని ప్రేమించి పెళ్ళాడేద్దురు. వీళ్ళకి ఆ విజ్ఞానం కూడా లేదు. అక్కడికి ఎందుకైనా మంచిదని వీధరుగు మీదున్న చిన్న గదిలోని సామాన్లు అన్నీ అటక మీద పడేసి, కాలేజీ స్టూడెంట్లకి అద్దెకిచ్చింది. వాళ్ళు నూతిదగ్గర స్నానం చేస్తోన్నప్పుడల్లా ఏదోవంకని, నాయకినో, తంగాన్నో, అంబుజాన్నో, పంపుతుంది. కాని ఏంలాభం? వీళ్ళని చూడగానే ఆ కుర్రాళ్ళు అపర శ్రీరామచంద్రుల వారిలా, కాస్త కన్నెత్తి చూస్తేనే పన్నెత్తి పల్కరిస్తేనే

వాళ్ళ ఏకపత్నీ వ్రతం భంగపడేట్లు ప్రవర్తిస్తారు. బుద్ధిమంతులు. అక్కడికీ తను ధనుస్సు చేస్తోన్న నెలరోజులూ వాళ్ళకి ప్రసాదం పెట్టుతోనే వుండేవి. అంతా తిని ఏటికేడాదీ తిని మంచిగా మాట్లాడుతూన్నట్లే నటించి ఒక శుభ ముహూర్తాన్న అయిదు వేల కట్నంతో ఒక "కాకిపిల్ల"ని కట్టుకొచ్చి వేరే కాపురం వున్నాడు పొరుగింట్లో మాణిక్య వేలు! వాడన్నయ్య వడివేలు పెద్ద బిరుదు తెచ్చుకున్నాడు వయొలిన్ వాద్యానికి. ఇంకా పెళ్ళి పేరంటం లేదు. వసుంధరని వెంటేసుకుని తిరుగుతున్నాడు. వాళ్ళ మధ్య అక్రమ సంబంధమేమీ లేదంటాడు మాణిక్యవేలు. లోగుట్టు పెరుమాళ్ కెరుక! వసుంధర తన సవతి అని మాణిక్యవేలుతో తనెప్పుడూ చెప్పలేదు. అసలు అందరూ వసుంధర తన సవతి అని మర్చిపోయి వుంటారు. ఆమెని ఎల్లానో తమతో వుండేట్లు వొప్పిస్తే, వడివేలుకి నాయకిని ముడిపెట్టెయ్యొచ్చును. నలభయి ఏళ్ళు దాటివుంటాయ్ వడివేలుకి! అయితేం? బోలెడు ఆర్జిస్తున్నాడు. వొప్పుకోవాలి! పెరుమాళ్ళ దయవల్ల! తన దురదృష్ట దుర్భర జీవితంలో, ఈ పిల్లలే ఆశా రేఖలు! వాళ్ళ జీవితాలని ఒక దరికి చేర్చాలి! తను కంటినిండా నిద్రపోవాలి చిన్నప్పట్నించీ అందమైనది, చురుకైనది అని పేరుపడిన తను నేల చింతకాయలు కాస్తూ కూర్చుంది. అనాకారిదీ, మొద్దుస్వరూపమూ అని నిత్యం వర్ణించేది తన అత్తగారు వసుంధరని. అల్లాంటి వసుంధర, తన భర్తచేత తిరస్కృతయైన వసుంధర, అన్నగార్లు ఆదరించని వసుంధర, ఈరోజు వేలు సంపాదిస్తో, ఆకాశంలో

పాలపిట్టలా పేరు ఎగిరిపోతూంటే నిత్యం తనచుట్టూ, పది మందిని త్రిప్పుకుంటూ జీవిస్తోంది. ఆమె తన భర్త క్రిందనే వుంటే, తనలాగే కూటికీ, గుడ్డకీ, ముఖంవాచిపోతూండును. ఆమె తన భర్తక్రింద వుంటే తను ఆయన్ని పెళ్ళాడవలసిన అవసరం రాకపోను. తన అందానికి, ఏ కలక్టరో, వరించ వచ్చును. అందమైన అమ్మాయిలకు పెళ్ళికాదనే భయం వుంటుందేమిటి? ఆరోజుల్లో తాతయ్య భయంకొద్దీ జ్ఞానమణి అడిగీ అడగ్గానే, ఈయనకిచ్చి పెళ్ళిచేశారు. అంతా తెలుగు ట్యూటరుగారి భార్య అప్సరస అని ఆ రోజుల్లో చెప్పుకుని ఆనందించినవారే కాని ఆనందించని వారులేరు. ఇంతకీ తన ఖర్మ ఇలా వ్రాసి పెట్టాడు పెరుమాళ్ళు. ఇంక ఇప్పుడు తన కర్తవ్యం ఈ పిల్లల్ని పైకితీసురావటమే. తనలో ఏం మిగిలి లేదు. ఇంకా, ఈయనగారు రాలేదే? కొంపతీసి ఆమె వెన కాతల తాళంవేస్తూ వెళ్ళిపోయారేమో! తన పిచ్చికాని, అంతగా దూషించి బయటకు గెంటేసిన భర్తనీ సవతి పిల్లల్నీ ఆమెఆదరిస్తుందా? లోకంలో ఎక్కడన్నా వుందా? తను ఆర్జించిన ఆర్జన సవతి పిల్లలకి, తన సుఖాలన్ని దూరం చేసిన సవతి పిల్లలకి ఇస్తుందా! కల్లోనివార్త! కాకపోతే, ఆయనవెంటవస్తేతీసుకుపోతుంది. అవును. తప్పకుండాఅల్లానే చేస్తుంది. ఆయన తన్ని ఎన్ని బాధలు పెట్టినా ఎంతగా అవమానపర్చినా, ఆయనతో వుంటం వల్ల ఆమెకొక విశేష గౌరవం వుంటుంది. ఇంక ఈయన తన సంసారంతో వేగ లేకుండా వున్నారు. ఆమె దగ్గరుంటే, కాలుమీద కాలు వేసుకుని దర్జాగా కష్టపడకుండా కాలం గడిపేయొచ్చును

అంచేత నిశ్చింతగా ఆమెరమ్మంటే వెళ్ళిపోతారు. అయ్యో ఎంత తెలివితక్కువది తను? చేతులారా అప్పగించేసిందన్న మాట! ముందాలోచన లేదు తనకి. ఇంతకీ డబ్బుకాపీనం తప్ప ఏం జరుగుతుందో, అన్న విచక్షణా జ్ఞానం తనలో శూన్యం. ఏమో! ఆమె మాత్రం స్త్రీ కాదా? తనకి అలభ్యమైన, ఆనందం, తను ఏ ఆనందం కోసం అలమటించి పోతుందో ఆ ఆనందం, సాటి స్త్రీనించి పూడలాక్కుంటుందా? తన ఉసురు ఆమెకి తగలదా? పిల్లలతల్లి యొక్క ఆక్రందన ఆమె శరీరాన్ని పుడికించి వేయదా? స్త్రీయొక్క సంసారిక బాధనీ తాపత్రయాన్ని అర్థం చేసుకోలేకపోతే, ఇంక పురుషులు తమని అర్థం చేసుకోలేదని గోత్తటంలో అర్థం ఏ ముంది!"

చూడికుడు త్తమ్మ మల్లగుల్లాలు పడుతూంది. కిటికీ లోంచి, వర్షం ధారలు ధారలుగా కారుతూ జలతారు దారాల్లా కనపడుతోంది. అప్పుడోకకారూ, ఇప్పుడో కారూ జర్రుమంటు, బర్రుమంటూ, నీళ్ళు చిమ్ముకుంటూ పోతున్నాయ్. వెళుతున్న ప్రతీ కారూ తమ ఇంటి ముందరే ఆగుతున్నదనీ, అందులోంచి తన భర్తా, కూతురు, వసుంధరా దిగుతారనీ ఎదురుచూడసాగింది చూడికుడు త్తమ్మ. ఆమెలోని మాతృత్వపు మహోన్నత కాంతు తడిసిపోతూన్న వర్షంలో చినిగిన కాగితపు తూరీగలా ఎగురుతూంది.

వసుంధర "రాధికాక్రిష్ణా, రాధికా తవవిరహే కేశవా" అన్న అష్టపదిని పాడటం పూర్తి చేసింది. అష్టపదిని కొందరు 'మోహన' లోను కొందరు 'కానడ'లోనూ పాడే

వారు. వసుంధర పల్లవి కమాసులో మొదలు పెట్టి అన్ని తలొక రాగంలో పాడి అంకితం షణ్ముఖప్రియతో పూర్తి చేసింది. ఎవరో ఒక "భావగీతమైనా పాడాలి." అని చీటి పంపేరు. సాధారణంగా కర్ణాటక సంగీత గాయకులు, వర్ణం రాగం, తానం, పల్లవి కీర్తనలు జావళీ తిల్లాన వరసక్రమంలో పాడుతారు. ఈ మధ్యన పాడేవాళ్ళు, కబీర్, తులసీదాస్, మీరా, సూరదాస్ మున్నగువారి భజన్స్ కూడా పాడుతున్నారు. రామానుజం చేతికిచ్చిన "లిస్ట్"లో ఆఖరున "బీత్ కయో దిన్ భజనబినా తే" అన్న కబీర్ భజన వ్రాసివుంది. రోజు లన్నీ భగవద్భక్తి లేకుండానే గడిచి పోతున్నాయన్న ఆవేదనాపూరిత నివేదన ఆ గేయం వసుంధర ఎదరకు చూసింది. స్టేజిముందర వడివేలు తమ్ముడు మాణిక్యవేలు నించున్నాడు. వడివేలు తమ్ముణ్ని స్టేజి మీదకు పిలిచాడు.

"వాళ్కడివే వొచ్చావా!" అని అడిగాడు.

"అవును! అవిడ పుట్టింటికి వెళ్ళింది. పెళ్లికయినా వస్తావనుకున్నాను. ఎందుకని రాలేదు?"అన్నాడు మాణిక్య వేలు.

"తీరిక లేదు! ఆ సమయానికే త్యాగబ్రహ్మోత్సవాలు జరుగుతున్నాయి." అంటూ వసుంధర కేసి చూసి,

"తమ్ముడు మాణిక్యవేలు!" అని పరిచయం చేశాడు.

"అల్లాగా! కులాసాగా వున్నావా? పదేళ్ళ పిల్లాడప్పుడు చూశాను. మళ్ళీ ఇప్పుడు చూశాను." అన్నది వసుంధర.

మాణిక్యవేలుకి వసుంధర తమవూరిదని తెలుసును. కాని అప్పాదొరైభార్య అని తెలియదు.

"ఏదీ! అప్పట్నుంచీ మీరిటుకేసి రాకపోతిరి. ఎట్లా చూస్తారు? రాఘవేంద్రంగారుకూడా అదే అనేవారు _ మన వూరిలో పుట్టి పెరిగిన ఆమె అయ్యుండీకూడా ఆమెఎప్పుడూ ఇక్కడ ప్రోగ్రాంస్ ఇవ్వటానికి ఒప్పుకోరు, అని ఆయన ఎంతో బాధపడేవారు. ప్రతీ దసరా గాన సభలకీ, మమ్మల్నడిగి లేదనిపించుకోకుండా డిసైడ్ చేసేవారు కాదు. ఇన్నాళ్ళకి మీకు మన నగర ప్రజలమీద అభిమానం కల్గింది!" అన్నాడు మాణిక్యవేలు.

"శ్రీమతిని పరిచయంచెయ్యవా?" అంది వసుంధర "లేదు! పుట్టింటికి వెళ్ళింది. మీగానం వినే అదృష్టం వుండొద్దూ దానికి? ఎప్పుడూ ఎక్కడికీ రాని, సంగీతం అంటే సుతరామూఇష్టంలేనిఅప్పాదొరైకూడావొచ్చాడు."

మాణిక్యవేలు ధోరణిగా తన భార్యయొక్క, సంగీతాభిరుచి గురించి చెప్పుకపోతున్నాడు.

"ఆయన వొచ్చారన్నమాట !"

కోపం, దుఃఖం, జల్లుమనిపించాయి_వసుంధర శరీరాన్ని అవ్యక్తబాధతో. ఆమె హృదయం కుమిలి పోసాగింది, ఇరవయి ఏళ్ళ తర్వాత. తను పుట్టి, మెట్టిన వూరికి రావడంలో వున్న ఆనందం ఆమెలో నిబిడీకృతమైన అజ్ఞాత వేదన తిరగతోడింది, ఆ కుమిలింపులోనే.

మరొక పాట అడగటానికి అవకాశ మియ్యకుండానే "మంగళం మారమణనిగె, జయమంగళం మారమణనిగె" అన్న సురటిరాగ మంగళహారతి ఎత్తేసుకొంది. హాలంతా కలకల్లాడుతూ ఉద్వేత్తుగా లేచిపోయారు. పెద్దా, పిన్నా, ఆడా, మగా, అన్న వివక్షతలేకుండా అందరూ స్టేజ్ దగ్గర గుంపుకూడారు. వసుంధర కాళ్ళు వణుకుతున్నాయ్. ఏదో అనిశ్చిత భయం ఆమెని ఆవరించింది. ఎలాగో నిలవరించుకుని లేచి, అందరకూ తలవంచుకుని, రెండు చేతులూ జోడించి నమస్కారంపెట్టింది. అప్పాదొరై గేట్లోకి వెళ్ళనించున్నాడు. స్టేజ్ మీద ఆమెని కలుసుకుని మాట్లాడేందుకు చిన్నతన మనిపించింది. నాయక్కి, వెళ్ళి మాట్లాడాలనుకుంది. కాని, జయలక్ష్మి "కళ్ళు కూరుకు పోతున్నాయే బాబూ! నీ కంతగా ఆమెతో మాట్లాడాలని వుంటే ప్రొద్దుట ఆమె బసచేసిన చోటికి తీసుకవెళ్తాను" అంది.

అది సబబుగానే తోచిందినాయక్కి. బసలో అయితే కాస్త తీరిగ్గా తమ కుటుంబ విషయాలు మాట్లాడుకో వచ్చును.

"అయితే ఆమె ఇంకా వుంటారా ?"

"వుండక? రేపు రక్షణనిధికి, జూబ్లీ హాలులోనూ, అశోక లైబ్రరీ భవన నిధికి, చంద్రా మాన్షన్స్‌లోనాలుగో తారీకునా ఆమె ప్రోగ్రాంస్ వున్నాయి. ఇంకా గవర్నమెంట్ కాలేజీ, ఆర్ట్సు అసోసియేషన్ వాళ్లు సన్మానాలు చేస్తారుట వెంకటేశ్వర హాలులో! ఇంకా వారం పదిరోజుల దాకా గుక్కతిప్పుకోలేనన్ని కార్యక్రమాలు. ఈ చుట్టు

ప్రక్కల అయిదారు వూళ్ళల్లో వున్నాయట. అందాకా చంద్రా మాన్షన్స్‌లో వుంటారు" అన్నది జయలక్ష్మి. మాట్లాడకుండా నాయకి జయలక్ష్మితో రిక్షా ఎక్కేసింది.

జనం ప్రవాహంలా కదులుతున్నారు. ఆ ప్రవాహాని కఠితంగా స్థాణువల్లె నించున్నాడు అప్పాదొరై! వర్షం వెలిసినట్లుంది! ఒక్కటి చీకటిముద్దల్లా వున్న మేఘాల కద లిక ఆకాశంలో అస్పష్టంగా కనబడుతున్నాయ్. రోడ్డు కావలవున్న చెట్ల గుబుర్లలోని మిణుగురు పురుగులు, పులుకూ పులుకూ మెరుస్తున్నాయి. అంతటినిశిరాత్రిలోనూ, వర్షపుచలిలోనూ, రిక్షావాళ్ళు ప్లాస్టిక్ కాగితం చొక్కాలు తొడుక్కొని కాలు బయటనించున్నారు. జనం వర్షపురాత్రి అవటంనుంచి, అట్టే బేరాలాడకుండా రిక్షాలు ఎక్కిపోతు న్నారు.

ఎన్నో రకాల ప్రశంసలు, ఆకాశంలోకి ఎగురు తున్నాయి. అప్పాదొరై అద్భుతపడ్డాడు. అందరూ ఆమె గానాన్ని రకరకాల ప్రశంసలతో ఆకాశానికెత్తేవారేకాని, ఒక్కరూ ఆమె ఆంతరంగిక జీవితంగురించి ప్రస్తావించటం లేదు. అప్పాదొరై "ఆఁ! దానిదేముంది? అందరూ ఆమె గానంకోసం వచ్చినవాళ్ళవటంనించి, ఆ గానం వాళ్ళకి నచ్చినదవటంనించి, ఆమాటలే, ఆ గానాన్ని కూర్చిన ప్రశంసలే మాట్లాడుకుంటున్నారు, మామూలువాళ్ళకి, ఆమె భర్త వొదిలేసిన స్త్రీయని తెలియకుండా వుంటుందా? ఎంత గొప్ప ప్రసిద్ధిచెందిన గాయని మణియైపోయినా, ఆ

చెడ్డపేరు 'భర్త వాడిలేశాడు' అనే పేరు పోతుందా? తెగిన గాలిపటంలా, గాలి వాటుకి ఆకాశంలో విహరిస్తోన్నా ఎప్పటికయినా నేలవ్రాలాల్సిందే కదా !" అనుకున్నాడు. అతని మనస్సు ఎందువల్లనో వసుంధర ఉన్నతిని సహించలేకపోతోంది. ఏదో కచ్చగా వసుంధరని ఎదుర్కొని, నాలుగూ కడిగేద్దామన్న దురూహ అతనిలో పాలుపోసుకుంటోంది. జనం పల్చబడ్డారు. వెనకగా, వసుంధర, రామానుజం, విమలాదేశికన్, వడివేలు, అయ్యాప్పిళ్ళ, 'చంద్రా మాన్షన్స్' యజమాని వాసుదేవన్ వస్తున్నారు. మాణిక్యవేలు, అంతదూరంనించే అప్పాదొరై గేట్లోనించో టంచూసి;

"అదుగో! వారు నిలుచోనున్నారు. నాకోసమే అయ్యుంటుంది" అన్నాడు. వసుంధర చూసింది. కాలు ముందుకు సాగలేదు. అయినా మొండిగానే కదుల్తోంది. మాణిక్యవేలు, గబగబా, అప్పాదొరైని సమీపించేడు.

"కాస్త తాళుకో! వాళ్ళు వస్తూన్నారు. ఆమెని పరిచయంచేస్తాను" అన్నాడు. అనుకోని సంఘటనకాదు అప్పాదొరైకి! మాణిక్యవేలు పరిచయం చెయ్యకపోయినా, కల్పించుకు మాట్లాడాలనే వుద్దేశ్యంలో వున్నాడు. వాళ్ళు సమీపించగానే, "ఇతను మాపొరిగింటాయన అప్పాదొరై! కాలేజీలో తెలుగు ట్యూటరు!" అని పరిచయంచేశాడు. మాణిక్యవేలు వసుంధర తక్క మిగిలినవారందరూ నమస్కారాలు చేశారు. వసుంధర మౌనంగా నించుంది.

«సీతతో మాట్లాడాలని వుంచున్నాను» అన్నాడు అప్పాదొరై.

"ఇక్కడ!" అంది వసుంధర.

అప్పాదొరై ఏకవచన ప్రయోగానికి అందరూ విస్తుపోయారు. 'ఆమె ఈ వూరిలో పుట్టి పెరిగింది. అంచేత అతనికి ఆమె, తెలిసుండొచ్చును' అని సమాధాన పడ్డారు. వారిరువురి ఆంతరంగిక జీవితం వాళ్ళకి తెలీదు.

"ఇంటికి! రా" అన్నాడు అదోరకం మందలింపుగా. తీక్కగా ధ్వనించింది గొంతు.

వసుంధర హృదయం వుడికిపోయింది. అదే గొంతు, ఇరవయి ఏళ్ళక్రితం తనతో సహా అగ్ని ప్రదక్షిణ చేస్తూ పవిత్ర మంత్రాలు చదివింది. అదే గొంతు 'నీ ముఖం నాకు కనబడకూడదు. ఇంట్లోంచే పో! నీకు దిక్కున్నచోట చెప్పుకో!' అని గర్జించింది ఎందుకని?

వసుంధర తండ్రి ఇల్లు అమ్మేశాడు. ఆరువేల రూపాయ లొచ్చాయ్! అప్పు తీర్చేసి, మిగిలిన డబ్బు పుచ్చుకుని తీర్థయాత్రలకి వెళ్ళిపోయాడు. జ్ఞానమణి జ్ఞాననేత్రం విప్పి చూసింది. 'ఏం, కొడుకులు పెట్టకపోయినంత మాత్రాన్న దిగడిందా? ఆ నాలుగు డబ్బులూ ఏ బ్యాంక్ లోనో వేసుకుని, నీ దగ్గరుండకూడదా!' అన్నది కోడలితో.

"ఆయనిష్టం! నే చెప్పితేవింటారా?" అంది. ఆయన డబ్బుమీద తన అత్తగారికి అపార ప్రేమని తెలుసును వసుంధరకి.

"ఎందుకు వినరు! మనకి మటుకు జబ్బాలు దొర్లిపో తున్నాయా? ఆ నాలుగు రాళ్ళున్నాయంటే, నగో నట్రో చేయించి పడేస్తే తీరిపోలా? పీనాసి వెధవ! ఏం, కట్టుక పోతారా ఏం?"

తన్ని యెన్నిఅన్నా మౌనంగా భరాయించేది వసుంధర. కాని తల్లిలేని తన్ని, అన్నలకి అప్పచెప్పితే, ఏం బాధలు పెట్టుతారో అని, తన్ని తల్లీ తండ్రీకూడా తనే అయి పెంచి వీళ్ళు అడిగిన కట్నాన్ని లేదనకుండా ఇచ్చిన తండ్రిని, అత్తగారు నిందిస్తోంటే వినలేకపోయింది.

"ఆయన డబ్బు ఆయన ఇష్టంవొచ్చినట్లు చేస్తారు. మీ కెందుకని? మీకివ్వాల్సినది ఇచ్చారుకదా! ఇంకా ఎందుకని తిట్టారు!" ఉక్రోషంతో అనేసింది వసుంధర.

"వుత్తినే ఇచ్చాడా ఏమిటి! మూడువేలన్నా లేందే నీ మొద్దుముఖాని కెవరు వస్తారు పెళ్ళాడదామని? సిగ్గులేక పోతే సరి! నలుగురు దున్నపోతుల్లాంటి అన్నలుండీ ఒకనా డన్నా, ఒక గుడ్డముక్క పెట్టారా?" సాగదీసింది జ్ఞానమణి. భర్త కిష్టంలేని భార్య ఇంట్లో అందరికీ లోకువే!

"మూడువేలతో నా మొద్దుముఖం, ముద్దుముఖంలా మారిపోయింది గాబోల్ను!" వెనకాతల నించున్న అప్పా దొరైని చూడలేదు వసుంధర. ఆవేశంగా అనేసింది.

అప్పాదొరై తెలుగు పండితుడు. అందులో శ్రీనాథ పండితులవారి పద్యాలన్ని కంఠస్థముచేశాడు. అతని శృం గార రస రాజ్యాభిషిక్తురాలు కావల్సిన అర్హతలు, వసుం

ధరలో లేవు. వసుంధర పొట్టిగా పీలగావుండేది. కొద్దిగా పళ్ళుయెత్తు, సన్ననికళ్ళు, ఒక చాయ నలుపే అనొచ్చును. అనొచ్చు నేమిటి నలుపులో లెక్కే! వసుంధరవల్ల అతని శృంగారతృష్ణ తీరదని, అతను పెళ్ళిరోజునే నిర్ణయించుకున్నాడు-అందుకని.

"మూడు వేలు కాదు. ముప్పయ్ వేలు నోట్లల్లో నిన్ను కప్పెట్టినా నీముఖాని కందంరాదు. తెలుసా!" విసురుగా అన్నాడు. వసుంధర మాట్లాడలేదు. నిలువునా చూశాడు అప్పాదొరై. మాసినకలనేతచీర, మసిబారినచేతులూ, ఏడుపు కొట్టు ముఖం! ఛీ! ఛీ! అసహ్యం పుట్టింది.

"ముష్టి మూడువేలకి ఈ ముండ రాజ్యంచేయటాని కొచ్చింది కాబోల్ను! నా ఇంట్లో వుండక్కర్లేదు. నీముఖం నాకు చూపెట్టకు - పో బయటికి!! నీకు దిక్కున్నచోట చెప్పుకో!" గర్జించాడు అప్పాదొరై!

అత్తగారివెంపు చూసింది వసుంధర.

"క్షమించండి! చిన్నప్పట్నించీ ఎలా మాట్లాడాలో తెలియదు. తల్లిలేని పిల్లని నా కెవరు నేర్పుతారు?" జాలిగా అంది వసుంధర.

"ఇందాకటినించిమీవాళ్ళు నేర్పినవే అంటున్నావా! మంచిమనిషి కోమాట-మంచి పశువుకో దెబ్బ! బుద్ధితెలుసుకుని మాట్లాడు!" అన్నది జ్ఞానమణి, పెద్దరికంగా.

తల్లి మెత్తబడుతుందేమో అన్న అనుమానం కలిగింది అప్పాదొరైకి.

"అమ్మా దీని పోషణ బాధ్యత నువ్వుతీసుకుంటావా చెప్పు!" అన్నాడు.

"ఏదో పోన్లెద్దూ చిన్నతనం" అనునయంగా అన్నది జ్ఞానమణి.

కోపం, దుఃఖం, అసూయ, ఎదుటవాళ్ళు సముదాయించినకొద్దీ ఎక్కువవుతాయి. అప్పాదొరైలోని తీరని అందాలదాహం, ఖస్సుమని లేచింది.

"నీకు పెద్దతనం! దానికి చిన్నతనం! ఇంక మధ్యని నేనే మట్టికొట్టుకు పోవాల్సినవాణ్ణి. ఏమయినాసరే; నువ్వు నా కళ్ళపడకుండా పో! నీ దరిద్రపు మొఖాన్ని చూస్తూ నేనీ ఇంట్లో తిరగలేను! ఇంక నన్ను చంపకు!"

వసుంధరకి భర్తఅంటే ఈ నాలుగయిదు నెలల్లోనూ అనురాగం కురిసిపోయిందేమీ లేదు. ఆ ఇంట్లో ఆమె అత్తగారి సహాయకురాలిగా మాత్రమే స్థానం సంపాదించుకున్నది. ప్రకృతిసిద్ధంగా ఆమె హిందూ వనితయై వున్నందుకు, భర్త తిరస్కారంవల్ల చాలా బాధపడింది. ఎన్ని అన్నా మూగగా భరించింది.

వసుంధరకి తన ఇల్లాలితనం వెగటుగా తోచింది. పెళ్ళయినది మొదలు భరిస్తోంది. ఒక మంచిమాట లేదు, తనేదో త్యాగంచేసినట్లు డబ్బావాయించుకోవటం తప్పిస్తే! పోనీ తన కడుపు ఫలించిందా అంటే అదీ లేదు! ఇంక దేని కని వీళ్ళ అవమానపు చర్యలని సమర్థించుకుంటూ కాలం

గడపటం! సీత, సావిత్రి అంటే వాళ్ళకి భర్తల అనురాగ ముంది కనుక, కష్టాలెన్నైనా భరించారు. అప్పాదొరై లాంటివాళ్ళయితే, ఏం చేద్దురో! ఒకళ్ళ మంచితనం, బుద్ధిమంతతనం, నలుగురూ గమనించేట్లు వుండాలంటే, వాళ్ళ పరిసరాలుకూడా, మంచితనంతో నిండివుండాలి. అయినా ఆఖరు ప్రయత్నంగా అంది వసుంధర.

"నావల్ల తప్పులేమైనా జరిగివుంటే మన్నించండి, నాకు తల్లా? తండ్రా! ఎక్కడికి పోతాను?"

"నీ ఇష్టంవొచ్చినచోటికి పో!"

ఆ వెళ్ళటం, వెళ్ళటం అన్నయ్యల దగ్గరకి వెళ్ళకుండా చిన్ననాటి సంగీతం మాష్టరు కోదండయ్యగారి దగ్గరకు వెళ్ళింది. వసుంధర అన్నయ్యలు ఆదరించరని తెలుసు. వాళ్ళకి వసుంధర ఎప్పుడూ కంట్లోనలుసే! తండ్రి పైరివేట్లు చెప్పుకుంటూ బోలెడు ఆర్జించాడనీ, అది అంతా వసుంధర కిచ్చేశాడనీ వాళ్ళ నమ్మకం!

కోదండయ్యగారు అంతా విన్నారు.

"ఒక్కొక్కళ్ళి ఒక్కొక్కలా జీవించమని సృష్టిస్తాడు తల్లీ, భగవంతుడు! నీ గొంతులో అపూర్వనాదం వుంది, అది సార్థకపరుచుకో తల్లీ!

'ఏకం సంగీత విజ్ఞానం—చతుర్వర్గ ఫలప్రదమ్' అన్నారు పెద్దలు. నీ గానం అమరమవుతుంది. అందుకే, నీకీ సంసార విచ్ఛేదన లభించింది" అన్నారు కోదండయ్యగారు. ఆయనే మద్రాసులో వీణ కుప్పయ్యర్ వంశీకులైన రామస్వామిఅయ్యర్‌గారికి వసుంధరని అప్పగించేరు. వడి

వేలుకూడా ఆ సమయంలో అక్కడ వయొలిన్ నేర్చుకునే వాడు. ముందు ముందు కొద్దిగా ఇరుగూ పొరుగూ అమ్మాయిలకి సరిగమలు, గీతాలూ నేర్పి, అయిదూ పదీ సంపాదించుకునేది వసుంధర, క్రమక్రమంగా అక్కడక్కడా కచ్చేరీలు చేయటం ప్రారంభించింది. దానికి వడివేలు వో త్తిడి ఎక్కువ కారణం అనొచ్చును. వడివేలు తనని ఎక్కడ వయొలిన్ వాయించమన్నా వసుంధర గాత్ర మాధుర్యాన్ని వర్ణించి చెప్పేవాడు. అలా అలా పాప్యులర్ అయిపోయింది. కాస్సేపు ఆలోచించింది వసుంధర.

"మమ్మీ! ఏమిటి ఇక్కడే నిలబడిపోయారు?" అన్నాడు వాసుదేవన్.

ఆఁ! మీరుకూడా రండి!" అన్నది అప్పాదొరై నుద్దేశించి.

అప్పాదొరై మారు మాట్లాడకుండా వసుంధరతో కారెక్కేశాడు. వాసుదేవన్ డ్రైవరు సీట్లో కూర్చుని కారు స్టార్టుచేశాడు. వేరొకకారులో విమలా దేశికన్, అయ్యాపిళ్ళై, వడివేలు, రామానుజం, తంబురా, వయొలిన్, మృదంగం వాయిద్యాలు పెట్టుకుని కూర్చున్నారు.

"చంద్రా మాన్షన్" చాలా పెద్దభవనాలతో నిండి వుంది. నాలుగు వెంపులా నాలుగేసి అంతస్థులున్న పెద్ద మేడలు! చుట్టూ పెద్దపెద్ద వృక్షాలు! మధ్యన వాసుదేవన్ తాతగారైన రావుబహద్దూర్ అశోకన్‌గారి పెద్ద శిలా విగ్రహం! దానిముందర పౌంటెన్! చుట్టూ పూలతోట! ఒక మేడ క్రిందిభాగంలో, ప్రెస్ వుంది. ఒక వెంపు

మేడలో, నృత్య కళాశాలవుంది. ఒక పెంపుమేడలో. క్రింది భాగంలో వాసుదేవన్ ఫామిలీ వుంటోంది. వాసుదేవన్‌కి సంగీతం అంటే చాలా అభిమానం. అతని ఆర్థిక సహాయంతో నగరంలో చాలా సంస్థలు నడుస్తున్నాయి. అందులో లక్ష గ్రంథాలు సేకరించిన అశోక లైబ్రరీ ఒకటి. దాని భవన నిధికి వసుంధర ప్రోగ్రాం పెట్టారు. ఆ ప్రోగ్రాం అయ్యేదాకా తమ అతిథులుగా వుండమని వసుంధర ట్రూప్‌ని ఆహ్వానించారు. వసుంధరకికూడా వాసుదేవన్ పెద్దమనిషితరహా నచ్చింది. వాసుదేవన్ భార్యా, నలుగురు ఆడపిల్లలూ కూడా చాలా సంస్కారవంతులు. అంచేత వాళ్ళింట్లో వుండటం వసుంధరకు నచ్చింది. ఇంటికి రాగానే వాసుదేవన్ లోనికి వెళ్ళిపోయాడు. విమలా, అయ్యపిళ్ళ, వడివేలు, మాణిక్యవేలు, రామానుజం, ఎవళ్ళకిచ్చిన గదుల్లోకి వారు వెళ్ళి నిద్రాదేవతని ఆహ్వానించే ప్రయత్నంలో పడ్డారు. సుమతీ వాసుదేవన్ వొచ్చింది 'మూడు గంటలౌతూంది అప్పుడే! మమ్మా! ఏమీ తీసుకోరా!' అంది.

"వొద్దమ్మా!" అన్నది వసుంధర.

సుమతి అవతలికి వెళ్ళిపోయింది. హాలులో వసుంధర ఒక సోఫాలో తను కూర్చుంటూ—

"కూర్చోండి." అన్నది, అప్పాదొరై నుద్దేశించి.

అప్పాదొరై కూర్చున్నాడు.

పైన గిరగిర తిరిగే ఫాన్ వంక చూస్తూ—

"చెప్పండి!" అన్నది వసుంధర.

"చెప్పేందుకేముంది? నువ్వీ వూరు ప్రోగ్రామ్ ఇవ్వటానికొస్తున్నావని, నాకు నిన్ననే తెలిసింది. అంచేత వుత్తరం వ్రాసినా అందదుకదా అని వ్రాయలేదు."

"దేనికి?"

"అమ్మ చనిపోయింది! తెలుసా?"

"వూఁ" అన్నది వసుంధర.

"మరి?" ప్రశ్నార్థకంగా చూశాడు.

"అందుకని రాలేదనా?"

"అవును."

"అప్పటికి మీరు ముగ్గురు పిల్లల తండ్రి వయినారని తెలుసు! అయినా అత్తగారు చనిపోగానే నేను రావటానికి, ఆమె అంతట ఆమె ఒక్కరే నన్ను వెళ్ళగొట్టలేదు కదా!" అన్నది.

"అప్పుడుకాదు! నువ్వు ఈ వూరు వస్తోన్నప్పుడు, మనింట్లో దిగకుండా, ఇక్కడదిగటం ఏం బాగుంది?"

"నేను వక్కర్తినీ రాలేదు కదా! ఎప్పుడూ అయిదారుగురు కూడా వుంటారు" అన్నది.

అహంభావం వినిపించింది అతనికి.

"రామానుజం ఎవరు?" అన్నాడు.

"దిక్కులేనివాడు. అనాథ శిశువు! వచ్చే కాలానికి ఆసరాగావుంటాడని పెంచుకున్నాను! నా కొడుకు అనుకున్నారా? కాదు!" తనమీద ఎలాంటి అపోహలుంటాయో తెలుసును వసుంధరకి.

అప్పాదొరై మాటాడలేదు.

"కాని, నా కొడుకు నుల్లేనే పెంచుకున్నాను."
దృఢంగా అన్నది మళ్ళీ.

"ఏమయినా నువ్వు మనింటికి వొచ్చెయ్యటం మంచిది. గతంగతః! ఇంత పేరు తెచ్చుకున్నాక, ఇంకా, ఆ బ్లాక్ మార్కు వుండటం మెచ్చుకోతగ్గ విశేషం కాదు!" అన్నాడు అప్పాదొరై.

"ఏ బ్లాక్‌మార్కు-వల్ల నేనింత పేరు తెచ్చుకోగల్గే అవకాశం కల్గిందో, ఆ బ్లాక్‌మార్కుని మధ్యలో వదిలేసుకోవటం, అంతకన్నా మెచ్చుకోదగ్గ విశేషం కాదు!" అన్నది వ్యంగ్యంగా.

"నానించి వచ్చిన కళంకం నాఃంచే పోగొట్టాలని చూస్తున్నాను. ఇక్కడ్నించి నువ్వు మాతోనే వుంటం శ్రేయోదాయకం" అన్నాడు.

"మీరు పొరబడుతున్నారు 'భర్తారక్షతి యౌవనే' అన్నారు. ఆ దశ నాకు దాటిపోయింది. ఇంక కుమారుడు రక్షించాల్సిన దశలో వున్నాను. అందుకనే రామానుజాన్ని పెంచుకున్నాను. యౌవనదశలో నేను అరక్షణీయనై పోయాను. ఇప్పుడు మీ రక్షణ నాకనవసరం! గూటిలోంచి ఎగిరిన పిట్ట మళ్ళీ ఆ గూటిలోనే నివాసం ఏర్పరుచుకుంటుందా? ఎప్పుడన్నా!"

"అయితే నువ్వు ఎగిరే పిట్టవన్నమాట!" కచ్చగా అన్నాడు అప్పాదొరై.

"అంత మంచి ఉపమానం తేకండి నాకు! పిట్టలు చాలా హాయిగా స్వేచ్ఛగా ఎగురుతాయి, ఆ హాయి నాకు లేదు. కొన్ని లక్షల సంశయాలవలలో బందీని నేను! ఎగురుతూన్నది నేనుకాదు. నాలోని అంతర్వేదన!"

"నీకు మంచిపేరు తెచ్చుకుని జీవిత చరమాంకాన్ని తేలిగ్గా గడుపుకుందామంటే, మా ఇంటికి రావొచ్చును. నా అభ్యంతరం లేదు- అని చెప్పుదామని వొచ్చాను" అన్నాడు.

"మీకు అభ్యంతరం వుండదని నాకు తెలుసును. ఎందుకని వుండదో కూడా నాకు తెసును. వుంకండి వస్తాను" లోపలికి వెళ్ళింది వసుంధర.

అప్పారావ్ సంతోషపడ్డాడు, తమతో వుంటుందన్నమాట! వుండక ఏం చేస్తుంది? పెద్దదైపోతోంది. రెండు చేతులా ఆర్జించింది. స్థిరత్వం అన్నది లేకుండా ఇంకెంత కాలం తిరుగుతుంది! తమతో వుంటే, ఆమె జీవితం ప్రశాంతంగా గడిచిపోతుంది. తను ఇంటిలోనే, ఒక సంగీత కళాశాల తెరవచ్చును. "చూడ" ఎంతో సంతోషిస్తుంది! "చూడ"ది ఎంత నిర్మల మనస్సు! కోరికోరి సవతిని ఆహ్వానించకలుగుతోందంటే ఆమె సరళ స్వభావం ఎంతటిదో కొలవలేముకదా! దీనికి చిన్నప్పట్నించీ అహంభావం. అమ్మ ఏదైనా అంటే బుస్సుమనిలేచేది! తనకే అసహ్యం వేసింది. "చూడ" మాత్రం తన తల్లి వుండగా కాపరం చెయ్యలేదా? ఏమన్నా అంటే గుడ్లనీరు గుడ్ల కుక్కుకుంటూ జాలిగా తనవెంపు చూసేది! అంతం అంతా తనకర్పించి, అయిదుగు

రాడపిల్లలతో విస్సహాయంగా నిలబడింది! దీనిలా "స్టేజ్" లెక్క తందనాలాడితే అదీ సంపాదించును లక్షలు! ఇప్పటికింకా తనెదురుపడితే లజ్జతో గన్నేరు మొగ్గ అయిపోతుంది "చూడ."

దీన్ని చేపదీస్తే, బొత్తుగా గాలికి వదిలేయకుండా ఆదరించే పుణ్యమూ దక్కుతుంది- తన నిర్ధనత్వమూ తీరుతుంది. ఒక దెబ్బకి రెండుపిట్టలు! ఒకవేళ అన్నగార్లు వచ్చి దీన్ని సముదాయించి లాక్కుపోతారేమో! అల్లా వెళ్ళదు! తనింట్లోంచి వెళ్ళగొట్టిజేసే అన్నల అండ చేరలేదు! అల్లాంటిది ఇప్పుడా! మర్యాద ప్రధానం కాని, డబ్బుందికదా అని ఎక్కడపడితే అక్కడ వుండటం సంఘం వొప్పుకుంటుందా? సంఘం పెట్టేబాధలు, అనే ఈటెపోటుల్లాంటి మాటలు పడలేకనే తను మాటవరసకు అనగానే వుండటానికి వచ్చేస్తూంది. అప్పాదొరై ఫ్యాకేసి చూశాడు. గిరగిరా తిరుగుతూంది. పడివేలు గదిలోంచి సన్నగా వయొలిన్ వాద్యం వినపడుతోంది. అప్పాదొరై ఆలోచిస్తూ కూర్చున్నాడు. వసుంధర లోపలికి వెళ్ళి గంటకావస్తోంది- ఏం చేస్తోందా? అన్న అనుమానం పడేలోపునే వసుంధర తిరిగివచ్చింది. వచ్చింది వచ్చినట్లు తీరిగ్గా సోఫాలో కూర్చుంది.

"వెళ్దామా?" అన్నాడు అప్పాదొరై. రాత్రంతా నిద్రలేక పోవటంవల్ల అతని కళ్ళు కూరుకుపోతున్నాయి.

"ఎక్కడికి?" నవ్వింది వసుంధర.

"మనింటికి?" ధైర్యంగా అన్నాననుకున్నాడు అప్పాదొరై.

"మీ ఇంటికి అనండి! అదెప్పుడూ నా ఇల్లుకాదు ! ఇప్పుడు అవుతుందా! ఎప్పుడూ కాబోదు. అదే ఆలోచించాను ఇంతసేపూ! స్త్రీ సహజమైన చాపల్యం, మీరు పిలిచినదే తడవుగా మీతో వుండటాన్ని ప్రోత్సహించింది. కాని, ఆలోచనాశక్తి వెనక్కులాగింది. ఇన్నాళ్ళు అతకనిది ఇప్పుడు అతుకుతుందా? అనిపించింది. ఇంక పోతే మీరు చాలా ఇబ్బందుల్లో వున్నట్లు మాణిక్యవేలు చెప్పాడు. భగవంతునిదయవల్ల నేనేదో ఆర్జిస్తున్నాను. మీరు మొహమాటపడకుండా డబ్బు కావలసివచ్చినప్పుడు నాకు తెలియచేయండి, ఇస్తాను. ఇప్పుడు ప్రస్తుతం నాదగ్గర అయిదువేలున్నాయి అవి ఇస్తాను. పట్టుకెళ్ళండి. ఇంటికెళ్ళాక, ఇంకా పంపిస్తాను. మీ పిల్లలకి శుభ్రమైన సంబంధాలు వెతికి పెళ్ళిళ్ళు చేయండి! మీకు నాదగ్గర మొహమాటంవొద్దు" అన్నది వసుంధర! ఆమె ముఖం గర్వమహత్వంతో వెలిగిపోతూంది.

అప్పాదొరై నిర్ఘాంతపోయాడు. ఇందాకట్నించీ తను ఆమె దిక్కులేక తిరుగుతూందనీ, అందుచేతనే ఆమె తన ఆశ్రయాన్ని ఆనందంగా స్వీకరించుతున్నదనీ, అనుకున్నాడు. కథ తారుమారైంది.

"రావన్న మాట! మాతో వుండటం నీకిష్టంలేదన్న మాట!"

"మళ్ళీ మళ్ళీ అడుగుతూ, నన్నూ నా మనస్సునీ, నొప్పించకండి" అన్నది వసుంధర! ఆమె కళ్ళు చెమ్మగిల్లాయ్ బాధతో!

కాకులు లేచాయి! లోకులు లేచారు! అప్పాదొరై లేచాడు! ఎగిరేపిట్టలు ఎగురుతున్నాయి! నాయన కన్నె మనసున వలపు తలపులు ఎగురుతున్నాయి! చూడికుడుత్తమ్మను శంకలతో నిండిన, మాతృత్వపు మమకారము తెలిమబ్బులా ఎగురుతోంది.

ఆకాశం అంతా నవోత్సాహంతో చైతన్యవంతంగా ఎగురుతోన్న పిట్టలనీ, మబ్బులనీ, చూస్తూ, "చంద్రా మ్యాన్షన్" దాటి ఆరుమైళ్ళ దూరంలోవున్న గాంధీ నగరం కేసి, నడుస్తున్నాడు అప్పాదొరై!

"ఎగిరే పిట్టలా ఎగరాలని వుంది!"

అంటూ కూని రాగంతీస్తూ హాల్లోకివచ్చింది విమలా దేశికన్. సోఫాలో కూర్చుని, కళ్ళు చీర చెంగుతో తుడుచుకుంటున్న వసుంధరనిచూసి, "రాత్రి నిద్రపోలేదామమ్మా. అయినా బొత్తుగా మూడయిపోయింది" అన్నది.

"నిద్ర పట్టలేదే అమ్మాయ్!" అంది వసుంధర.

"ఇవ్వాళ రాత్రి పదయ్యేసరికి ఆ పేద్దాం" అన్నది విమల.

ఆ పిల్ల హాసముఖాన్ని చూస్తూ, నిట్టూర్చింది వసుంధర.

—o—



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B150 |
| పుస్తకం పేరు | పుట్టిల్లు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 269 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Apsar |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |